శ్రీ వాసుదేవయతి విరచితమ్

# శ్రీ లఘువాసుదేవమననమ్

## అద్వైతవేదాన్త ప్రకరణ గ్రంథః





తెలుగు, సేత - శ్రీ నోరి భోగీశ్వర శర్మ, M.A., Ph.D.

ప్రకాశయిత్రి - శ్రీ నారాయణ శంకర భగవత్పాద సరస్వతి
గండికోట వీధి, కొవ్వూరు, ప॥గో॥జిల్లా. ఆం.ప్ర. ఫోన్ : 08813-232131

వెల : 40-00

04-04-2011.

Presented by Sri Kumaraswamy Bitla.

# లఘువాసుదేవమననము


1) శ్రీవాసుదేవయతి విరచితమ్. తెలుగు - అనువాదము

2) నోరి భోగేశ్వరశర్మ

3) ప్రకాశయిత్రీ- శ్రీనారాయణశంకరభగవత్పాద సరస్వతీ

4) సహృదయ హృదయ సంచారిణ్యాః శ్రీ శారదాంబాయాః
చరణసరసిజయోస్స మర్పితః శుభైకోనవింశతి ప్రసవః

5) ముద్రణమ్, శ్రీ లక్ష్మీగణపతిముద్రణాలయే కొవ్వూరు.
ఫోన్‌నెం. (08813) 231575

6) మొదటి ముద్రణపు ప్రతికృతులు :- 1,000

7) వెల -40-00

8) ప్రతులకు -
శ్రీ శివకామేశ్వరీ గ్రంథమాల 41-22/4-36,
భ్రమరాంబపురం-కృష్ణలంక - విజయవాడ-13
ఫోన్:- 2522824

9) ప్రాప్తిస్థానమ్- శ్రీ నోరి భోగేశ్వరశర్మ, ఎమ్.ఏ.పిహెచ్‌డి.
12-2-3/1 గండికోట వారి వీధి కొవ్వూరు- 534 350
కొవ్వూరు మండలం, పశ్చిమగోదావరిజిల్లా
ఫోన్ నెం. 08813 - 232131

# సహృదయనివేదనము

ఓంనమోభగవతే వాసుదేవాయఇయ్యది వాసుదేవద్వాదశాక్షరీ మహా మంత్రము ఈగ్రంథము 46 ప్రకరణాలుగా వాసుదేవమననము అను పేరుతో వాసుదేవయతీంద్రులచే రచింపబడినది. ఐనను అజ్ఞానులకు అలసులకు సంగ్రహముగానైనను అద్వైతసిద్ధాన్తము తెలియజేయదలచి వాసుదేవద్వాదశాక్షరిమంత్రాక్షరముల సంఖ్యతో 12 ప్రకరణములుగా గ్రంధకర్తయే మరలా రూపొందించినాడు. వసుదేవుని కుమారుడు కాన వాసుదేవుడు =వసుదేవుని పుత్రుడు కృష్ణుడు అను ఒక అర్ధము ప్రసిద్ధమైనది. ఇక వసతీతి వాసుః దీవ్యతీతి దేవః అనువ్యుత్ప త్తిని బట్టి అందరి హృదయాకాశములందు అన్నిటా ప్రకాశించు పరబ్రహ్మ తత్త్వము ఇందు ప్రతిపాదితమైనది. అను రెండవ అర్ధము గ్రంధసాంగత్యము నామ సార్ధక్యముకలిగి పరబ్రహ్మార్ధకమైనది వాసుదేవశబ్దము. ఇక మననము అను దానికి చింతించుటఅని అర్ధము అనగా యుక్తులతో ఒకేఒక్క తత్త్వము ఎడతెగని నూనె ధారవలె చింతించుట వేదాన్తవాక్యశ్రవణముచేసి యుక్తులతో ఇతర ప్రమాణములచే కలుగు సందేహములను నివారించుకొను మానసిక వ్యాపారముకాన వాసుదేవమననమునకు పరబ్రహ్మతత్త్వమునందు ఎడతెగని నిశ్చయతానాత్మకమగు చింతనము అని అర్ధము. దీనిని సంగ్రహముగా లేక లఘువుగా జిజ్ఞానువులకు అందజేసినగ్రంధము కాన లఘువాసుదేవమననము అను పేరు ఈ గ్రంథమునకు సార్ధకము.

వాసుదేవానందసరస్వతి యతీంద్రులు లేక వాసుదేవయతులు మహారాష్ట్రులు,మహాయోగీశ్వరేశ్వరులు, శాంకరఅద్వైతా నందతుందిలులు, వీరికి ఆనాటికి శిష్యులు, అంతటి యోగులు అద్వైతానందానుభవజ్ఞులు పలువురు కలరని ప్రసిద్ధి. మరియు వీరు ముందు దత్తాత్రేయోపాసకులు సంస్కృతభాషయందు గురుచరిత్ర సుమారు 7,8 వేల శ్లోకాలతో రచించినారు. వీరి శిష్యులలో బ్రహ్మానంద తీర్ధులు ఒకరు. బ్రహ్మానంద స్వాములు, యోగులు ఒకపరి బాపట్లలో భావనారాయణస్వామి రథము

క్రింది భాగమున వేపచిగురు, నీరు భోజనముగా కలిగి 7,8 రోజులు ఉండిరట.ఆ సమయాన అచ్చటివారు వీరిని పరిహసించెడివారట ఆరోజులలో ఒక రోజు పూర్ణిమఅగుటవలన సముద్ర స్నానానికై బయలు దేరిరి. సముద్రమునకు పోవు మార్గము క్రూరమృగములతో కూడియుండుట వలన గుంపుగుంపులుగా జనులు వెళ్ళు చుండెడివారు. దారికి అడ్డముగా మెలకువతోగాండ్రించు పెద్దపులిని చూచి వెనుకకువారు తిరిగిరి స్వామివార్కి వారందరూ పెద్దపులి ఉన్నదని హెచ్చరించిరి. వీరు సరకుసేయక ఆమార్గమున ముందుకు సాగిరి. నేరుగా గాండ్రించుచున్న పులివద్దకువెళ్ళి చేతితో అడ్డములెమ్మని సంజ్ఞచేసిరి, ఆ పెద్దపులి ఏమీ హింసచేయక తనత్రోవన తాను వెళ్ళినది. ఈ సంగతిని దూరమునుండి చూచిన బాపట్లపురజనులు, ఈసన్యాసిదిగంబరుడు, సామాన్యుడుకాడు, అని ఈతని యోగశక్తి అనన్యసామాన్యమనిగుర్తెరింగి స్నానముచేసి తిరిగివచ్చిన స్వామికి ఆపురజనులు భక్తులైరి, అట్టిభక్తులైన వారిని అనుగ్రహింప చేయదలచి శంకర విద్యాలయము అందు శ్రీ శంకర దత్తాత్రేయ, గాయత్రీదేవతలను ప్రతిష్ఠించి సంస్కృత పాఠశాలపెట్టించిరి నేటికిని అదికొనసాగుచున్నది. శ్రీతాడేపల్లిరాఘవనారాయణశాస్త్రి గార్కి స్వప్నసాక్షాత్కారము పాదుకాన్త దీక్షను ఒసంగిన యోగిపుంగవులు యోగమూలకాద్వైతవేదాన్తానుభవమునకు మార్గదర్శకులు, కాన వాసుదేవానంద సరస్వతీ యతీంద్రుల చరిత్రము కర్ణాకర్ణికగా అనేకుల వలన వృత్తాంతములు కోకొల్లలుగా కలవు బ్రహ్మానంద తీర్థస్వాముల వారి గురువులు వాసుదేవానంద సరస్వతీ యతీంద్రుల పాదస్పర్శచే ఆనాడు దేశము పునీతము, పలుతావులందు దత్తాత్రేయ శంకరగాయత్రీ ప్రతిష్ఠలు శంకర మఠాలు, నెలకొల్పబడినవి అనగా 80 లేక 100 సంవత్సరాల క్రితము వారి పర్యటనము కాన 1920కాలముగా ఊహింపవచ్చును వాసుదేవానంద సరస్వతీ యతీంద్రులు వాసుదేవ యతులు ఒక్కరే అని కొందరి భావన .

# ఓం సంగ్రహపరిచయము.

వాసుదేవ మననము:- ఇది అద్వైత వేదాన్త సిద్ధాంతమును క్లుప్తముగా విశదముగ,సమగ్రముగా ప్రతిపాదించు గ్రంథము. శ్రీవాసుదేవ యతీంద్రులు ఈ గ్రంథమును రచించిరి, మొదటవారి గ్రంథమును పెక్కుఉదాహరణ కథలతో నలుబదిఆరు వర్ణకములలో రచించిరి, పిదప కథలను ఉదాహరణలను తొలగించి క్లుప్తీకరించి, వారేద్వాదశ వర్ణకములతో లఘువాసుదేవమననమని పేరున ఈ గ్రంథము విరచించిరి. సర్వతః అవ్యయ బ్రహ్మనిష్ఠులగు వారికి పిండేష్వనాస్థాఖలు భౌతికేషు కదా; అట్టివారు తమ గ్రంథముల యందు తమను గూర్చిన వివరములను తెలియజేయరైరి. అయినను అట్టి మహనీయులు రససిద్ధులు క్రాంత దర్శులుఅగుటచే అజరామరులు, మానవజాతికి చిరస్మరణీయులు, ఆదర్శరూపులు.

జయంతితేసుకృతినో రససిద్ధాః కవీశ్వరాః।
నాస్తితేషాంయశఃకాయే జరామరణజం భయమ్॥

ఈ గ్రంథము అద్వైత సిద్ధాంత ప్రతిపాదకము, అద్వైతము నిర్గుణ పరబ్రహ్మబోధకము గదా ! మఱియూ వాసుదేవమననమని పేరేమి, అను సందేహము కలుగును. అట్టి వారికి శ్రీయతీంద్రులుజేసిన వాసుదేవ మననము అను నామధేయమే దానికి సమాధానము.అద్వైతము ప్రతిపాదించు బ్రహ్మము నిర్గుణము. నిరాకారము అయిననూ అది జగదాకారమున అభివ్యక్తమగుచున్నది. ఈ పరిదృశ్యమానము. శ్రూయ మాణమునగు జగమంతయు తదతిరిక్తము కాదు.

స్వర్ణోత్పాదితములైన కటక కుండలాదులు నామరూపములచే భిన్నముగా కన్పట్టుచున్నను స్వర్ణ వ్యతిరిక్తములు కానట్లు పరమేశ్వరోత్పన్న మై నానా నామరూపములతో బ్రహ్మవ్యతిరిక్తము కాదు. అను విషయమును సాధక మనోరూఢము చేయుచున్నందున వాసుదేవ మననము అను నామధేయము అన్వర్థము. కావున విభిన్ననామరూపములతో కన్పడు ఈజగత్తునకు బ్రహ్మానన్యత్వమును తెలియజేయునదియే

వాసుదేవ మననము.

విశ్వం-విష్ణుః వషట్కారః'' అనుచు విష్ణు సహస్రనామములు ఈ విశ్వమే విష్ణువు విష్ణువే విశ్వము అనుచు విష్ణువునకు విశ్వ స్వరూపము నకు అభేదమును చెప్పుచున్నవి. అనగా విశ్వమునందు వాసుదేవా భేదమును దర్శింపవలెనని చాటుచున్నవి. భగవద్గీతయందు భగవానుడగు శ్రీవాసుదేవుడునూ''పంచభూతములు, మనో బుధ్యహంకారములును నాప్రకృతులే, నా కంటే వేరుకావు నేనే నామ రూపమగు ఈ జగమంతయూ ధరించి యున్నాను. అని వివరించియున్నాడు. కావున ఈ విభిన్నమగు జగమంతయూ బ్రహ్మకంటె వేరుకాదు. .వేదమాతయు "యతోవాఇమాని భూతాని జాయంతే''ఇత్యాది శ్రుతులచే జాతమైనట్లు కన్పడు ఈ జగత్తుబ్రహ్మ నన్యమనిచాటుచున్నది. కార్యము కారణానన్యముగదా! అంగుళీయకము సువర్ణము కంటే భిన్నము కాదు, అట్లే పరమేశ్వరోత్ప న్నమగ ఈ జగత్తు కూడా బ్రహ్మనన్యము, వేదాన్త శాస్త్రము ఈ జగత్తు బ్ర హ్మనన్యమని -ప్రత్యగాత్మాబిన్నమని ఘంటా పధముగా చాటవచ్చునుగాని ఈ విషయము అనుభవమునకు వచ్చుట లేదు! అనువారలకు శ్రుతిమాతసులభమార్గమును ఉపదేశించుచున్నది.

ఆత్మావాఅరేద్రష్టవ్యః శ్రోతవ్యోమంతవ్యోనిది ధ్యాసితవ్యః, యత్రద్వైతమివ భవతి తదితర ఇతరత్ పశ్యతి. యత్రత్వస్య సర్వమాత్మైవాభూత్ తత్కేన కం పశ్యేత్ కేనకం జిఘ్రేత్

సర్వం ఖల్విదంబ్రహ్మ బ్రహ్మవేదబ్రహ్మైవ భవతి అనుచు బ్రహ్మత్మైక్య భావము చేకూరవలెనని ఉపదేశించుచున్నది. బ్రహ్మమననేమి నేనెవడను? భిన్నరూపములు గల ఈజగమేమి దీనిని ఎవరు సృష్టించిరి? ఎవ్వరివలన ఈ జగత్తు ఉనికి కలది. ఇది మారిపోవుచున్నది. చివరకు ఏమగును? ఈ జగత్తుకు నాకు గల సంబంధమేమి? ఈ విధముగా ఆత్మ విచారము చేయవలెను. అట్లు చేయగా చేయగా ఈ ద్వైత భావమంతయు నశించి బ్రహ్మాత్మ భావము కలుగును. అజ్ఞానము నివృత్తమగును. ఎవరు బ్రహ్మను తెలిసికొనునో (బ్రహ్మ భావమును పొందుదురో) అతడు బ్రహ్మయే వానికి ఈ ప్రపంచము బ్రహ్మభిన్నముగా భాసించదు

ఈ దృశ్యమాన జగమంతయు బ్రహ్మానన్యము అని నిర్ణయించి ప్రత్యక్షాది ప్రమాణములచే సాధకులకు కలుగు సందేహములు నివృత్తి జేయుచున్న ప్రక్రియావిశేషమే ఈవాసుదేవ మననము.

ఇట్టి యీ గ్రంథమననము ద్వారా సాధకుడు అజ్ఞానము నశింపచేసికొని దుఃఖమును (సంసారమును) తరించి బ్రహ్మాసాక్షాత్కారమును బడయును. పునరావృత్తిరహిత శాశ్వత బ్రహ్మాభావముపొందును.

" బ్రహ్మావేదబ్రహ్మైవ భవతి" గదా

ఇక గ్రంథప్రతిపాదిత విషయములను పరిశీలించెదము,

ప్రథమ వర్ణకమున మోక్షప్రాప్తి సాధనము, అధ్యారోపాపవాదములు, కారణప్రపంచసృష్టి, స్థూల సూక్ష్మ ప్రపంచ సృష్టి, వ్యష్టి సమష్టి భేదము, ఆవరణ శక్తి, విక్షేపశక్తి - అను విషయములు వివరింపబడినవి.

ద్వితీయ వర్ణకమున అనుబంధచతుష్ట యము. సాధన చతుష్టయము, అధికారికృత్యము, సద్గురు కృత్యము వివరింపబడినవి.

తృతీయవర్ణకమున ఆత్మానాత్మల వివరణము, ఏకత్వ నానాత్వాలు సత్యత్రైవిధ్యము, జీవుని స్వరూపము బ్రహ్మయే ఇదియే ఉపనిషత్తుల తత్త్వము అను విషయములు నిరూపింపబడినవి.

చతుర్థవర్ణకమున జీవునకు దుఃఖము ఆగన్తుకము, దుఃఖమునకు శరీరము కారణము, శరీరము కర్మవలన కలుగును. కర్మలేనిచో శరీరము ఉండదు. జ్ఞానాగ్ని సర్వకర్మలను భస్మము జేయును అను విషయములు ప్రతిపాదింపబడినవి.

పంచమ వర్ణకమున కర్మత్రైవిధ్యము, కర్మల భేదమువలన జన్మభేదము కర్తృత్వము కరణములకే గాని ఆత్మకు కర్తృత్వము లేదు. రాగాది ప్రేరితమైన కరణత్రయము కర్తృత్వమును పొందుచున్నది. ఆకర్తృత్వము భోక్తృత్వము ఆత్మయందు అధ్యస్తమగుచున్నది. షడ్లింగములు, మొదలగు విషయములు వివరింపబడినవి.

షష్ఠవర్ణకమున చిత్తవృత్తులు, వృత్తి విచారము, రాగాదులకు అభిమానమే కారణము, అభిమానమునకు అవివేకమే కారణము. అవివేకమునకు అనాదియగు అజ్ఞానము కారణము.జ్ఞానము

స్వరూపజ్ఞానము, వృత్తిజ్ఞానము,అని రెండు విధములు స్వరూపజ్ఞానము, వృత్తిజ్ఞానమునందుప్రవేశించి అజ్ఞాననాశము చేయును. అను విషయములు ప్రతిపాదింపబడినవి.

సప్తమ వర్ణకమున ఆత్మస్వరూపము, అనాత్మ స్వరూపము జీవ-ఈశ్వర భేదము, లక్షణాస్వరూపము, జహదజహల్లక్షణాస్వరూపము వివరింపబడినది.

అష్టమ వర్ణకమునందు బ్రహ్మయెక్క స్వరూపలక్షణము తటస్థ లక్షణము శరీరత్రైవిధ్యము క్రమసృష్టి, యుగపత్సృష్టి, వస్తుజ్ఞానమునకు ఉద్దేశ్యము, లక్షణము, పరీక్షఅనునవి మూడు ఉపాయములనియు, జ్ఞానేంద్రియ, కర్మేంద్రియ లక్షణములు ప్రాణపంచకలక్షణములు. అంతఃకరణ చతుష్టయము ప్రతిపాదింపబడినవి.

నవమ వర్ణకమున ఆత్మఅవస్థాత్రయ సాక్షి , సాక్షి లక్షణము ప్రమాణ చతుష్టయము వివరింపబడినవి.

దశమ వర్ణకమున అన్నమయాది పంచకోశములు, ఆత్మపంచకోశాతిరిక్తము, అధ్యాస, అధ్యాసకారణములు, సత్తాత్రైవిధ్యము వివరించబడినది.

ఏకాదశద్వాదశ వర్ణకములందు ఆత్మకు దేశతః కాలతః వస్తుతః పరిచ్ఛేద రాహిత్యమును నిరూపించి సర్వశ్రుతి తాత్పర్యమగు అఖండార్థత్వము (బ్రహ్మతత్వము) ప్రతిష్ఠింపబడినది.

ఇటుల ఈ గ్రంథమునందు సాధకుల సందేహ నివారణ పూర్వకముగా బ్రహ్మాత్మైకత్వము ప్రతిష్ఠింపబడినది. మననపూర్వకముగా ఆత్మాను భూతి(బ్రహ్మాను భూతి) పొందుటకు ఈ గ్రంథము సాధకులెల్లరకు ఉద్దిష్టమైనది. మననము జేసికొని వాసుదేవతత్త్వమును అనుభవింతురుగాక.

# ప్రార్థన

1. సర్వతంత్రస్వతంత్రాయ -సదాత్మాద్వైతవాదినే
శ్రీమతేశంకరార్యాయ-వేదాన్తగురవేనమః

2) యో ౨ వతీర్ణ ఇహాచార్య-రూపేణయతినాంముదే
శ్రీమన్నారాయణం వందే - తంహరింకరుణాకరం

3) మననాఖ్యంప్రకరణం-వాసుదేవయతీశ్వరైః
రచితం విస్తరేణాద్య-సంగ్రహేణ ప్రకాశ్యతే

4) బాలానాముపకారాయ-మమాపిజ్ఞానసిద్ధయే
తత్రశ్రీబాలగోపాల-కృష్ణస్సన్నిహితోభవేత్.

1) ఏ హరి ఆచార్యరూపముగా యతులకు, అందరియొక్క సంతోషముకొఱకు సాధనకులకు దగ్గఱగా దయానిధియై అవతరించెనో అట్టి గురువగు నారాయణునికి నమస్కారము.

2) ఏ హరి ఆచార్యుడు యతులకు, అందరియొక్క సంతోషముకొఱకు సాధకులకు దగ్గరఅగా దయానిధియై అవతరించెనో అట్టి గురువగు నారాయణునికి నమస్కారము.

3) వాసుదేవయతీశ్వరులచే లఘువాసుదేవ మననము అను వేదాంత ప్రకరణ గ్రంథం రచింపబడినది.
ఇయ్యది 45 ప్రకరణములచే పూర్వము నాచే రచింపబడినదైనను ఇపుడు సంగ్రహముగా 12ప్రకరణములుగా ప్రకాశింపజేయబడుచున్నది.

4) వేదాన్త పరిచయము పొందవలెననెడి బాలుర ఉపకారము కొఱకు నాకు కూడా జ్ఞానసిద్ధి కల్గుటకొఱకు ఈ వేదాన్త ప్రకరణము నాచే వెల్లడిజేయబడుచున్నది. ఇట శ్రీ బాలగోపాలకృష్ణుడు నాకు సన్నిహితుడగుకాక.

ఈ 4శ్లోకాలు వాసుదేవయతిచే విరచింపబడినవి.

ఓం నమో బ్రహ్మాదిభ్యో బ్రహ్మవిద్యా సంప్రదాయ కర్తృభ్యో
వంశ ఋషిభ్యోముని భ్యో మహద్భ్యో గురుభ్యః
ఓం సర్వోపప్లవరహితః ప్రజ్ఞానఘనః ప్రత్యగర్థో
బ్రహ్మైవాహమస్మి బ్రహ్మైవాహమస్మి
బ్రహ్మైవాహమస్మి.
అధీహి భో భగవః!

శ్లో ॥ కిం జ్యోతి స్తవభానుమానహని, మే, రాత్రౌ, ప్రదీపాదికం
స్యాదేవం, రవిదీపదర్శనవిధౌకింజ్యోతిరాఖ్యాహిమే
చక్షుస్తస్యనిమీల నాదిసమయేబుద్ధిః ధియోదర్శనే
కింతత్రాహమతోభవాన్ పరమకం జ్యోతిస్తదస్మిప్రభో

పగలు నీకు వెలుగు ఏమిటి? పగలు సూర్యుడువెలుగు, రాత్రియందు వెలుగు ఏమిటి? ప్రదీపాదులు, సూర్యచంద్రదీపాదులు చూచుటకు వెలుగు= జ్యోతిఏమి? నేత్రము దానిని మూసినపుడు వెలుగు ఏమిటి ? బుద్ధి, బుద్ధికి కూడ వెలుగు ఏమిటి? అది అహము ఆ ఆత్మయే నేనైఉన్నాను.

ఓం ఆదౌస్వరాజం గురుమద్వితీయం
అభేద విజ్ఞాన ఘనం మహేశం
సదాశివం సర్వగతైక భావం
మహేశ్వరం సంతత మాదిరుద్రమ్
నారాయణం పద్మభువం వశిష్ఠం
శక్తించ తత్పుత్ర పరాశరం చ
వ్యాసం శుకం గౌడపదం మహాంతం
గోవింద యోగీంద్ర మథాస్య శిష్యం
శ్రీ శంకరాచార్య మథాస్య పద్మ పాదం చ
హస్తామలకం చ శిష్యమ్
తం తోటకం వార్తికకారమన్యాన స్మద్గురూన్
సంతత మానతోఽ స్మి.

ఓం శ్రుతి స్మృతి పురాణానాం ఆలయం కరుణాలయం
నమామి భగవత్పాద శంకరం లోక శంకరమ్.
శంకరం శంకరాచార్యం కేశవం బాదరాయణమ్
సూత్ర భాష్య కృతౌ వందే భగవంతౌ పునఃపునః

## శ్రీదక్షిణామూర్తి స్తోత్రమ్

విశ్వందర్పణ దృశ్యమాననగరీ తుల్యం నిజాంతర్గతం
పశ్యన్నాత్మని మాయయా బహిరివోద్భూతం యథా నిద్రయా
యస్సాక్షాత్కురుతే ప్రబోధ సమయే స్వాత్మాన మేవాద్వయం
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే॥ 1

బీజస్యాంత రివాంకురో జగదిదం ప్రాఙ్నిర్వికల్పం పునః
మాయాకల్పిత దేశకాల కలనా వైచిత్ర్య చిత్రీకృతం
మాయావీవ విజృంభయ త్యపి మహాయోగీవ యస్స్వేచ్ఛయా
తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే॥ 2

యస్యైవస్ఫురణం సదాత్మక మసత్కల్పార్థగం భాసతే
సాక్షాత్తత్త్వమసీతి వేదవచసా యోబోధయత్యాశ్రితాన్
యత్సాక్షాత్కరణాద్భవేన్న పునరావృత్తి ర్భవాంభోనిధౌ
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే ॥ 3

నానాచ్ఛిద్ర ఘటోదరస్థిత మహాదీప ప్రభాభాస్వరం
జ్ఞానం యస్యతు చక్షురాదికరణ ద్వారా బహిస్స్పందతే
జానామీతి త మేవ భాంత మనుభాత్యేతత్సమస్తం జగత్
తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే॥ 4

దేహం ప్రాణ మపీంద్రి యాణ్యపిచలాం బుద్ధించ శూన్యం విదుః
స్త్రీ బాలాంధ జడోపమాస్త్వహమితి భ్రాంతా భృశం వాదినః

మాయాశక్తి విలాసకల్పిత మహావ్యామోహ సంహారిణే
తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే ॥ 5

రాహుగ్రస్త దివాకరేందు సదృశోమాయా సమాచ్ఛాదనాత్
సన్మాత్రః కరణోపసంహరణతో యో ఽ భూత్సుషుప్తః పుమాన్
ప్రాగస్వాప్సమితి ప్రబోధ సమయే యః ప్రత్యభిజ్ఞాయతే
తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే ॥ 6

బాల్యాదిష్వపి జాగ్రదాదిషు తథా సర్వాస్వవస్థాస్వపి
వ్యావృత్తాస్వనువర్తమానమహమిత్యంత స్స్ఫురంతం సదా
స్వాత్మానం ప్రకటీకరోతి భజతాం యోభద్రయా ముద్రయా
తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే ॥ 7

విశ్వం పశ్యతి కార్యకారణతయా స్వస్వామి సంబంధతః
శిష్యాచార్యతయా తథైవ పితృ పుత్రాద్యాత్మనా భేదతః
స్వప్నేజాగ్రతి వా య ఏషపురుషో మాయాపరిభ్రామితః
తస్మై శ్రీ గురుమూర&ితయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే ॥ 8

భూరంభాంస్యనలో ఽ నిలో ఽంబర మహర్నాథో హిమాంశుఃపుమాన్
ఇత్యాభాతి చరాచరాత్మక మిదం యస్యైవమూర్త్యష్టకం
నాన్యత్కించన విద్యతే విమృశతాం యస్మాత్పరస్మాద్విభోః
తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే । 9

సర్వాత్మత్వమితి స్ఫుటీకృతమిదం యస్మాదమిష్మన్ స్తవే
తేనాస్య శ్రవ ణాత్తదర్థ మననాత్ధ్యానాచ్చసంకీర్తనాత్
సర్వాత్మత్వమహావిభూతిసహితం స్యాదీశ్వరత్వం తత
స్సిద్ధ్యే త్తత్పున రష్టధాపరిణతం చైశ్వర్యమవ్యాహతం॥ 10

అంగుష్ఠ తర్జనీయోగముద్రావ్యా జేనసేవినాం శ్రుత్యర్థం బ్రహ్మజీ వైక్యందర్శయన్నో ఽ వతా చ్ఛివః సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరం పరమాత్మానం ప్రణతో ఽ స్మి సదాశివమ్



# శ్రీ లఘు వాసుదేవ మననమ్

అద్వైతానంద పూర్ణాయ వ్యాస శంకర రూపిణే

నమో ఽస్తు వాసుదేవాయ గురవే సర్వ సాక్షిణే ॥

ఏకమైన, పరిపూర్ణ ఆనంద స్వరూపుడు, వ్యాసమహర్షి, శ్రీ శంకరుల స్వరూపుడైన వాసుదేవ (వాసుదేవయతి) అను నామము గల సర్వసాక్షి యగు గురువునకు నమస్కారము.

మననాఖ్యం ప్రకరణం వాసుదేవ యతీరితమ్।

విస్తృతం తద్ధి సంగృహ్య బాలబోధాయ కథ్యతే ।

శ్రీ వాసుదేవయతి చెప్పిన వాసుదేవ మననము అను పేరు గల ఈ ప్రకరణము చాల విస్తారముగ ఉన్నది. దానిని సంగ్రహించి బాలురకు తెలియనివారికి సుఖముగ తెలియుటకు చెప్పబడుచున్నది.

## అథ ప్రథమ వర్ణకమ్

ఽ మోక్ష శ్రేష్ఠతానిరూపణమ్ ఇహఖలు ధర్మార్థ కామమోక్షాణాం చతుర్ణాం, పురుషార్థానాం మధ్యేమోక్ష ఏవపరమపురుషార్థః । నిత్యత్వాత్। న స పునరావర్తతే న స పునరావర్తతే ఇతి శ్రుతేః । ఇతరేషాం త్రయాణాం న తథాత్వం అనిత్యత్వాత్ ।

ఈ లోకమున నిశ్చయముగా ధర్మ, అర్థ, కామ, మోక్షములను నాల్గువిధములగు పురుషార్థములలో మోక్షమే పరమపురుషార్థము. నిత్యమైనది (శాశ్వతమైనది కనుక). మోక్షమును పొందినవాడు "తిరిగి రాడు ఽ తిరిగి రాడు" అని 'శ్రుతి' చెప్పుచున్నది. మిగతా మూడు పురుషార్థములకు 'పరమ పురుషార్థము''అను పేరు లేదు అవి అనిత్యములు, అశాశ్వతములు, అగుట వలన ధర్మార్థకామములకు పురుషార్థములనియే పేరు.

" తద్యథేహ కర్మచితో లోకః క్షీయతే" । ఏవ మేవాముత్ర

పుణ్యచితో లోకః క్షీయతే' ఇత్యాదిశ్రుతేః । 1

యజ్ఞ యాగాది పుణ్యకర్మలచేత పొందిన స్వర్గాదిలోకము కూడా ఈ లోకములోని వ్యవహారమువలె పుణ్యము క్షీణించగనే ఆలోకము

అనిత్యము క్షీణించును. సర్వము అనిత్యము క్షణికము అని శ్రుతియే చెప్పుచున్నది. (పురుషార్థములనగా పురుషుని చేత కోరబడునవి. పురుషుడనగా " పురిశయనాత్ పురుషః". అనగా తొమ్మిది ద్వారములు కల్గిన ఈ శరీరమే పురము తానుఅనిఅభిమానించి అందుండు జీవుడే పురుషుడు.)

మోక్షోపాయ ః

'సమోక్షో బ్రహ్మజ్ఞానాదేవ సిద్ధ్యతి '।" తమేవ విదిత్వా-తి మృత్యుమేతి" "నాన్యః పన్థా విద్యతే ఽ యనాయ" " బ్రహ్మవిదాప్నోతి పరమ్" ఇత్యాదిశ్రుతిభ్యః ।

మోక్షోపాయము

" ఆ మోక్షము బ్రహ్మజ్ఞానము వలననే సిద్ధించును". "ఆబ్రహ్మమును తెలిసికొనినవాడు మృత్యువును దాటును." "ఆ బ్రహ్మమును తెలిసి కొనకుండా మోక్షమును పొందుటకు మరియొక మార్గము లేదు." "బ్రహ్మమును తెలిసికొనినవాడు పరమపదమును పొందును." అను మొదలైన శ్రుతులే ఇందులకు ప్రమాణములు.

అధ్యారోపాపవాదౌ" తద్బ్రహ్మచాధ్యారోపాపవాదాభ్యాం జ్ఞాతవ్యమ్" " అధ్యారోపాపవాదాభ్యాం జ్ఞాతవ్యస్తత్త్వ నిర్ణయః"॥ " న కర్మణా, న ప్రజయా, ధనేన త్యాగేనైకే -అమృతత్వమానశుః" ఇతి వచనాత్ । తస్మాన్ముముక్షుణా అధ్యారోపాపవాదావవశ్యం జ్ఞాతవ్యౌ ।

అధ్యారోపాపవాదపరిచయము ఆబ్రహ్మముఅధ్యారోపఅపవాదముల చేతనేతెలియదగియున్నది.అధ్యారోపఅపవాదములచేతనే తత్త్వనిర్ణయము చేయవలెనని శ్రుతి పల్కుచున్నది. కర్మలచేత, బిడ్డలచేత, ధనముచేత అది పొందుటకు వీలులేనిది - ఒక్క త్యాగము వలననే ఆ అమృతత్వ స్వరూపమగు బ్రహ్మమును సాధకులు తెలిసికొనగలరని శ్రుతి వచనము. ఆ కారణముచేత మోక్షమునందు అపేక్ష కల్గిన వారు తప్పకుండా అధ్యారోపాపవాదములను తెలిసికొనవలసియున్నది.

' అధ్యారోపో' నామ శుక్తికాయాం రజతవత్, రజ్జౌసర్పవత్,

స్థాణౌపురుషవత్ నిష్ప్రపంచాత్మవస్తుని ప్రపంచారోపః । అయమ్ అధ్యారోపో వస్త్వజ్ఞానాదాగతః । తదజ్ఞానమేవ అవిద్యా, తమో, మూల ప్రకృతిః, ప్రధానం, గుణసామ్యమవ్యక్తం మాయేతి చోచ్యతే

అధ్యారోపము అనగా ముత్యపుచిప్పయందు వెండియను భ్రాంతిని, త్రాడునందు పాము అను భ్రాంతిని, స్తంభమునందు పురుషుడను భ్రాంతిని పొందినట్లు, ప్రపంచము కాని ఆత్మయందు ప్రపంచమున్నట్లుగా మనము భావించుట. ఈ అధ్యారోపము అచ్చట ఉన్న అసలైన వస్తువు తెలియనందువలన కల్గుచున్నది. ఈ అజ్ఞానమే అవిద్య అని, తమస్సు అని, మూల ప్రకృతియని ప్రధానమని, గుణసామ్యమని, అవ్యక్తమని, మాయ అని వేరువేరు పర్యాయపదములతో చెప్పబడుచున్నది.

" మూలప్రకృతిర్నామ శుక్ల, రక్త, కృష్ణ తంతు సముదాయ రూప రజ్జువత్ సత్త్వ రజస్తమో గుణసముదాయరూపా । అస్యా ః ప్రళయః మహాసుషుప్తిరితి చ నామ" ।

మూల ప్రకృతి అనగా తెలుపు, ఎరుపు, నలుపు, దారములను కలిపి పేనిన తాడువలె సత్త్వరజస్తమోగుణముల సముదాయ రూపము. దీనికి ప్రళయము మహాసుషుప్తియనియు పేర్లున్నవి.

అస్యాః మూలప్రకృతౌ అనేకకోటిజీవాః స్వస్వకర్మవాసనాభిః సహ జతుపిణ్డే సువర్ణరేణవ ఇవ సృష్టేః పూర్వం లీనా వర్తన్తే ।

ఈ మూల ప్రకృతియందు అనేక కోటానుకోట్ల జీవులు వారి వారి వాసనలతో సహా మైనపుముద్దయందు బంగారు రేణువుల వలె సృష్టికి పూర్వము లీనమై యుందురు. ఈ అనుభవము సమస్తజనులకు సుషుప్తి యందున్నది.

" సామూల ప్రకృతిః సృష్టికాలే పరిపక్వ జీవకర్మవశాన్మాయా అవిద్యా, తామసీతి త్రిధా జాతా । తత్ర మాయా విశుద్ధసత్త్వప్రధానా ।తత్ర ప్రతిబింబితం చైతన్యం తత్సృష్టేః పూర్వం విద్యమానం బ్రహ్మ చైతన్య మీశ్వర ఇత్యుచ్యతే! తస్యాఅవ్యాకృతః అన్తర్యామీతి చ నామ స ఏవ జగత్స్రష్టా

ఆ మూల ప్రకృతియే సృష్టి కాలమందు రిపక్వమైన జీవుల కర్మ వశమువలన మాయ, అవిద్య, తామసి అని మూడుగా అయినది. అందుమాయ విశుద్ధసత్త్వ ప్రధానమైనది. అందు ప్రతిబింబించిన సృష్టికి పూర్వమందు కారణముగా ప్రకాశించుచున్న బ్రహ్మచైతన్యమే ఈశ్వరుడు అని చెప్పబడుచున్నాడు. ఆయనకే అవ్యాకృతుడు, అంతర్యామి అను పేర్లు కలవు. ఆయనయే జగత్సృష్టి కర్త.

"స ఏవ పరిపూర్ణ బ్రహ్మచైతన్యరూపేణ తమస్యవచ్ఛిన్నం సజ్జగదుపాదానమపి భవతి। తన్తోరూర్ణనాభివత్। స్వోపాధి ప్రాధాన్యేనోపాదానకారణమ్ । స్వప్రాధాన్యేన నిమిత్తకారణమ్ "।

ఆయనయే జగత్సృష్టికర్త ఆయనయే పరిపూర్ణ బ్రహ్మ చైతన్య రూపముచేత తమఃప్రధాన ప్రకృతియందు కప్పబడి జగత్తుకు ఉపాదాననిమిత్త కారణములుగాకూడా ఉండెను. సాలెపురుగు తనగూడుకు నిమిత్తోపాదానకారణములు తానే అయినట్లు , ఉపాధిప్రాధాన్యము చేత జగత్తుకు ఉపాదానకారణము తన ప్రాధాన్యముచే నిమిత్త కారణమున్నూ తానే ఆయెను.

"అయమీశ్వరః కేన ప్రకారేణ జగత్ సృష్టవానితిచేత్ ఉచ్యతే"। పూర్వోక్తా అవిద్యా బహు ప్రకారా అనంతా । తదవిద్యా ప్రతిబింబ రూపా జీవా అప్యనన్తాః। అనయోర్జీవేశ్వరయోర్వ్యష్టిరూపా అవిద్యా, సమష్టిరూపామూల ప్రకృతిశ్చ క్రమేణ కారణ శరీరే । తయోః కారణ శరీరయోర్జీవస్యేశ్వరస్య చస్థితిః సుషుప్త్యవస్థా। తయోఃస్వ స్వకారణశరీరమేవానన్దమయకోశః ఏవం కారణ ప్రపఞ్చసృష్టిః

ఈ ఈశ్వరుడు ఏ ప్రకారముగా ఈ జగత్తును సృష్టించెను అనినచో చెప్పబడుచున్నది. పూర్వము చెప్పబడిన అవిద్య అనేక ప్రకారములుగా ఉన్నవి. అనంతములు కూడా అగుచుఉన్నవి. ఆ అవిద్యయందు ప్రతిబింబించిన జీవులు కూడా అనేక సంఖ్యాకులుగా ఉన్నారు.ఈ జీవేశ్వరులకు ప్రతి జీవికి వేరువేరుగా ఉండు అవిద్యయు, జీవులందరికి కలిపి సమష్టిరూప (ఈశ్వరునికి) మూల ప్రకృతియు క్రమముగా కారణశరీరములనబడును. ఈ కారణశరీరములందు జీవేశ్వరులు ఉండుట

సుషుప్త్యవస్థ అగును. ఈ జీవేశ్వరులకుగల ఈకారణశరీరమే ఆనందమయ కోశము. ఇదియే కారణ ప్రపంచ సృష్టి.

అథ సూక్ష్మ ప్రపఞ్చ సృష్టిరుచ్యతే । ఈశ్వరస్యేక్షణవశాత్తమోగుణ రూపాప్రకృతిరావరణశక్తిర్విక్షేపశక్తి రితి ద్వివిధా జాతా । తత్ర విక్షేపశక్తి రేవ సూక్ష్మ ఆకాశో ఉ భవత్ । ఆకాశాద్వాయుః । వాయోరగ్నిః । అగ్నేరాపః। అద్భ్యః పృథ్వీ । ఏతేషాం పఞ్చభూతానాం సూక్ష్మభూతాన్యపఞ్చీకృతాని, తన్మాత్రాణిచేతినామ । ఏతేషామేవ సత్త్వరజస్తమోగుణాః కారణాదజ్ఞానా దాగతాః సన్త ఏతేషామాకాశాదీనాం పృథక్ పృథక్ సత్త్వ గుణాంశాత్ శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వా ఘ్రాణమితి పఞ్చ జ్ఞానేంద్రియాణి క్రమేణ జాతాని। ఆకాశాదిసత్త్వసమష్ట్యా అన్తఃకరణం జాతమ్ । మనో బుధ్యహంకారచిత్తభేదేన తచ్చతుర్విధమ్ । తత్రబుద్ధావహంకారస్య మనసి చిత్తస్య చాన్తర్భావః । ఏవమాకాశాదిరజోగుణాద్వాక్పాణిపాదపా యుపస్థా ఇతి పఞ్చకర్మేంద్రియాణిజాతాని । ఆకాశాదిరజోగుణ సమష్ట్యా ప్రాణో జాతః । ప్రాణాపానవ్యానోదానసమాన భేదేన స పఞ్చవిధః। జ్ఞానేంద్రియపఞ్చకం, ప్రాణపంచకం, మనోబుద్ధిశ్చ సప్తదశాత్మకమేకీభూయ సూక్ష్మప్రపంచ సృష్టిరిత్యుచ్యతే . :-

ఈశ్వరుని యొక్క సంకల్పరూపమగు చూపుచేతనే తమోగుణరూపమైన ప్రకృతి ఆవరణశక్తి, విక్షేపశక్తి అని రెండుగా మారినది. అందు విక్షేపశక్తియే సూక్ష్మ ఆకాశముగా పుట్టినది. ఆ ఆకాశము నుండి వాయువు, వాయువునుండి అగ్ని, అగ్ని నుండి జలము, జలము నుండి భూమి పుట్టినవి, ఈ పంచ భూతములకు మూలములు శబ్దస్పర్శ రూప రస గంధములు సూక్ష్మభూతములని అపంచీకృతభూతములని తన్మాత్రలని పేరు. వీటికి కూడా సత్త్వరజస్తమోగుణములు కారణమైన అజ్ఞానము వలన వచ్చినవి. అవియే ఈ ఆకాశాదులకు వేర్వేరుగా సత్త్వ గుణాంశముచే త్వక్,చక్షుః శ్రోత్ర జిహ్వా, ఘ్రాణములను పేర్లుగల పంచ జ్ఞానేంద్రియములు పుట్టినవి. ఆకాశము మొదలైన ఈ పంచభూతముల సత్త్వసమష్టి చేత అంతఃకరణము పుట్టినది. అది మనస్సు, బుద్ధి, అహంకారము చిత్తము అనుభేదములుగలది.ఈనాల్గింటిలో బుద్ధి

అహంకారమునందు, చిత్తము మనస్సునందు అంతర్భావము చెందును.

ఈ ఆకాశాదిపంచభూతముల వ్యష్టిరజోగుణముచేత ప్రాణము పుట్టెను. ప్రాణ అపాన, వ్యాన, ఉదాన, సమానములని ప్రాణమే ఐదు విధములు. జ్ఞానేంద్రియపఞ్చకము, కర్మేంద్రియ పఞ్చకము, ప్రాణపఞ్చకము, మనస్సు బుద్ధి, ఈ పదిహేడింటికి సూక్ష్మశరీరమని లింగశరీరమనిపేర్లతో చెప్పబడుచున్నది.

ఇదమేవ భోగసాధనమ్ । అస్మిన్ సూక్ష్మశరీరే జీవేశ్వరయోరవస్థితిః స్వప్నావస్థా । అస్మిన్ విజ్ఞానమయకోశమనోమయకోశప్రాణమయకోశాశ్చసన్తిఏవంసూక్ష్మసృష్టిప్రకారః ।

ఇదియే భోగసాధనము. ఈ సూక్ష్మశరీరమందు జీవేశ్వరుల ఉనికియే వీరికి స్వప్నావస్థ. దీనియందే విజ్ఞానమయ, మనోమయ, ప్రాణమయ కోశములు కలవు. ఈ ప్రకారముగా సూక్ష్మసృష్టి ఏర్పడినది.

స్థూలసృష్టిప్రకారః అథస్థూలసృష్టిప్రకార ఉచ్యతే అథ తమోగుణప్రధానాని పఞ్చభూతాన్యపఞ్చీకృతాన్యాకాశాదీని పంచాపిభూతాని ప్రత్యేకం ద్విధా విభజ్య, తత్రప్రత్యేకమర్ధం చతుర్ధా విభజ్య , స్వార్ధభాగం విహాయ, ఇతర భాగార్ధభాగేషు సంయోజనం పఞ్చీకరణమ్ఏవం కృతే పఞ్చాపి పఞ్చీకృతాని భవన్తి.

స్థూలసృష్టి ఇటుపైని స్థూలసృష్టి ప్రకారము చెప్పబడుచున్నది. తమోగుణ ప్రధానములైన అపంచీకృతములైన (విడగొట్టబడని సూక్ష్మములైన) ఆకాశాదిభూతములను ఐదింటిని కూడా ప్రతి ఒక్కదానిని రెండుగా విభజించి, అందు ప్రతి ఒక్కదాని అర్ధభాగము నాల్గుగా విభజించి, తమ అర్ధభాగము వదలి, ఇతరభూతములయొక్క అర్ధభాగములలోని 4వ భాగములు నాల్గింటిని కలుపుటయే పంచీకరణము. ఈ విధముగా చేయబడినచో ఐదు కూడా పంచీకృత పంచ మహాభూతము లగును.పృథివి 1/2 నీరు 1/8 నిప్పు1/8 వాయువు 1/8 ఆకాశము1/8 = పార్థివశరీరము కలసి అగును. ఇట్లే అమ్మయ, తేజోమయాదీశరీరములు ఏర్పడినవి.

" ఏతేభ్యః పఞ్చభూతేభ్యో బ్రహ్మాణ్డం, తదన్తశ్చతుర్దశ భువనాని జాతాని అస్మిన్ స్థూలశరీరే జీవేశ్వరయోరవస్థానం జాగ్రదవస్థా । ఇదం

స్థూలమేవ్నాన్నమయకోశః । " ఏవం స్థూలసృష్టి ప్రకారః

వీటినుండి ఈ పంచీకృతభూతములనుండి బ్రహ్మాండము పుట్టినది. ఈ స్థూలశరీరమునందు-జీవేశ్వరులుండు స్థితియే జాగ్రదవస్థ. ఈ స్థూలమే అన్నమయకోశము. ఇది స్థూల సృష్టి విధానము.

ఇదం కారణశరీరం, ఇదం సూక్ష్మశరీరం, ఇదం స్థూలశరీరం చ ప్రత్యేకం వ్యష్టి సమష్టి భేదేన ద్వివిధమ్ । వనంగ్రామం ఇత్యాదిసమష్టిః । వృక్షో గృహం ఇత్యాది వ్యష్టిః । ఏవంసర్వశరీరం సమష్టిః । ఏకశరీరం వ్యష్టిః । తత్రసమష్ట్యుపాధిక ఈశ్వరః వ్యష్ట్యుపాధికోజీవః । తత్రాపి కారణసమష్ట్యా ఈశ్వరః కారణవ్యష్ట్యాప్రాజ్ఞః సూక్ష్మసమష్ట్యాహిరణ్యగర్భః । సూక్ష్మ వ్యష్ట్యాతైజసః । స్థూలసమష్ట్యా వైశ్వానరః। స్థూలవ్యష్ట్యా విశ్వః । ఇతి జీవేశ్వరయోరవాన్తరభేదః । అయమేవేశ్వరః । సత్త్వరజస్తమోగుణైరుపాధి భిర్బ్రహ్మ, విష్ణు, రుద్ర రూపేణ సృష్టి, స్థితి సంహారాన్కరోతి ।

ఈ కారణ శరీరము , సూక్ష్మ శరీరము స్థూలశరీరము ఈ మూడును ప్రతి ఒక్కటి వ్యష్టి సమష్టి అని రెండు విధములు వనము గ్రామము అను మొదలైనవి సమష్టిరూపము వృక్షము, గృహము వ్యష్టి. రూపము ఈ విధముగ సర్వశరీరములు కలసి సమష్టి. విడిగా ఒక్కొక్క శరీరము వ్యష్టి. శరీరఉపాధి తానుఅనుకొను అభిమాని జీవుడు. అందును సమష్టికారణశరీరఉపాధికునకు ఈశ్వరుడని పేరు. వ్యష్టి కారణ శరీరఉపాధికునకు ప్రాజ్ఞుడని పేరు. సమష్టి సూక్ష్మ శరీరోపాధికునకు హిరణ్య గర్భుడని పేరు. వ్యష్టి సూక్ష్మ శరీరాభిమానికి తైజసుడని పేరు. సమష్టి స్థూల శరీరఅభిమానికి వైశ్వానరుడని పేరు. వ్యష్టి స్థూల శరీరాభిమానికి విశ్వుడని పేరు. ఇదియే జీవేశ్వరులకు కల అవాంతర భేదములు. ఈ ఈశ్వరుడే సత్త్వ రజస్త మోగుణోపాధులచే బ్రహ్మ, విష్ణు, రుద్ర రూపులుగా ఉండి సృష్టి స్థితి సంహారములను చేయుచున్నాడు.

బ్రహ్మణో విరాడ్ రూపే ఉ ఉన్తర్భావః ।విష్ణోః హిరణ్యగర్భే ఉన్తర్భావః । రుద్రస్యేశ్వరేచాన్తర్భావః । ఏవం ప్రపంచోత్పత్తిః। అయమేవాధ్యారోపః। ఇదం విక్షేపశక్తి కార్యమ్।

బ్రహ్మ విరాడ్రూపమునందు అంతర్భావము చెందును. విష్ణువు

హిరణ్య గర్భునియందు అంతర్భవించును. రుద్రుడు ఈశ్వరునియందు చేరును. ఈ విధముగా ప్రపంచముయొక్క పుట్టుకజరుగుచున్నది. ఇట్లగుటయే అధ్యారోపము. ఇదియే విక్షేపశక్తి చేయుపని.

అథావరణశక్తి కార్యముచ్యతే ''ఈశ్వరమాత్మజ్ఞానినంచ విహాయాన్యేషాం సర్వేషాం జీవానాం పఞ్చకోశానామాత్మనశ్చ భేదమావరణ శక్తిరన్ధకార ఇవావృణోతి''।

ఇటుపైని ఆవరణశక్తి కార్యము చెప్పబడుచున్నది. ఈశ్వరుని ఆత్మజ్ఞానిని విడిచిపెట్టి ఇతరమైన సమస్త జీవులకు వారి పంచకోశములకు ఆత్మకు గల స్పష్ట భేదమును ( వారి శరీరములే ఆత్మ కాకపోవుట అను సత్యమును) ఆవరణశక్తి అనునది అంధకారమువలె కప్పును. తెలియనీయకుండ చేయును అని అర్థము.

" ఆవరణం చ ద్వివిధమ్ । అసత్త్వా వరణం అభానావరణం చ ఇతి। వస్తునాస్తీతి వ్యవహార కారణమసత్త్వావరణమ్। వస్తునభాతీతి వ్యవహార కారణం మభానావరణమ్।

ఈ ఆవరణము రెండు విధములు అసత్త్వావరణము. అభానావరణము. " వస్తువులేదు" అను వ్యవహారమునకు కారణము అసత్త్వావరణము. " వస్తువుఉన్నది. ప్రకాశించుట లేదు" అను వ్యవహారమునకు కారణము అభానావరణము.

" ఆవరణశక్తి కార్యమేవ సంసారవృక్షస్యమూలమ్ । నవిక్షేపశక్తి కార్యమ్ । ఏతన్మోక్షసిద్ధేరపిహేతుః । ద్వివిధమప్యావరణం తత్త్వజ్ఞానేన వినాశ్యమ్ ।

ఆవరణశక్తియొక్కకార్యమే సంసారవృక్షమునకు మూలము విక్షేపశక్తి కార్యము కాదు. ఆవరణ శక్తి కార్యము అని తెలియుట మోక్షము సిద్ధించుటకు కూడా కారణము అగునుపై రెండు విధములైన ఆవరణలుకూడా తత్త్వజ్ఞానమువలననే నశించును.

" తత్త్వ జ్ఞానంచ పరోక్షజ్ఞానమపరోక్షజ్ఞానమితి ద్వివిధమ్। తత్ర గురుముఖాద్వేదాన్తజన్యం జ్ఞానం పరోక్షజ్ఞానమ్ । ఇదమేవ శ్రవణమ్ । అనేనవస్తు నాస్తీత్యేవం రూపమసత్త్వారణం వినశ్యతి । తదా వస్త్వస్తీతి

వ్యవహ్రియతే శ్రవణేన సంశయం, మననేన అసంభావనాం, నిదిధ్యాసనేన విపరీతభావనాంచనివర్త్య దేహాత్మజ్ఞానవత్ బ్రహ్మాత్మజ్ఞానం జాయమానమ పరోక్షజ్ఞానమ్ । అనేన వస్తు నభాతీతి వ్యవహార హేతురభానావరణం వినశ్యతి । ఏవం పరోక్ష జ్ఞానేన అపరోక్షజ్ఞానేన చ వస్తునాస్తిన భాతీతి వ్యవహారహేతు వృత్తి స్వరూప ఆవరణద్వయమపి వినశ్యతి।తదా అనర్థనివృత్తిః ఆనన్దావాప్తిశ్చ భవతి 10

తత్త్వజ్ఞానము ' పరోక్ష జ్ఞానము', 'అపరోక్ష జ్ఞానమ' అని రెండు విధములు. గురువు ద్వారా వేదాంత వాక్యములను శ్రవణము చేసినప్పుడు కలిగెడు జ్ఞానము ' పరోక్షజ్ఞానము. ఇదియే శ్రవణము. దీని చేత (పరోక్షజ్ఞానముచేత) వాస్తవమైన వస్తువు లేదు' అను అసత్వావరణము నశించును. అప్పుడు వస్తువు ఉన్నది అని వ్యవహారము కల్గును. శ్రవణము చేత ( వేదాంత వాక్యములను వినుట చేత) సందేహము, మననము చేత (మరలయుక్తులతో చింతన చేయుట చేత) అసంభావన (కుదరదనుకొనుట ) నిదిధ్యాస చేత (తత్త్వమును దర్శించవలెనుఅను కాంక్షచేత) విపరీతభావన (వేరొకటి కలదనుకొనుట ) లను తొలిగింపజేసి దేహమే నేనను కొన్నంత స్పష్టముగా బ్రహ్మమునే తాననుకొనునేను అనెడి జ్ఞానముకల్గుట ' అపరోక్షజ్ఞానము'. దీనిచేత '' వాస్తవమైన బ్రహ్మ (వస్తువు) తెలియుట లేదు '' అను వ్యవహారమునకు కారణమైన అభానావరణము నశించును. ఈ విధముగా పరోక్ష, అపరోక్ష జ్ఞానములచేత "వస్తువులేదు, ఉన్నను తెలియుటలేదు" అను వ్యవహారములకు కారణములైన రెండు విధములగు ఆవరణములు (అజ్ఞానములు అచ్ఛాదనలు) నశించును. అప్పుడు అనర్థనివృత్తి ఆనందావాప్తి కలుగును.

" ఏవం సప్తావస్థాఃసిద్ధ్యన్తి । సప్తావస్థాఃనామ శ్లో॥అజ్ఞానమావృతిః తద్వద్విక్షేపశ్చ పరోక్షధీః । " అపరోక్షమతిః శోకహతిః । తృప్తిర్నిరంకుశా' ఇత్యేవమాకాశవన్నిర్మలే చైతన్య వస్తుని మిథ్యాభూత ప్రపఞ్చకల్పన మధ్యారోపః । 11

ఈ విధముగా సప్తావస్థలు సిద్ధించునుసప్తావస్థలుఏమేమి ?అనగా -1. అజ్ఞానము 2. ఆవరణము 3. విక్షేపము 4. పరోక్షజ్ఞానము. 5. అపరోక్ష

జ్ఞానము 6. శోకనిర్మూలనము 7. నిరంకుశమైనతృప్తి. అనునవి.

ఈ విధముగా నిర్మలమైన ఆకాశము వలె ఉన్న చైతన్య వస్తువు నందు మిథ్యాభూతమైన ప్రపంచ కల్పనమే అధ్యారోపము.

అథ అపవాద ఉచ్యతే కారణ వ్యతిరేకేణ కార్యం నాస్తీతి బోధేన శుక్తికాయాం రజతవత్, రజ్జౌ సర్పవత్, బ్రహ్మణి ప్రపంచోనాస్తీతి నిషేధో అపవాదః । యా మా సా మాయా ' యా న విద్యతే సా అవిద్యా ఇతి వ్యుత్పత్యా మాయాయాః కల్పితత్వం సిద్ధమ్. ఏవం యోబ్రహ్మ వ్యతిరేకేణ కిమపి నాస్తి తద్బ్రహ్మఅహమేవేతి విచార్య జానాతి। స ఏవ జీవన్ముక్త ఇతి వేదాన్త సిద్ధాంతః ।ఇతి మననే ప్రథమ వర్ణకం సమాప్తమ్ ।

ఇప్పుడు అపవాదము చెప్పబడుచున్నది కారణము కంటె వ్యతిరేకముగా (వేరుగా) కార్యము ఉండదు. అని తెలియగా ముత్యపు చిప్పయందు వెండివలె, తాడు నందు పామువలె బ్రహ్మమునందు ప్రపంచము వేరుగా ఉండదు అని నిషేధించుటయే అపవాదము. ఏది వాస్తవముగా ఉండదో తాత్కాలి కముగా కనపడుచుండునో అది మాయ. ఏది నిజముగా లేదో అదియే అవిద్య అని పదవ్యుత్పత్తి ద్వారా మాయ. అవిద్యలు కల్పితములని రూఢిగ తెలియును. ఈ ప్రకారము బ్రహ్మకు వ్యతిరేకముగా (వేరుగా) ఏదియును లేదు. ఆ బ్రహ్మమునే "నేను" అని ఆలోచించి ఏ వ్యక్తి తెలిసికొనునోఆ వ్యక్తియే జీవన్ముక్తుడు అని వేదాంత సిద్ధాంతము.

ఇట్లు మననమందు ప్రథమ వర్ణకము సమాప్తము ।

## అథద్వితీయవర్ణకమ్

అథద్వితీయవర్ణకేఅనుబన్ధచతుష్టయముచ్యతే విషయ ప్రయోజన, సమ్బన్ధాధి కారిణ ,ఇత్యనుబన్ధచతుష్టయమ్ । అస్య వేదాన్త శాస్త్రస్య బ్రహ్మైవ విషయః । మోక్ష ఏవ ప్రయోజనమ్ । ప్రతిపాద్య ప్రతిపాదక భావోబోధ్యబోధక భావోవా సమ్బన్ధః । సాధన చతుష్టయ సంపన్నోఽధికారీ యథా బృహస్పతి సవనేబ్రాహ్మణ ఏవరాజసూయేక్షత్రియః తథా వేదాంత శాస్త్రే సాధనచతుష్టయ సంపన్న ఏవ అధికారీ ఇతి ॥ ।సాధన చతుష్టయం నామ 1) నిత్యా నిత్య వస్తు వివేకః । 2) ఇహాముత్రార్థ ఫలభోగవిరాగః

3)శమాదిషట్కం, 4)ముముక్షుత్వంచ

బృహస్పతి యజ్ఞమున బ్రాహ్మణుడు రాజసూయమునకురాజే అధికారి అయినట్లు సాధనచతుష్టయసంపన్నుడేఅధికారి సాధన చతుష్టయమనగా 1 నిత్యానిత్యవస్తువివేకము.2 ఇహపరలోక విషయఫల భోగము నందు విరాగము,3 శమాది షట్కము4 ముముక్షుత్వము అనునవి.

**ద్వితీయవర్ణకము**

ఇటుపై రెండవ వర్ణకముందు అనుబంధ చతుష్టయము చెప్పబడు చున్నది. విషయము. ప్రయోజనము. సంబంధము అధికారి అను నాల్గు అంశములకుఅనుబంధచతుష్టయము.అనిపేరు ఈ వేదాంతశాస్త్రమునకు బ్రహ్మమే విషయము. మోక్షమే ప్రయోజనము. ప్రతిపాద్యప్రతిపాదక భావముగాని బోధ్యబోధక భావముగాని అను కొనుటయే సంబంధము "బ్రహ్మైవ సత్యం జగదనిత్యమితి శ్రుతి, స్మృతి పురాణాదినా న్వయంమేవ జాయమానం జ్ఞానం నిత్యానిత్యవస్తువివేకః। ఇహ స్రక్చందనాది విషయభోగః అముత్రాప్సరః స్త్రీ విషయభోగశ్చ ఉభయ మంవ్యనిత్యమితిశ్వవాన్తాశనవమూత్రవురీషాదివత్తత్రవైరన్య మిహాముత్రార్థఫలభోగవిరాగః। శమ దమోపరతితి తిక్షాసమాధానశ్రద్ధా ఇతి శమాది షట్కమ్।

బ్రహ్మము సత్యము. జగత్తు అనిత్యము అనిశ్రుతి స్మృతి పురాణాదుల ద్వారా స్వయముగా కల్గిన జ్ఞానమే నిత్యాని త్యవస్తువివేకము. ఈ లోకము నందలి పుష్పమాలికానుగంధాది విషయభోగములు కాని స్వర్గాది పరలోకమందలి అప్సర స్త్రీ విషయాదిభోగములు కాని రెండుకూడా అనిత్యములే అని, కుక్క,వాంతిచేసుకున్నఆహారమునందు మూత్ర పురీష(మల)ములు మున్నగువానియందు వలె ఇహ లోక పరలోక భోగములను అసహ్యించుకొనుటయే ఇహాముత్రార్థ ఫలభోగవిరాగము 1)శమము 2)దమము, 3)ఉపరతి, 4)తితిక్ష 5)సమాధాన 6)శ్రద్ధలను నవియే శమాదులు.

" శమోనామ శ్రవణాది వ్యతిరేకేభ్యోనివృత్యఅత్మన్యేవ శ్రవణాది విషయే మనసః స్థాపనమ్ "।

" శమమనగా శ్రవణాదులకు విరుద్ధములైన వ్యతిరేక విషయముల నుండి మరల్చి ఆత్మయందే మనస్సును శ్రవణాదివిషయములందు వర్తించునట్లు నిలుపుట".

"దమోనామ జ్ఞానేంద్రియ కర్మేంద్రియ నిగ్రహః"।

" దమమనగా జ్ఞాన కర్మేంద్రియములను నిగ్రహించుట".

ఉపరతిః " సన్యాసో, నిష్కామ కర్మానుష్ఠానమ్ వ్యవహార లోపోవా"।

" ఉపరతి అనగా సన్యాసము లేక నిష్కామకర్మానుష్ఠానము లేక లౌకిక వ్యవహారము లోపించుట".

తితిక్షా-" ప్రారబ్ధాగత శీతోష్ణాది సహనమ్।

'తితిక్ష అనగా ప్రారబ్ధముచేత వచ్చిన శీతోష్ణములను సుఖదుఃఖ ములను మాన అవమానాదులను సమభావముతో సహించుట".

సమాధానమ్ - "శ్రవణాద్యనుకూల విషయేషువర్తనం సమాధిః"

"సమాధానమనగా ఆత్మతత్త్వ శ్రవణము మున్నగు అనుకూల అంశముల పట్ల మనస్సును ఇతర వృత్తులు లేకుండా నిరోధించి (ఆపి) ఉంచుట".

శ్రద్ధా-""గురువేదాన్త వాక్య విశ్వాసః"।

"శ్రద్ధయనగా గురువులయందు వేదాంతశాస్త్రవాక్యములందును నమ్మకము కలిగియుండుట.

" గృహే దహ్యమానే తత్ర దహ్యమానః పురుషః కళత్ర పుత్రాదికం పరిత్యజ్య స్వతాపోపశమనార్థమేవ బహిర్నిర్గత్య తాపోపశమనమ్ కర్తుమిచ్ఛతి। ఏవం సాంసారిక తాపశమనం సంపాదయితుం త్యక్త సర్వేషణస్య తీవ్రేచ్ఛాముముక్షా"।

"ముముక్షుత్వమనగా గృహము దహింపబడుచున్నప్పుడు అందు దహింపబడు పురుషుడు, భార్యాపుత్రాదులను విడిచిపెట్టి తన తాపము మాత్రవలు ఉపశమింప చేసికొనగోరినట్లు సాంసారిక తాపమును ఉపశమింపచేసికొనుటకై సర్వఈషణలను విడిచిపెట్టిన సాధకునికి కల్గు తీవ్ర విముక్తి కాంక్షయే"=ముముక్షుత్వము.

"లోకే కేషాఞ్చిత్ నిత్యానిత్యవస్తు వివేకే సత్యపి వైరాగ్యస్యాదర్శనాత్ ఇహాముత్రార్థఫలభోగవిరాగేణాపి భవితవ్యమిత్యుక్తమ్ తదుభయేసత్యపి

కేషాంచిత్‌ఋషీశ్వరాణాం కోపతాపాది దర్శనాత్‌శమాదినాభవితవ్య మిత్యుక్తమ్. । ఏతత్త్రితయే సత్యపి కేషాఞ్చిద్భక్త్యా ఈశ్వరోపాసకానాం జ్ఞానా ధికారాదర్శనాన్ముముక్షుతయా భవితవ్యమ్''।

" లోకమందు కొంతమందికి నిత్యానిత్య వస్తు వివేకమున్నప్పటికి వైరాగ్యములేనందున, ఇహలోక పరలోక భోగములందు వైరాగ్యము కూడా ఉండవలెనని చెప్పబడినది.ఈ రెండు ఉన్ననుకొంతమంది ఋషులకు కోపతాపాదులు కన్పించుటవలన శమాది షట్కము చెప్పబడినది. మొదటి మూడున్నను కొంతమందికి భక్తిచేత ఈశ్వరుని ఉపాసించువారికి జ్ఞానమునందధికారము కనబడకుండుట వలన మోక్షాపేక్ష కూడా సాధనములలో నాల్గవదిగా అవసరమై ఉన్నది.

" ఏవం రూపాధికారీ ఉపహార సమిత్పాణిఃసన్ సద్గురుముపగమ్య నమస్కృత్య విశ్వాస వినయాభ్యాం సహ హేస్వామిన్।హే భగవన్ ! గురో! ఇతి సంబోధ్య, జీవః కః ఈశ్వరః కః ? జగత్కిదృశం? ఏతత్త్రితయమ్ కస్మాదాగతమ్? కస్మాద్గమిష్యతి? ఇతిప్రశ్నం కుర్యాత్''।

"ఇటువంటి పై నాల్గు - లక్షణముకల అధికారి సాధకుడు సమిధలను దర్భలను ఉపాహారములను చేతపట్టుకొనినవాడై సద్గురువును చేరి నమస్కారము చేసి విశ్వాస వినయములతో కూడి ఓ స్వామీ । ఓభగవన్ । ఓ గురూ । అని సంబోధించి, జీవుడంటే ఎవరు? ఈశ్వరుడంటే ఎవరు? ఈ మూడు ఎట్లు ఎందులకు వచ్చినవి?అను ప్రశ్నలు వేయవలెను.

" పరీక్ష్యలోకాన్కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేదమాయాన్నాస్త్యకృతః కృతేన'' । తద్విజ్ఞానార్థం సగురుమేవాభిగచ్ఛేత్ సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్'' ఇత్యాది శ్రుతేః । " తద్విద్ధిప్రణిపాతేన పరిప్రశ్నేనసేవయా''। ఇతి గీతావచనాచ్చ।

కర్మలచే నంపాదించ బడినలోకములన్నియు పుణ్యము అయిపోవుటవలన మనుష్య లోకమును ఆశ్రయింతురు అని ఆలోచించి బ్రాహ్మణుడు వైరాగ్యమును పొందవలెను, కర్మలచే అకృతః=మోక్షములేదు. కాన ఆత్మవిజ్ఞానము కొఱకువాడు సమిత్పాణి యై గురువు వద్దకు వెళ్లవలెను. ఆ గురువు వేదవేదాంగవేత్త బ్రహ్మనిష్ఠుడైనవాడే గురువు అని

గురువు కాళ్ల మీద సాష్టాంగపడి ప్రార్థించి సేవచేయుచు ప్రశ్నలను అడిగితెలిసికొనవలెను అని స్మృతి అర్థము " ఏవం శిష్యేణ ప్రార్థితః సద్గురుర్దయయా సత్త్వరజస్తమోగుణైర్జీవేశ్వరజగదాగమనప్రకారం బోధయిత్వా ఆత్మస్వరూపమపి కరతలామలకవద్బోధయతి"।

" ఈ విధముగా శిష్యునిచే ప్రార్థితుడై సద్గురువు దయతో సత్త్వరజస్తమోగుణములచేతనే జీవేశ్వరజగత్తులు ఏర్పడిన విధానమును బోధించి ఆత్మ స్వరూపమును కూడా అరచేతిలో ఉసిరిగపండును చూపినట్లు బోధించును. (తెలియపరచును).

"అస్యాధికారిణః సాధన చతుష్టయం చ బహుజన్మార్జిత పుణ్యపరిపాకవశాదీశ్వరానుగ్రహేణ చ లబ్ధమితి వేదితవ్యమ్ । ఏతత్తత్త్వజ్ఞానప్రదాయకం గురుమీశ్వరం విద్యాత్। ఏవం యో గురుముఖాజ్జీవాత్మ పరమాత్మ భేదం విచార్య జానాతి। స ఏవ ముక్తిం గమిష్యతీతి సిద్ధమ్".ఇతి మననే ద్వితీయప్రకరణం సమాప్తమ్.

"ఇటువంటి అధికారియగు సాధకునకు పై సాధనచతుష్టయము అనేక జన్మార్జిత పుణ్య పరిపాకమువలనను ఈశ్వరానుగ్రహము వలనను లభించును. కావున ఇట్టి తత్త్వజ్ఞానమును ప్రసాదించుగురువును ఈశ్వరుడనియే భావింపవలయును. ఈ ప్రకారముగా ఎవరైతే గురుముఖముగా జీవాత్మ, పరమాత్మ భేదమును విని ఎవడు ఆలోచించి తెలిసికొనునో అట్టివాడే ముక్తిని పొందుననుట స్పష్టము.

ఇట్లు మననమునందు ద్వితీయ వర్ణకము సమాప్తము.

.. .. ..

## అథ తృతీయవర్ణకమ్

"అయం ప్రపఞ్చః కతివిధ" ఇతి చేత్। ఆత్మాఽనాత్మా ఇతి ద్విప్రకారః ప్రపంచాతీతస్యాత్మనః కథం ప్రపంచాన్తర్భూతత్వమితి నశఙ్కితవ్యమ్ । కథమితిచేత్। అస్యప్రపఞ్చస్య చేతనాచేతనాత్మకత్వాత్। ఆత్మనశ్చేతనరూపత్వాత్ । ఆత్మానం వినా ప్రపఞ్చస్యాభావాదాత్మనః ప్రపంచాన్తర్భావోవక్తవ్య ః ।

" ఈ ప్రపంచము ఎన్ని విధములుగనున్నది"? అనినచో ఆత్మ అనాత్మ అని రెండు విధములే అని సమాధానము. ప్రపంచానికి అతీతమైన ఆత్మ ప్రపంచమునందు ఎట్లు అంతర్భూతమైఉన్నది అని శంకించవలదు. ఎట్లనగా ఈ ప్రపంచము చేతనాచేతనాత్మకముగా ఉన్నది. ఆత్మచేతనరూపమైనదగుటవలన ఆత్మలేకుండా ప్రపంచము ఉండదు. కనుక ఆత్మ ప్రపంచమునందు చేరినదే వేరు కాదని చెప్పక తప్పదు.

"తర్హిచేతనంకిమ్? అచేతనం కిమ్? ఇతిచేత్। జంగమం సర్వం చేతనం । స్థావరంసర్వమచేతనమ్ ।

చేతనమనగానేమి?అచేతనమనగానేమి?అనినచో జంగమమైనది (కదలునది) అంతయూ చేతనము. స్థావరము (కదలనిది) అంతయూ అచేతనము.

" తర్హి చేతనానామచేతనానాం చ ప్రత్యేకం బహు ప్రకారత్వాత్ కథం ద్విప్రకార ఏవ, ప్రపఞ్చఇతిచేత్ శృణు। కథమితి చేత్। అనాత్మా ఏక ఏవ । నకార్యరూపేణానేకో భాతి।ఆత్మా చ ఏకఏవ సో౽ ప్యనాత్మకార్యోపాధిభిరనేక జీవా ఇతి, అనేకేశ్వరా ఇతి చ భాతి।

చేతనములు, అచేతనములు కూడా ఒక్కొక్కటి అనేకవిధములై ఉండగా రెండు ప్రకారములుగా ఈ ప్రపంచము చెప్పుట ఎట్లు? అనినచో వినుము.అనాత్మ ఒక్కటే, కానీ అది తన వివిధ కార్యరూపములతో అనేక విధములయ్యెను. ఆత్మకూడా ఒక్కటే అయితే అది కూడా అనాత్మల కార్యముల ఉపాధులను అనుసరించి అనేక జీవులుగా, అనేక ఈశ్వరులుగాను ప్రకాశించుచున్నది.

" ఏకస్యేశ్వరస్య జీవవత్కథమనేకత్వమితి" చేత్, పుణ్యక్షేత్రేషు గ్రామేషు శివవిష్ణ్వాది మూర్తిభేదేన స్థితత్వవదితి బ్రూమః

ఒక్కడైన ఈశ్వరునకు జీవునికి వలె అనేకత్వము ఎట్లు వచ్చెను? అని అనినచో పుణ్యక్షేత్రములయందు గ్రామములయందు శివవిష్ణ్వాది మూర్తి భేదములతో ఉండుటవలె ఇన్ని విధములగుట అని చెప్పుదుము.

" మృచ్ఛిలాది రూపాణాం తాసాం మూర్తీనాం కథమీశ్వరత్వమితి చేత్। ఈశ్వరత్వమస్తి। సర్వైరపి తాసు మూర్తిషు బహు ద్రవ్య వ్యయం కృత్వా

అభిషేకనివేదనాదేః క్రియమాణత్వాత్। యేషాం శాస్త్రవిశ్వాసో నాస్తి,తే మ్లే చ్ఛాదయోమఖూర్తీనాంపూజనేనోదాహరణీయాఃసర్వత్రశ్రద్ధావతామేవో దాహరణీయత్వాత్। కిఞ్చ హేయేమలమూత్రాత్మకే అస్మిన్ శరీరే ఆత్మబుద్ధిం కుర్వతాం జీవానామత్యంత శుద్ధాసుమూర్తిషు ఈశ్వర బుద్ధికరణే కో దోషః।

మట్టిరాయి మున్నగు రూపములు గల ఆయామూర్తులకు ఈశ్వరత్వమెట్లుండును? అన్నచో నిజమే వానికి ఈశ్వరత్వమున్నది. ఆ మూర్తులపట్ల చాలాద్రవ్యము వ్యయము చేసి అభిషేక నివేదనాదులను అందరును చేయుచున్నారు కదా ఎవరికి శాస్త్రమునందు విశ్వాసము లేదో అట్టి మ్లేచ్ఛాదులను ఈ మూర్తుల పూజల విషయములో ప్రసక్తికిరానీయకూడదు. ఎచ్చటనైనను నమ్మకము కల్గినవారిని ఉదాహరించవలెను కదా! అంతేకాదుమిక్కిలిహేయమైన మలమూత్రాదుల కుతావు=కొంప అయిన ఈ శరీరమందే ఆత్మబుద్ధి చేయుచున్న ఈ జీవులకు అత్యంత శుద్ధమైనటువంటి ఆ మూర్తులయందు ఈశ్వరబుద్ధి చేయుటలో దోషమేమి?

"ఏవమేకస్య అనాత్మనః కార్యరూపేణానేకత్వే, ఏకస్యాత్మనో ఉ నన్తకార్యోపాధిభిరనేకత్వేచదృష్టాన్తః కః? ఇతి చేత్ శృణు । యథైకైవ పృథ్వీకార్యరూపేణ పరిణతా సతీ, పర్వతో, వృక్షో, గోపురం, కుడ్యం, గృహం,కుసూలం, మఠః, శరావ ఇత్యాది భేదం గచ్ఛతి, యథాఆకాశ ఏక ఏవ, పృథ్వీకార్యోపాధిషు ప్రతీయమానః-అయం ఘటాకాశః అయం మఠాకాశః ఇత్యాదిరూపేణానేకధాభాతి, తథా మూలప్రకృతిరనాత్మా ఏక ఏవ కార్యరూపేణానేకోజాతః। ఆత్మాయమేకోఉపితత్తచ్ఛరీరోపాధిభిస్తత్రప్రవిష్ట ఇవసన్, దేవో, మనుష్యో, రామః, కృష్ణో, బ్రాహ్మణః, క్షత్రియో, వైశ్యః, శూద్రః , పశుః కృమిః, కీటః ఇతి బహుధాభాతి।అయమమవచ్ఛిన్న పక్షే దృష్టాన్తః.

ఇటువంటి ఏకమైన అనాత్మయే కార్యరూపము చేత అనేకత్వముదాల్చుటకును, ఒక్కటైన ఆత్మయే ఈ అనేకమైన అనాత్మ కార్యోపాధుల చేత అనేకత్వమును పొందుటకు దృష్టాంతము ఏమిటి? అన్నచో వినుము. ఒకే పృథివి కార్యరూపముగా పరిణమించి పర్వతము,

వృక్షము, గోపురము, గోడ, గృహము కుండ, గాదె, మఠము, మూకుడు మున్నగు భేదమునెట్లుపొందెనో, ఏ ప్రకారముగా ఆకాశము ఒక్కటియే పృథ్వీకార్యోపాధులననుసరించి తెలియబడుచున్నదై ఇది ఘటాకాశము, ఇది మఠాకాశము, అను మొదలైన రూపములతో అనేక రూపములుగా భాసించుచున్నదో ఆ ప్రకారమే మూలప్రకృతియైన అనాత్మ ఒక్కటియే కార్యరూపముచేత అనేకములుగా కనబడుచున్నది. అట్లే ఆత్మస్వయముగా ఒక్కటే అయిననూ ఆయాశరీరఉపాధులచేత అచ్చటచ్చట ప్రవేశించినట్లు ఉండి దేవత, మనుష్యుడు రాముడు,కృష్ణుడు బ్రాహ్మణుడు, క్షత్రియుడు, వైశ్యుడు, శూద్రుడు, పశువు,పక్షి,పురుగు కీటకము అని అనేక విధములుగా ప్రకాశించుచున్నది. ఇది ఆత్మ ఉపాధులతో అనేకము అయినది అను అవచ్ఛిన్న పక్షమున దృష్టాంతము.

"ప్రతిబింబపక్షేతు యథా సముద్రోనదీ తటాకః కూపః,ఘటజలమితి ఏకమేవ జలం బహుధ్వాజాతమ్। తథా అనాత్మాపిబహుధా జాతః । తేషు సముద్రాదిషు ఆదిత్య ఏక ఏవ ప్రతిబింబితః సన్ యథాబహుధాజాతః । తథా ఏక ఏవాత్మా అన్తఃకరణ సహితేషు సర్వేష్వపి శరీరేషు ప్రతిబింబితః సన్ అనేకోజాతః। ఇత్యుభయత్రాపిదృష్టాంతః జ్ఞాతవ్యః।

ఆత్మవస్తువులలో ప్రతిబింబించినది అనుప్రతిబింబవాద పక్షమందు సముద్రము, నది, చెరువు, బావి,ఘటజలము అను మొదలైన వాటియందు. ఒకే ఒక జలము ఎట్లు అనేకములుగా ఏర్పడినదో అట్లే అనాత్మ కూడా అనేకవిధములుగా ఏర్పడినది. సముద్రాదులయందు ఒకే ఒక సూర్యుడు ప్రతిబింబించి అనేకులుగా ఎట్లుకనబడునో అట్లే ఒకే ఆత్మ అన్తఃకరణసహితమై సర్వశరీరములందు ప్రతిబింబించి అనేకములుగా కనబడుచున్నది. ఈ విధముగ రెండుపక్షములలో దృష్టాంతములు

యథాజలధర్మాః శీతకిరణాదయోబింబమాదిత్యంన స్పృశన్తి," తథాఅన్తఃకరణధర్మాః కర్తృత్వ, భోక్తృత్వ వికారా అపి తదన్తఃకరణనిష్ఠ చిదాభాస ఏవభాన్తి । బింబభూతమాత్మానం నస్పృశన్తి। తస్మాజ్జీవాత్మైవ పరమాత్మా । పరమాత్మైవ జీవాత్మా । తత్కథమితి చేత్ యథాఘటాకాశ ఏవ మఠాకాశః । మఠాకాశ ఏవ ఘటాకాశః ఏవమితి జానీహి ।

ఏ ప్రకారముగా జలధర్మములైన శీతలకిరణాదులు సూర్య బింబమును తాకుటలేదో ఆ ప్రకారముగ అంతఃకరణ ధర్మములైన కర్తృత్వభోక్తృత్వవికారములు కూడా అన్తఃకరణ నిష్ఠ చిదాభాసుని యందే ప్రకాశించును. కాని, బింబభూతమైన ఆత్మను తాకలేవు. కనుక జీవాత్మయే పరమాత్మ. పరమాత్మయే జీవాత్మ. ఎట్లనగా ఘటాకాశమే మఠాకాశము. మఠాకాశమే ఘటాకాశము అయినట్లు అని తెలసికొనుము.

నను జీవాత్మనః కల్పితత్వాత్, కల్పితస్య అసత్యత్వాత్ కథం సత్యపరమాత్మాభేద ఇతి చేత్ । పారమార్థికో, వ్యావహారికః, ప్రాతిభాసిక, ఇతి జీవః త్రివిధః । ఏతేజీవాః క్రమేణ సుషుప్తి జాగ్రత్ స్వప్నాభిమానినః । యథా జలే తరంగః కల్పితః, తరంగే ఫేనః కల్పితః తథా పారమార్థికే వ్యావహారికః కల్పితః । వ్యావహారికే ప్రాతిభాసికః కల్పితః ।

జీవాత్మ కల్పితుడు కదా! కల్పితము ఎప్పుడు అసత్యమే అయిఉండును కదా! సత్యమైనపరమాత్మతో అతనికి ఎట్లు అభేదము సిద్ధించును? అనినచో, పారమార్థికుడు, వ్యావహారికుడు, ప్రాతిభాసికుడు అని జీవుడు మూడు విధములుగా ఉన్నాడు. ఈ జీవులందరు క్రమముగా సుషుప్తి జాగ్రత్, స్వప్నఅభిమానులు. ఏవిధముగా జలమందు తరంగము కల్పితమో తరంగమునందు నురుగు కల్పితమో, ఆ ప్రకారముగా పారమార్థికుని యందు వ్యావహారికుడు కల్పించబడినాడు. వ్యావహారికుని యందు ప్రాతిభాసికుడు కల్పించబడినాడు.

" మాధుర్య ద్రవత్వశైత్యాదీని పారమార్థికజలనిష్ఠాన్యేవ సన్తి। తరంగే భాన్తి తద్ద్వారాఫేనే భాన్తి। తద్వత్ కూటస్థ సచ్చిదానందాః కూటస్థ పారమార్థిక నిష్ఠాః సన్తో వ్యావహారికే భాన్తి తద్ద్వారా ప్రాతిభాసికే భాన్తి। యథాఫేనస్తరంగం వినానాస్తి తరంగోఽపి జలం వినా నాస్తి జలం తు పరమార్థ భూతం। ఏవం ప్రాతిభాసికోఽపి వ్యావహారికం వినా నాస్తి। వ్యావహారికో ఽ పి పారమార్థికం వినానాస్తి। తస్మిన్ యథా పదార్థత్వేన ఘటాకాశో, మఠాకాశ ఏవ ఏవం పారమార్థికః కూటస్థః పరమాత్మాఏవ జీవః ఇతి సిద్ధాన్తః

మాధుర్యము, ద్రవత్వము, చల్లదనము మొదలైనవి పారమార్థిక జలమునందే ఉన్న లక్షణములు. అవి తరంగమునందు ప్రకాశించును.

తరంగములద్వారా నురగలయందు ప్రకాశించును. ఆ ప్రకారమే కూటస్థుని యందుండు సచ్చిదానంద లక్షణములు. కూటస్థ పారమార్థికునియందును, వ్యావహారికునియందును, తద్ద్వారా ప్రాతి భాసికుని యందును భాసించును. ఎటుల నురగ తరంగము లేకుండా ఉండదో, తరంగము కూడా జలము లేకుండా ఉండదో జలము మాత్రము పారమార్థికమో అనగా జలము ఎప్పుడూ ఉండునో, అటులే ప్రాతి భాసికుడు కూడా వ్యావహారికుడు లేకుండా ఉండడు. వ్యావహారికుడు కూడా పారమార్థికుడు లేకుండా ఉండడు. పరమార్థముగా ఘటాకాశము మఠాకాశమే అయి ఉన్నది కదా అట్లే పారమార్థిక కూటస్థ పరమాత్మయే జీవాత్మ అని సిద్ధాంతము.

"ఏవం యః"నేతి, నేతి" వాక్యేన దేహాది పంచకోశేభ్యః పారమార్థిక కూటస్థం పృథక్కృత్య తం పారమార్థికం కూటస్థమహమితి జానన్ సన్, తదహంబ్రహ్మ బ్రహ్మాహమస్మీతి శ్రుతి స్మృతి విచారేణ యుక్తిభిః దృఢ నిశ్చయేన సాక్షాత్ కృత్య తిష్ఠతి స ఏష పరిపూర్ణ బ్రహ్మస్వరూపః। తం ఏవ పుణ్య, పాప కర్మాణి నస్పృశంతి ఇతి సర్వా అప్యుపనిషదః ఏక తాత్పర్యేణఘుష్యంతి।

ఇతి మననే తృతీయవర్ణకం సమాప్తమ్

ఇట్లే'న' 'న' ( ఇది కాదు, ఇది కాదు) అను వాక్యముల చేత దేహాదిపంచకోశములనుండి పారమార్థిక కూటస్థుని వేరుచేసి ఆ పారమార్థికమైన కూటస్థుడే 'నేను' అని తెలిసికొని ఎవరు నేను బ్రహ్మమును అని శ్రుతి స్మృతి విచారణ ద్వారా, ఉపమానముల ద్వారా, దృఢనిశ్చయముతో సాక్షాత్కారమును పొంది ఉండునో ఆయనయే పరిపూర్ణ బ్రహ్మస్వరూపము ఆయనను పుణ్య,పాపకర్మలు స్పృశించవని సమస్త ఉపనిషత్తులు ఏక తాత్పర్యముతో ఘోషించుచున్నవి.

ఇట్లు మననమునందు మూడవ వర్ణకము ముగిసినది.

.. .. .. ..

అథ చతుర్థవర్ణకమ్

"అథేదానీం జీవస్య దుఃఖం జన్మచ, కర్మచ, రాగద్వేషాదిచ, అభిమానశ్చ, అవివేకశ్చ,అజ్ఞానం చ ఏతేషు పూర్వ పూర్వం ప్రతి ఉత్తరోత్తరం

హేతుః । తత్ర దుఃఖాది చతుష్టయం చతుర్థ వర్ణకే విచార్యతే''।

నాలుగవ వర్ణకము ఇటుపైని జీవునకు కల్గు దుఃఖము,జన్మ,కర్మ రాగద్వేషాదులు, అభిమానము అవివేకము అజ్ఞానము అను వాటిలో ముందు ముందువానికి తరువాత తరువాతివి కారణములుగా ఉన్నవి.

ఈ నాల్గవ వర్ణకము నందు దుఃఖాదులు నాల్గు విచారణ చేయబడుచున్నవి.

" జీవాత్మనోదుఃఖంస్వాభావికంవా అగంతుకం వా ఇతిచేత్ అగంతుకం ఇతిజ్ఞేయమ్।స్వాభావికమితి చేత్ అనేకదోషాః సన్తి। తత్ కథమితి చేత్। అస్య జీవాత్మనోదుఃఖం స్వాభావికం చేత్ దుఃఖ నివృత్తిః కదాచిత్ అపి నస్యాత్। దుఃఖ నివృత్త్యై సుఖప్రాప్త్యైకర్మ కస్యాపి మాస్తు । సత్కర్మ యోగ, ధ్యానోపాసనేషు కస్యాపి ప్రయత్నోమాస్తు। వేద శాస్త్రపురాణాని చ వ్యర్థానిస్యుః ఇతి జానీహి।

జీవునకు దుఃఖము స్వాభావికమా? అగంతుకమా? అనిన అగంతుకమని తెలియవలెను. స్వాభావికమనినచో అనేక దోషములు కల్గును . ఎట్లనగా ఈ జీవునికి దుఃఖము స్వాభావికమైనచో దుఃఖనివృత్తి ఎప్పుడును కలుగకుండ ఉండవలసివచ్చును. దుఃఖము పోగొట్టుకొనుటకు గానీ సుఖము రాబట్టుకొనుటకుగానీ ఎవ్వరును యత్నించకుండ ఉండ వలసివచ్చును తత్సాధనమైన కర్మ ఎవరికిని అవసరము లేకుండ పోవును. సత్కర్మ, యోగ,ధ్యాన, ఉపాసనాదులయందు ఎవరికిని ప్రయత్నము చేయవలసిన అవసరము లేకుండా పోవును. వేదశాస్త్రములు పురాణములు కూడా వ్యర్థములు కావలసి వచ్చునని తెలియుము.

"తర్హిదుఃఖం స్వాభావికమస్తు । తన్నివృత్త్యై ప్రయత్నం కరోత్వితిచేత్ నకదాచిదపి తన్నాశః నంభవతి స్వాభావికస్య స్వస్వరూపత్వాత్। స్వరూపనాశార్థం కోవా ప్రయత్నం కుర్యాత్। స్వరూపనాశేసతి పురుషార్థభాక్ చ నస్యాత్'' ।

అట్లయినచో దుఃఖము స్వాభావికమే, దాని నివృత్తికై సాధకుడు ప్రయత్నము చేయవచ్చును కదా? అనినచో అది ఎప్పుడును జరుగదు. స్వాభావికమైనదుఃఖమునకు నాశ ము సంభవించదు. స్వాభావికమనగా

స్వస్వరూపము. స్వరూపనాశము కొరకు ఎవరు ప్రయత్నము చేయుదురు? స్వరూపము నశించినచో పురుషార్థము అనుభవించు వాడు ఉండడు కదా!

" స్వాభావికమేవ స్వస్వరూపం। కథమితి చేత్ గుడస్యమధురరసః స్వభావః। తస్యమధుర గుణస్య నాశే భవితవ్యే గుడస్యైవ నాశో భవేత్।తథా జీవాత్మనో దుఃఖం స్వాభావికం చేత్ దుఃఖనాశే ఆత్మ స్వరూపనాశ ఏవస్యాత్ । ఆత్మనో నాశో నాస్తి। అవినాశీ నిత్య ఇతి। " అవినాశీ వారేऽయమాత్మా"। "ఆకాశవత్ సర్వగతశ్చనిత్యః" "నజాయతే మ్రియతే వా విపశ్చిత్ నాయం భూత్వాభవితావానభూయః" । "అజోనిత్యఃశాశ్వతో ऽయం పురాణో న హన్యతే హన్యమానే శరీరే" ఇత్యాది శ్రుతయోవదన్తి। తస్మాత్ ఆత్మనో దుః ఖం స్వాభావికం నభవతి, ఆగంతుకమేవేతి జానీహి।

స్వస్వరూపము స్వాభావికమే. ఎట్లనగా బెల్లమునకు మధుర రసము స్వభావము. ఆ మధురరసము పోవలెనన్నగుడనాశమే అగును.అట్లే దుః ఖము స్వాభావికమైనచో దుఃఖనాశము సంభవించిన ఆత్మస్వరూపనాశమే కలుగవలసి వచ్చును. కాని ఆత్మకు నాశము లేదు "అవినాశీ నిత్యః, "అవినాశీవారే అయమాత్మా" "ఆకాశవత్సర్వగతశ్చనిత్యః :", . న భ ూ ా య ః

"అజో నిత్యః శాశ్వతో-యం పురాణోనహన్యతే హన్యమానేశరీరే " ఈ విధములైన శ్రుతులు అన్నిఆత్మనిత్యత్వము చెప్పుచున్నవి. ఆ కారణము చేత ఆత్మకు దుఃఖము స్వాభావికము కాదు ఆగంతుకమనియే తెలిసికొనుము.

"స్వాభావికం నశ్యతు, స్వరూపం తిష్ఠతు ఇతి చేత్ తన్న సంభవతి"। నను అగ్నేఃస్వాభావికం ఉష్ణత్వం మణిమంత్రాదిభిఃగచ్ఛతి।స్వరూపనాశోऽపినాస్తి। శైత్యమప్యాగచ్ఛతి ।తథాత్మనోऽపిదుఃఖం స్వాభావికం । తదుత్కృష్టకర్మోపాసనా యోగబలేనగచ్ఛతు। ఇతి వదసి చేత్ సానివృత్తిః తాత్కాలిక్యేవ నాత్యంతికీ । కథమితి చేత్ కర్మజన్యం సకలమపి కర్మనాశే నశ్యతి । త్వదుక్త దృష్టాంతదార్ష్టాంతికయోరగ్న్యాత్మనోరుష్ణత్వం దుఃఖత్వంచ స్వాభావికం చేత్ మణిమంత్రాదిభిః ఉత్కృష్టకర్మోపాసనయోగైశ్చ గతమపి శైత్యం చసుఖం చతత్ కర్మ క్షయేతు గచ్ఛేత్। పునః స్వాభావికముష్ణత్వం

దుఃఖత్వం చాగచ్ఛేత్। ఏవం చ సతి సర్వజీవానాం తాత్కాలికముక్తిం వినాపునర్జన్మరహితాముక్తిర్నస్యాత్। కిఞ్చ మోక్షస్య జన్యత్వేఽనిత్యత్వమపి స్యాత్ । " నసపునరావర్తతే"ఇతిముక్తేః నిత్యత్వప్రతిపాదకశ్రుతేః "అఖండమానందమరూపమద్భుతమ్" ఇతిశ్రుతేశ్చ విరోధఃస్యాత్ ।

" స్వాభావికమునశించునుగాక, స్వరూపము మాత్రము ఉండ వచ్చును" అనునది కుదురదు. అగ్నికిస్వాభావికము వేడితనము . కాని అది మణిమంత్రాదుల చేత పోవుచున్నది. కదా! దాని స్వరూపమైతే నశించుట లేదు. విరుద్ధమై వేరైన చల్లదనము కూడా వచ్చుచున్నది. ఆ ప్రకారమే దుఃఖము ఆత్మకు స్వాభావికమే కానిందు ఉత్కృష్టకర్మోపాసనల ద్వారా అది పోవచ్చును. 'సుఖము కల్గవచ్చును' అని అనినచో ఇది సమాధానము. ఏమన స్వాభావికమైన దాని నివృత్తి తాత్కాలికమే గానీ శాశ్వతముగా జరుగునది కాదు. ఎటులనగా కర్మచేత పుట్టిన సకలము (కర్మఫలము) కర్మనశించినచో నశించుచున్నది. మీ చేత చెప్పబడిన దృష్టాంత దార్ష్టాంతికములయందు అగ్నికి ఉష్ణత్వము, ఆత్మకు దుఃఖస్వరూపము స్వాభావికమన్నచో మణిమంత్రాదుల చేత ఉత్కృష్ట కర్మోపాసన యోగముల చేత వచ్చినప్పటికి ఆకర్మనశించుట తోడనే అగ్నికి చల్లదనము లేనట్లు ఆత్మకు సుఖము పోవలసి వచ్చును. తిరిగి స్వాభావికమైన వేడితనము, దుఃఖపుతనము రావలసి వచ్చును. ఈ విధముగా సమస్తజీవులకు తాత్కాలికముక్తి కాక పునర్జన్మ రహితమైన శాశ్వత ముక్తి కలుగక పోవలసివచ్చును. ఇంతేకాక మోక్షము పుట్టినదనినచో అది అనిత్యము కావలసివచ్చును. " నసపునరావర్తతే అని ముక్తికి నిత్యత్వమును చెప్పుశ్రుతికిని " అఖండమానందమరూపమద్భుతం" అను శ్రుతికిని విరోధము కలుగును.

" ఆత్మనో దుఃఖస్వభావత్వేసుషుప్త్యవస్థాయాం తూష్ణీంభావే యోగినాం సమాధౌచదుఃఖమేవ ప్రతీయాత్। కింతు తథా న దృశ్యతే। త్రయాణామపి ఉత్థానానన్తరం ఏతావత్ పర్యన్తం సుఖమేవాహమాసమితి సుఖమేవ స్మర్యతే తస్మాత్ ఆత్మనః సుఖమేవ స్వాభావికం। దుఃఖమాగన్తుకమితి జానీహి।

ఆత్మకు దుఃఖము స్వాభావికమైనచో సుషుప్తి అవస్థయందు,

ఉదాసీనస్థితియందు, యోగులకు సమాధులయందును దుఃఖమే కలుగవలసివచ్చును. కాని వారికి అట్లనిపించుటలేదు. అటుల కనబడుటలేదు. పై ముగ్గురికిని మూడు స్థితులయందును లేచిన తర్వాత ఇంతవరకు సుఖమును పొందితిని అని సుఖమే గుర్తుకువచ్చుచున్నది. అనివారి అనుభవము.కావున ఆత్మకు సుఖమే స్వాభావికము. దుఃఖము ఆగంతుకమని తెలియవలెను.

"సుఖరూపస్యాప్యాత్మనో దుఃఖం శరీరపరిగ్రహేణాగతమ్। యత్ర యత్ర శరీరపరిగ్రహః తత్రతత్ర దుఃఖమితి వ్యాప్తేః। లోకే రాజ్ఞామపి శరీర పరిగ్రహేణ దుఃఖమస్తివేతి చేత్ అస్త్యేవ। తేషామపిశత్రుపీడయా, రాజ్యభారేణ ధనధాన్యక్షయేణ స్త్రీపుత్రాదిమరణేనచ, జరాదినా స్వమరణేనచ దుఃఖ దర్శనాత్ లోకే కేచన సుఖేన వర్తన్త ఇతి వ్యవహారో వృథా మోహ ఏవ । మోహేనాపి దుఃఖస్య సుఖత్వవ్యవహారః కథమితి చేత్ భారవాహకో బహుయోజనదూరం కార్యార్థం త్వరయా ధావన్, నంతతమపి కృష్యాదికర్మకరణశీలశ్చ, ఏవమాదయః సర్వేఽపి స్వస్వ కర్మణోదుః ఖరూపత్వే ఽపి మోహేన తత్కర్మ సుఖం మత్వా సంతుష్టాః గానం కుర్వన్తి ఉత్సాహవంతశ్చ వర్తంతే । తస్మాత్ మోహేన దుఃఖమేవ సుఖత్వేన భాతీతి జ్ఞాతవ్యమ్।

సుఖస్వరూపమైన ఆత్మకు దుఃఖము శరీరపరిగ్రహము చేతనే కల్గినది. ఎక్కడ శరీరసంబంధముండునో అక్కడ దుఃఖము ఉండును అనినియమము ! లోకములో రాజులు మున్నగు వారికి కూడా శరీర పరిగ్రహము వలన దుఃఖముఉన్నదా? అనినచో ఉన్నది వారికి కూడా శత్రుపీడ రాజ్యభారవహనము, ధనధాన్యక్షయము, స్త్రీపుత్రాదిమరణముల చేత వృద్ధాప్యము, మున్నగువానిచేత, తన మరణమును గురించి ఆలోచించుటచేత దుఃఖము కనబడుచునేయున్నది ! లోకములో కొంతమంది సుఖముగా ఉన్నారు అను వ్యవహారము అర్థము లేని మాటయే. మోహముతో కూడి ఉన్నప్పుడు దుఃఖము కూడా సుఖముగా అనిపించుట ఎట్లనినచో, బహుయోజన దూరము కార్యార్థియై త్వరత్వరగా పరుగెత్తుచున్న భారవాహకుడు వ్యవసాయము మున్నగు పనులు చేయు

స్వభావము కలవాడును ఈ మొదలైన వారెల్లరు మోహము చేత ఆయాపనులను సుఖముగా తలంచి సంతోషముగా పాటలు పాడుకొనుచు చేయుచుందురు. ఉత్సాహముగాఉందురు. కావున మోహముచే దుఃఖమే సుఖముగాఇచ్చటభాసించుచున్నదని తెలియవలెను.

తర్హి వివేకినామపి శరీరపరిగ్రహాత్ దుఃఖమస్తివేతి చేత్ తేషామపి క్షుత్పిపాసాదినా శీతోష్ణాదినా వ్యాధినా, సర్ప, వృశ్చిక, వ్యాఘ్రాదినా చ దుఃఖమస్త్యేవ । తర్హి వివేక్యవివేకినోః కో విశేష ఇతి చేత్ తయోః బాహ్యవ్యాపారేణ విశేషాభావే ఽ పి అంతరవ్యాపారేణ విశేషో ఽ స్తి। యో వివేకీ సమహాత్మా దుఃఖమంతఃకరణస్యైవ నాత్మనః సచ్చిదానందస్య. ఆత్మనో ఽ నృత జడదుఃఖస్వరూపాంతఃకరణధర్మైఃఅణుమాత్రసమ్బన్ధో ఽ పినాస్తీతి శ్రుతియుక్త్యనుభవైః విచార్య జ్ఞాత్వా తిష్ఠతి. 'తథాహి' అసంగోహ్యయం పురుషః' ఇతి శ్రుతేః నిరవయవత్వాత్, సత్యత్వాదికాః యుక్తయః సుషుప్తి తూష్ణీంభావ సమాధి అనుభవాదిషు వేదితవ్యాః।

వివేకులకు కూడా శరీర పరిగ్రహము వలన దుఃఖము కల్గుచున్నదా? అనినచో , వారికి కూడా ఆకలిదప్పికలు, శీతోష్ణాదులు, వ్యాధులు, సర్పవృశ్చికవ్యాఘ్రాదుల కారణముగా దుఃఖము కల్గుచునే ఉన్నది. అయితే వివేకులకు, అవివేకులకు భేదమేమి? అనినచో వారిద్దరికి బాహ్య వ్యాపారమందు భేదము లేకున్నను అంతర వ్యాపారమందు భేదమున్నది. ఆత్మానాత్మ వివేకము ఎవరికి కలదో ఆ మహాత్ముడు దుఃఖము అంతఃకరణమునకే గాని ఆత్మకు కాదనియు సచ్చిదానందస్వరూపమైన ఆత్మకు అనృత జడ దుఃఖరూపములగు అంతఃకరణ ధర్మములతో అణు మాత్రము సంబంధముఉండదనియు శ్రుతి, యుక్తి అనుభవముల ద్వారా విచారించి తెలిసికొని సుఖముగా ఉండును. " అసంగోహ్యయం పురుషః" అని శ్రుతి ఉండుటవలనను, ఎవరితోనూ సంగము అవయవములు లేకుండట వల్ల, పుట్టనది. నిత్యమైనది అను మొదలైన యుక్తులుండుట వలనను, సుషుప్తి, ఉదాసీన సమాధుల యందు అనుభవముండుట వలనను ఆ మహానుభావుడు తెలిసికొనియుండును.

యఃఅవివేకీ సదురాత్మా ఆత్మస్వరూపం అవిచార్య దేహాదిక మేవాత్మానం మత్వా అనాత్మధర్మాంశ్చాత్మన్యారోప్య, ఆత్మనః సచ్చిదానందాన్ ధర్మాంశ్చ అనాత్మన్యారోప్య, ఏవం అన్యోన్యాధ్యాసం కుర్వన్ అహం దేవః , అహం మనుష్యః, అహం ఆంధ్రః, అహం ద్రావిడః, అహం బ్రాహ్మణః, అహం క్షత్రియః అహం వైశ్యః, అహం శూద్రః, అహం బ్రహ్మచారీ, అహం గృహస్థః అహం వానప్రస్థః, అహం సన్న్యాసీ ఇత్యాది ప్రకారేణ జాతి, వర్ణాశ్రమాభిమానీ తిష్ఠతి। ఏవం వివేక్యవివేకినోః భేదోఽస్తి।

పైన చెప్పిన వివేకము లేనివాడు దుఃఖమును పొందువాడు. ఆత్మస్వరూపమును విచారించక, దేహాదికమును ఆత్మయని తలంచి అనాత్మధర్మములను ఆత్మయందు ఆరోపించి, ఆత్మయందుగల సచ్చిదానందధర్మములను అనాత్మయందు ఆరోపించి ఈ విధమైన అన్యోన్య, అధ్యాస చేసి ( ఆరోపించుకొని) నేను దేవతను, నేను మనుష్యుడను, నేను ఆంధ్రుడను, నేను ద్రావిడుడను, నేను బ్రహ్మచారిని, నేను గృహస్థుడను, నేను వానప్రస్థుడను అని అనేక ప్రకారములుగా జాతివర్ణ ఆశ్రమ అభిమానములను పొందుచుండును. ఈ విధముగా వివేకి, అవివేకులకు చాలా భేదము కలదు.

"విచార్యమాణేతయోఃబాహ్య వ్యాపారేణాపి నసామ్యమ్। కథమితి చేత్ వివేకీ ప్రపంచం సర్వమపి మిథ్యేతి నిశ్చిత్య ప్రారబ్ధభోగమపి స్వప్నభోగ తుల్యమేవేతి పశ్యతి । అవివేకీ తు ప్రపంచః సత్యః సుఖదుఃఖానుభవో పి సత్యఏవేతి పశ్యతి। ఏవం వివేకినామపి శరీరపరిగ్రహాత్ దుఃఖమస్త్యేవ।

విచారించినట్లైన వారిద్దరికి బాహ్యావ్యాపారములలో కూడా సమానత్వము లేదు. ఎటులనగా వివేకి ప్రపంచము సర్వము మిథ్యయని నిశ్చయించి ప్రారబ్ధభోగమును స్వప్నభోగతుల్యముగా చూచును. అవివేకి అట్లుకాక, ప్రపంచము సత్యమని సుఖదుఃఖానుభవము కూడా సత్యమని చూచును. ఈ విధముగా వివేకులకు కూడా శరీరపరిగ్రహము వలన దుఃఖము కల్గుచున్నది.

" దేవానామపి " వజ్రహస్తః పురందరః" ఇత్యాదినా శరీర పరిగ్రహస్య దర్శనాత్ దుఃఖమస్త్యేవ । కథమితిచేత్ అన్యోన్యం యుధ్యతోః

కోపశాపాభ్యాం అసుర రాక్షసయోః ఉపద్రవదర్శనాత్। పుణ్యకర్మఫలనాశేసతి భావ్యధఃపతనభయాదపి దుఃఖమస్తి। కథం దుఃఖినామపి తేషాం ఇతరైః ఉపాస్యత్వం, కథం వా సుఖదాతృత్వ మితి చేత్ అస్మిన్ లోకే రాజ ప్రభృతీనామపి స్వాశ్రిత పరిపాలనాదికంయథాతథేతి జ్ఞేయమ్। "దేవలోకే దేవా ఆనంద రూపా స్తిష్ఠంతి" ఇతిశ్రుతేః దేవాదుఃఖం సర్వమపి అన్తః కరణధర్మం మత్వా, ఆత్మానం ఆనందంస్వరూపం సదా అనుభవన్తఏవ తిష్ఠంతీతి తాత్పర్యమ్। తేషా మపి దుఃఖ మాయాతీతి వదంత్యాః "తా ఏతా దేవతాః సృష్టా అస్మిన్ మహత్యర్ణవే ప్రాపతన్" ఇతి శ్రుతేఃదేవానామపి శరీరపరిగ్రహాత్ దుఃఖమస్త్యేవేతి తాత్పర్యమ్। తస్మాత్ విదేహముక్త్యర్థమేవ ప్రయత్నః కర్తవ్యః

దేవతలకు కూడా 'వజ్రహస్తుడు', 'పురందరుడు' అనుమొదలైన ఆకారవర్ణములచే శరీరపరిగ్రహమున్నది. దానివలన దుఃఖము కల్గుచున్నది. ఎటులనిన వారు అన్యోన్యము చేసికొనుయుద్ధమువలనను, కోపశాపముల వలనను అసురరాక్షసులుకల్గించు ఉపద్రవములు కనబడుచుండుట వలనను వారికి దుఃఖముఉన్నట్లు తెలియుచున్నది. పుణ్యకర్మ ఫలము నశించుటతోనే అధఃపతనము (మరల కష్టభూయిష్ఠమైన భూలోక ప్రాప్తి) భయాది దుఃఖము కలుగుచుండును. దుఃఖము కలవారైన వారిని ఇతరులేల ఉపాసించుచున్నారు? వీరికి వారు సుఖము ఎట్లీయగలరు? అని అనినచో ఈ లోకమందు రాజులు మొదలైనవారు తమను ఆశ్రయించుకొనిన వారిని పరిపాలించుట మున్నగు విషయములలో ఎటులో అటులు అని తెలియనగును. దేవలోకములో దేవతలు ఆనంద రూపముగా ఉందురు అని శ్రుతి చెప్పుచున్నదనినచో ఆశ్రుతికి దేవతలుదుఃఖమునంతటిని అన్తఃకరణధర్మముగాతలంచి ఆత్మ ఆనందస్వరూపమైనదిగా సదా అను భవించుచుందురు. అని తాత్పర్యము. వారికి కూడా దుఃఖము కల్గుచుండునని చెప్పు "తా ఏతా దేవతాః" అను శ్రుతికి దేవతలకు కూడా శరీరపరిగ్రహము వలన దుఃఖము ఉన్నదనియే తాత్పర్యము. కాబట్టి విదేహముక్తి కొరకే ప్రయత్నము చేయుట కర్తవ్యము.

అశరీరముక్తేరేవ ముక్తిత్వం చేత్, సశరీరా ఆకాశే నక్షత్రరూపేణ పరిదృశ్యమానాః కేచన దేవా ముక్తా ఇతి మనుష్యైః కథ్యన్త ఇతిచేత్- శృణు

సాలోక్యం, సామీప్యం, సారూప్యం, సాయుజ్యమితి చతుర్విధా ముక్తిః । చర్యా, క్రియా, యోగో, జ్ఞానమితి చతుర్ణాం క్రమేణ సాధనాని। భగవత్ కైంకర్యరూప,దాసభావశ్చర్యా। శివ, విష్ణ్వాది పూజావిధిః క్రియా । యమ నియమాది అష్టాంగయోగోయోగః। జీవ పరయోః ఐక్యసాక్షాత్కారో జ్ఞానమ్। తత్ర తిస్రోముక్తయో ముఖ్యా న భవంతి । పునరావృత్తేః సద్భావాత్। సాయుజ్యమేవ ముఖ్యాముక్తిః పునరావృత్తి వర్జనాత్ । యోగేన సాయుజ్యమితి నిర్గుణ బ్రహ్మయోగవిషయః।

అశరీరముక్తియే ముక్తి అయినా సశరీరముగా ఆకాశమునందు నక్షత్ర రూపములో కనబడుచున్న కొంతమంది దేవతలు ముక్తులు అని మనుష్యులచేత చెప్పబడుచున్నారు కదా? అన్నచో వినుము సాలోక్యము, సామీప్యము, సారూప్యము, సాయుజ్యమని నాల్గు విధములైన ముక్తులు కలవు. చర్య, క్రియ, యోగము, జ్ఞానము, అని పై నాల్గింటికి నాల్గు విధములైన సాధనములు కలవు. అందు1)భగవత్ కైంకర్యమను దాసభావము చర్య, 2) శివ,విష్ణ్వాది దేవతలకు పూజావిధి క్రియ, 3)యమ నియమాది అష్టాంగయోగము, యోగము. 4) జీవ పరమాత్మలకు ఐక్యసాక్షాత్కారము జ్ఞానము. పునరావృత్తి కలదుకావున ఇందు మూడువిధములైన ముక్తులు ముఖ్యమైనవి కావు. సాయుజ్యమే ముఖ్యమైన ముక్తి. పునరావృత్తి లేకుండుటయే దీనికి కారణము. యోగము చేత సాయుజ్యము అనుమాట నిర్గుణ బ్రహ్మయోగమునకు సంబంధించిన అంశము.

' సశరీర ముక్తానామివ అశరీరముక్తానాం కదాపి కుత్రచిదపి కథంచిదపి దర్శనాభావాత్శూన్యమేవాశరీరముక్తిరితి నమన్తవ్యమ్। శరీరముక్తానాం శరీరస్యైవ శూన్యత్వం, నస్వరూపసుఖస్య। స్వరూప సుఖంతు సుషుప్తి సుఖవత్ అశరీరత్వాత్ స్వసంవేద్యమేవ నాన్య సంవేద్యమ్।

సశరీరముక్తులకువలె అశరీరముక్తులుకూడా ఎప్పుడైనను, ఎక్కడైనను, ఎట్టి పరిస్థితులలోను కనబడుటలేదు. అందుచే అశరీరముక్తి అనగా శూన్యమేయని తలంచరాదు. అశరీరముక్తులకుశరీరము శూన్యము. స్వరూప సుఖము శూన్యము కాదు. స్వరూప సుఖము గాఢ నిద్రయందలి

సుఖమువలెనుండును. శరీరములేకుండుటవలన అది స్వానుభవము చేత గ్రహింపదగినది కాని, ఇంద్రియాదీతర ప్రమాణములచే తెలియబడునది కాదు.

"సుషుప్తిః ముక్తి సమానా చేత్ సాపి ముక్తిః స్యాత్ ఇతి నవాచ్యమ్। సుఖానుభవ మాత్రేణ సామ్యేఽపి సుషుప్తావజ్ఞానం పునరుత్థానం చాస్తి। ముక్తౌ తదుభయమపి నాస్తి। అతః సుషుప్తేః ముక్తిత్వం న సంభవతి। అత ఏవ ప్రళయస్యాపి న ముక్తిత్వమ్। ఏవం సుషుప్తిసుఖవత్ ముక్తి సుఖమ్। సుఖస్య స్వానుభవగమ్యత్వాత్ ప్రత్యక్షత్వమేవ న శూన్యత్వమ్।

గాఢనిద్రముక్తితో సమానమని అన్నచో అదే ముక్తి కావలసి వచ్చునని అనరాదు. సుఖానుభవమాత్రముచేత సామ్యమున్నప్పటికి సుషుప్తియందు అజ్ఞానము మరల తిరిగి మెలకువ ఉన్నది. ముక్తియందుఅజ్ఞానము, మెలకువఈరెండునులేవు. ప్రళయము కూడ ముక్తి కాదు. కావున ఈ విధముగా సుషుప్తి సుఖమువలె ముక్తిసుఖము కూడా గమనించదగినది. సుఖము స్వానుభవ గమ్యము గాన ప్రత్యక్షమే. శూన్యము కాదు.

"తర్హిసశరీర ముక్తానామిహ అశరీరముక్తేరపి ప్రత్యక్షత్వే కో భేద ఇతి చేత్ అజ్ఞాన నివృత్తిః పునరుత్థానాభావశ్చ భేద ఇత్యుక్తమ్। ఏవం శ్రుతి యుక్తిభ్యాం అశరీరముక్తేః పరమసుఖత్వం శరీరపరిగ్రహేణ దుఃఖంచోక్తమ్"।

అయితే సశరీరముక్తులకు వలె అశరీర ముక్తికి ప్రత్యక్షమగుట సమానమైనచో వాటికన్న అశరీరముక్తిఏమి విశిష్టత? భేదము ఏమి? అన్నచో అజ్ఞాననివృత్తి,తిరిగిమెలకువ లేక పోవుటయే భేదము ( అశరీర ముక్తికి గల విశిష్టత ) అని చెప్పబడినది. ఈ విధముగా శ్రుతి యుక్తుల చేత అశరీరముక్తియే పరమసుఖము . శరీరపరిగ్రహముచేత దుఃఖము అనియు నిరూపించబడినది.

"ఇదానీం అనుభవేనాపి తదుభయం వదామః నిత్యం సుషుప్తౌ శరీర పరిగ్రహాభావాత్ దుఃఖాభావః జాగ్రత్ స్వప్నయోఃశరీర పరిగ్రహేణ దుఃఖంచ సర్వైః అనుభూయతే। తస్మాత్ యత్రయత్ర శరీర పరిగ్రహః తత్ర తత్ర దుఃఖమితి వ్యాప్తేః। ఆనందరూపస్యాత్మనః శరీరపరిగ్రహాదేవ దుః ఖం భవతి। నతు స్వతః।'తస్యశరీరస్య కో వాహేతురితిచేత్ పూర్వ కర్మసహిత

పంచీకృత భూతాన్యేవ న కేవల భూతాని , తేషాం సర్వత్రవర్తమాన త్వాత్ తేభ్యః శరీరం స్యాదితినవక్తవ్యమ్.

ననుశుక్లశోణిత సంబంధేనరూపేణ పరిణతానామేవ భూతానాంశరీర కారణత్వేన వివక్షితత్వాత్, తాదృశాన్యేవ శరీరస్య కారణ మితి నవక్తవ్యమ్ । వ్యర్థశుక్ల శోణితేషు శరీరోత్పత్త్యదర్శనాత్ తస్మాత్ కర్మసహితాన్యేవ శరీరస్యకారణాని, పంచభూతా దీనాందేశకాలాదీనాంచ సర్వసాధారణత్వాత్ తత్కర్మవైశిష్ట్యమేవ శరీరవైచిత్ర్యహేతుః

యథామృదాదీనాం సాధారణత్వేపి కులాల వ్యాపారవైచిత్ర్యమేవ ఘటాదికార్యవైచిత్ర్యేహేతుః। యథా దృష్టాన్తేఘ టాదేఃమృదుపాదానం కులాలవ్యాపారో నిమిత్తం ఏవందార్ష్టాంతికే ఽ పి శరీరస్య పంచీకృతభూతాన్యుపాదానం తత్తత్కర్మ నిమిత్తం. తస్మాద్భోగప్రదానికర్మాణి జాగ్రత్స్వప్నయో ః । కర్మాభావేశరీరాభావః యథాసుషుప్తౌ । కించ మృది సత్యామపి కులాల వ్యాపారాభావే ఘటోత్పత్త్యభావః తథా ఈశ్వర సృష్టపంచభూతేషు సత్స్వపి ఆత్మజ్ఞానేన కర్మసు నష్టేషు తస్య జ్ఞానినః శరీరంనోత్పద్యతే.

ఇపుడు ఈవిషయములో అనుభవము ద్వారా కూడా ఆ రెంటిని చెప్పుకొందము. నిత్యము నిద్రయందు శరీరపరిగ్రహము లేనందువలన దుఃఖములేకుండుట సర్వులకుఅనుభవమే. ఆ కారణము వలన ఆనందరూపమైన ఆత్మకు శరీరపరిగ్రహమువలననే దుఃఖము వచ్చుచున్నది. శరీరపరిగ్రహములేకున్న దుఃఖము ఉండదు. అని పంచభూతములు దేశకాలములు సర్వసాధారణములుగా ఉన్నను ఆయా కర్మయే శరీరవైచిత్ర్యమునకు కారణము.మట్టి మొదలైనవి సాధారణములైనప్పటికిని, కుమ్మరి వాని చేష్టల భేదము అనుసరించి ఒకే మట్టికి కుండ, చట్టి, మూకుడు, మొదలైన ఆకారములు కల్గుచున్నవి అట్లే కర్మ వైచిత్ర్యమే శరీరవైచిత్ర్యమునకు కారణము దృష్టాంతమందు కుండ,మొదలైన వానికి మట్టి ఉపాదానము. కుమ్మరి యొక్కవ్యాపారము నిమిత్తమైనట్లు దార్ష్టాంతిక (ప్రస్తుత, ఉపమేయ) మందు శరీరమునకు పంచీకృత పంచభూతములు ఉపాదానము ఆయాకర్మయే నిమిత్తము.

ఆ కారణముగా భోగప్రదమైన కర్మలున్నవి. జాగ్రత్ స్వప్నావస్థలలో అవి ఉండుటయేమనకు అనుభవము. కర్మలేనిచో శరీరముఉండదు. గాఢ నిద్రయందు (సుషుప్తియందు) కర్మలేకుండటయే ఉదాహరణము. మట్టిఉన్నప్పటికిని కుమ్మరి వాని వ్యాపారము లేని ఎడల కుండ పుట్టుట లేదు. అటులనే సృష్టములైన పంచభూతములు ఉన్నప్పటికి ఆత్మజ్ఞానము వలన కర్మలు నశించినచో జ్ఞానికి శరీరము కలుగదు. శరీరము వచ్చుటకు కారణమేమి అనినచో పూర్వకర్మలతో కూడిన పంచీకృత భూతములే! కేవల పంచభూతములు అగుటవలన వాటి నుండి శరీరము వచ్చునని చెప్పకూడదు. శుక్లశోణితరూపముగా పరిణతములయిన భూతములకు శరీరకారణముగా వివక్షచేయబడినది అట్టి భూతములే శరీరమునకు కారణము అని చెప్పకూడదు. వ్యర్థ శుక్ల శోణితములందు శరీరోత్పత్తి కన్పింపకపోవుట వలన కర్మ సహితములయిన శుక్లశోణితములే శరీరమునకు కారణములు పంచభూతాదుల, దేశకాలాదులు అందరికిని సాధారణములే కావున కర్మలతోకూడిన శుక్లశోణితములే శరీరవై చిత్ర్యమునకు కారణము మృదాదులు సర్వ సాధారణములు అయినను కుమ్మరి యొక్క వ్యాపారమును బట్టి ఘటాది కార్యములలో విచిత్రములయినవి కల్గుటకు కారణము దృష్టాంతముయిన ఘటాదులలతో మట్టి ఉపాదానం కులాలవ్యాపారం నిమిత్తము. ఇట్లు దార్ష్టాంతికమైన ఉపమేయమునందు కూడా శరీరము వచ్చుటకు పంచీకృత భూతములు ఉపాదాన కారణము వారి వారి కర్మలు నిమిత్త కారణము కాన జాగ్రత్ స్వప్నములలో కూడా కర్మలే భోగప్రదములు కర్మలు లేకపోయిన శరీరము సుషుప్తిలో లేనట్టు భానము ఉండదు. మరియ మట్టి ఉన్నను కుమ్మరి వ్యాపారములేనిచో ఘటము పుట్టదు కదా అట్లే ఈశ్వరునిచే సృష్టింపబడిన పంచభూతములున్నను ఆత్మజ్ఞానముచే కర్మలు నశించగా జ్ఞానికి శరీరము పుట్టదు.

నను కర్మశాస్త్రే " అవశ్యమనుభోక్తవ్యం" ఇతి, " నా భుక్తం క్షీయతేకర్మ" ఇత్యాదిచ, జ్ఞానశాస్త్రే "జ్ఞానాగ్నిః సర్వకర్మాణిభస్మసాత్ కురుతే ఽ ర్జున" ఇతి చ వచనయోః పరస్పరవిరోధే కథం నిర్ణయః కర్తవ్య ఇతి

చేత్ శృణు । శాస్త్రే ప్రబలవచనం, దుర్బలవచనం చాస్తి । ప్రబలం సిద్ధాంతవచనమ్ । దుర్బలం పూర్వపక్ష వచనమ్। ప్రబలం దుర్బలం నిరస్యతి। తద్యథా " అహింసా పరమోధర్మః" ఇతి వచనం ప్రబలమపి " యాగే పశువధః కర్తవ్యః" ఇతి అతి ప్రబలం వచనం నిరస్యతి। ఏవం " అవశ్యమనుభోక్తవ్యం ఇతి వచనం "తపసా కల్మషం హన్తి" ఇతి ప్రబలవచనేన దుర్బలం సత్నిరస్యతే।

కర్మ శాస్త్రమందు"అవశ్యమనుభోక్తవ్యం" (ఏకర్మనైనా అనుభవించితీరవలయును) "నా భుక్తం క్షీయతేకర్మ" (అనుభవించక కర్మ క్షీణించదు), అను మొదలైన వచనము, జ్ఞానశాస్త్రమందు -"జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్ కురుతేతథా"(జ్ఞానాగ్ని అన్ని కర్మలను భస్మీకరించును) అని వచనము కలదు. వీటికి పరస్పర విరోధముఉండగా నిర్ణయమెట్లు చేయవలయును? అనిన, వినుము శాస్త్రమందుప్రబల వచనము దుర్బల వచనము అని ఉండును. ప్రబలమైనది సిద్ధాంత వచనము. దుర్బలమైనది పూర్వ పక్ష వచనము.ప్రబల వచనము దుర్బల వచనమును కొట్టివేయును. దీనికిఉదాహరణము."అహింసా పరమోధర్మః" (అహింసయేపరమధర్మము) అను వచనము ప్రబలమైనప్పటికి దానిని "యాగే పశువధః కర్తవ్యః" ("యాగమున పశువును విశసించవచ్చును") అను వచనము అంతకంటె ప్రబలమై నిరసించుచున్నది. ఇదేవిధముగా " అవశ్యమనుభోక్తవ్యం" (తప్పకఅనుభవించవలయును) అనువచనము " తపసాకల్మషంహంతి" (తపస్సు కల్మషము పోగొట్టును".) అను ప్రబలవచనము చేత దుర్బలమై నిరసింపబడుచున్నది.

తస్మాత్ సంచితేషు కర్మసు బహుషు సత్స్వపి ఆత్మజ్ఞానేన తాని నశ్యంత్యేవ। కర్మాభావేజన్మాభావః జన్మాభావే దుఃఖాభావః। దుఃఖా భావే ఆనందావాప్తిః। ఇతి అయమేవ సిద్ధాంతః ।ఇతిమననే చతుర్థం వర్ణకం సమాప్తమ్

అకారణము వలన సంచితమైన కర్మలు బహుప్రకారములుగా ఉన్నప్పటికి అవి అన్నియు ఆత్మజ్ఞానముచే నశించి తీరును. కర్మ లేనిచో జన్మ కూడా ఉండదు. జన్మ ఉండనిచో దుఃఖము ఉండదు.

దుఃఖము ఉండనిచో ఆనందము కల్గును.( ఉన్న ఆనందము తెలియును). ఇదియే సిద్ధాంతము.ఇట్లు మననమందు నాలుగవ వర్ణకము సమాప్తము.

అథపంచమవర్ణకమ్

అస్యాత్మనో దుఃఖం శరీర పరిగ్రహాత్, శరీరం కర్మణేత్యుక్తమ్। తత్ కర్మకిం ? కతివిధమితిచేత్ శృణు। కర్మ త్రివిధమ్।పుణ్యం, పాపం, మిశ్రం చేతి దేవాది శరీరం పుణ్యకర్మఫలం। తిర్యగాది శరీరం సర్వపాపకర్మఫలమ్ మనుష్యాది శరీరం పుణ్య,పాప మిశ్రిత కర్మఫలమ్। ఏవ ముక్తం త్రివిధమపి కర్మ, ఉత్కృష్టం, మధ్యమం , సామాన్యమితి ప్రత్యేకం త్రివిధమ్ । ఉక్తకర్మభేదేన జన్మభేదశ్చ నానా ప్రకారః ।

(ఐదవ వర్ణకము)

ఈ ఆత్మకు దుఃఖము శరీరపరిగ్రహమువలననే, శరీరము కర్మద్వారా ఏర్పడినదని చెప్పబడినది. ఆ కర్మ అనగానేమి? అది ఎన్ని విధములైనది? అనినచో వినుము.

కర్మ మూడు విధములు 1)పుణ్యకర్మ, 2)పాపకర్మ, 3)మిశ్రమకర్మ దేవాదులశరీరము పుణ్యకర్మఫలము. పశుపక్ష్యాదులశరీరము పాప కర్మఫలము, మనుష్యాదులశరీరము పుణ్య,పాప,మిశ్రిత కర్మఫలము. ఈ చెప్పబడినమూడువిధములైన కర్మలుకూడా ఉత్కృష్టము, మధ్యమము, సామాన్యము అని ఒక్కొక్కటి మూడు విధములు. ఈ విధముగా చెప్పబడిన కర్మభేదముచేత జన్మభేదముకూడా నానా విధములుగా ఉండును.

తథాహి హిరణ్యగర్భాదిశరీరం పుణ్యోత్కృష్టమ్। ఇంద్రాది శరీరం పుణ్య మధ్యమమ్। యక్ష రాక్షస పిశాచాది శరీరం పుణ్య సామాన్యమ్। పరసంతాపక కంటక వృక్ష విషవృక్ష వ్యాఘ్ర వృశ్చికోలూకాదిశరీరం సర్వం పాపోత్కృష్టమ్। పనస, ఆమ్ర, నారికేళాది ఫల పత్ర పుష్ప వినియోగవత్ వృక్షలతాది చ గ్రామ సూకర, మహిష గార్దభ, ఉష్ట్రాదికం చ సర్వం శరీరం పాప మధ్యమమ్।అశ్వత్థ, తులసీ, గవాశ్వాది శరీరం పాపసామాన్యమ్। ఇహ మనుష్యలోకే నిష్కామ కర్మానుష్ఠానసాధనచతుష్టయ సద్గురులాభ శ్రవణ మననాత్మజ్ఞాన క్రమేణజీవన్ముక్తేః విదేహ ముక్తేశ్చ యోగ్యం మనుష్యశరీరం మిశ్రకర్మోత్కృష్టమ్ స్వాశ్రమోచిత కర్మణాం కామ్య కర్మణాంచ అనుష్ఠాన

యోగ్యంశరీరం మిశ్రకర్మ మధ్యమం చండాలపుల్క కిరాతయవనాది శరీరం మిశ్రకర్మసామాన్యం తస్మాత్ వివేకినా పురుషేణఏతత్ కర్మఫల తారతమ్య విచారణభూమౌ మనుష్య జన్మని మిశ్ర కర్మోత్కృష్టం యథా సిద్ధ్యేత్తథా స్వవర్ణాశ్రమ కర్మాణి కృత్వా ఫలేచ్ఛాం విహాయ ఈశ్వరార్పణం కృత్వా ఆత్మ విచార ద్వారా మోక్ష ప్రాప్తావేవ ప్రయత్నః కర్తవ్య ఇతి సిద్ధాంతః

అదెట్లో గమనింతము. ఇతరులకుఉపకరించు హిరణ్య గర్భాదుల (బ్రహ్మాదుల) శరీరము ఉత్కృష్ట (అధిక) పుణ్యము వలన కలుగును. ఇంద్రాదిదేవతలశరీరము మధ్యమపుణ్యాఫలము. యక్ష, రాక్షస, పిశాచాదుల, శరీరము సామాన్య పుణ్యఫలము, పరులకు బాధ కలిగించు కంటక వృక్ష, విషవృక్ష, వ్యాఘ్రు వృశ్చికములు మొదలైనవాని శరీరములు ఉత్కృష్టమైన పాపఫలములు. పనస మామిడి, కొబ్బరి మొదలైన వృక్షములు, ఫల, పత్రపుష్పాదులతో ఉపయోగముకల వృక్షలతాదులును గ్రామసూకర, మహిష, గార్ధభములు, ఒంటె,మొదలగు వాని శరీరము మధ్యమ పాపఫలము. రావి, తులసి, ఆవు, గుఱ్ఱము మొదలగువాని శరీరము సామాన్య ఫాప ఫలము. ఈ మనుష్యలోకమందు నిష్కామ కర్మానుష్ఠానము, సాధన చతుష్టయసంపత్తి సద్గురు లాభము, శ్రవణ మననములు, ఆత్మ జ్ఞానము కలిగి తద్వారా క్రమముగా జీవన్ముక్తి విదేహముక్తి పొందుటకు యోగ్యమైన మనుష్య శరీరము ఉత్కృష్టమిశ్రమ ఫలము. తన ఆశ్రమోచితమైన కర్మలకు, కామ్య కర్మలకు అనుష్ఠానమునకు యోగ్యమైన శరీరము మధ్యమ మిశ్ర కర్మఫలము. చండాల పుల్కస, కిరాత, యవనాదుల శరీరము సామాన్య మిశ్ర కర్మఫలము. అకారణము వలన వివేకియైన పురుషుడు ఈ కర్మఫల తారతమ్యమును విచారించు విషయమున మనుష్య జన్మయందే ఉత్కృష్ట మిశ్రమ కర్మఫలము ఏ విధముగా సిద్ధించునో ఆ విధముగా తన వర్ణాశ్రమ విహిత కర్మఫలము ఏ విధముగా సిద్ధించునో ఆ విధముగా తన వర్ణాశ్రమ విహిత కర్మలను ఫలేచ్ఛను విడిచి పెట్టి ఈశ్వరార్పణముగా చేయుచు ఆత్మ విచారణ ద్వారా మోక్షప్రాప్తికై ప్రయత్నము చేయుటయే కర్తవ్యమని సిద్ధాంతము

ఏతత్ త్రివిధమపి కర్మకేన క్రియతే ఇతిచేత్ త్రివిధ కరణైరేవ

కర్తవ్యమితి జానీహి।

ఈ మూడు విధములైన కర్మ దేని చేత చేయబడుచున్నది అనినచో త్రివిధ కరణములచేత అనగా మనోవాక్కాయంకర్మలచేత కర్మ చేయబడదగియున్నదని తెలసికొనుము.

నను అస్మిన్ లోకే అహం కరోమ్యహం కరోమిఇతి వదతాం సర్వేషాం అనుభవేన అస్మిన్ దేహే దేహాభిమానీసన్, అహం శబ్ద వాచ్యతయా యః ఆత్మా వర్తతే తస్య ఆత్మనః కర్తృత్వేవక్తవ్యే తం విహాయ త్రివిధకరణానాం భవద్భిః కథం కర్తృత్వముచ్యతే ఇతి చేత్ ఆత్మాఅవికారీ, నిష్క్రియః స్వగతభేదశూన్యః। తదాత్మనః కర్తృత్వం వక్తుం న శక్యతే। నను కర్తృత్వంతు ఆత్మనిష్ఠతయా భాతి । కర్తా-అన్యో న దృశ్యతే? తత్ కథమితి చేత్ ఆత్మని ప్రతీయమానం కర్తృత్వమధ్యాసాత్ న తు స్వభావతః ఇతి జానీహి। స్వాభావిక మితి చేత్ న కేనా ఽ పి వేదాన్తవిచారం కృత్వా మమ ఇదంకర్తృత్వం పరిహరణీయమ్। అస్యఅనపాయే, సంసారబంధోఽపి నాపాస్యతీతి వ్యర్థః ప్రయత్నః కరణీయః।

ఈ లోకములో నేను చేయుచున్నాను. నేను చేయుచున్నాను. అని చెప్పు అందరి అనుభవముద్వారా ఈదేహమునందు దేహాభిమానియై (దేహము నేననుకొనుచున్నవాడై) అహం అను శబ్దముతో చెప్పబడు ఏ ఆత్మకలదో ఆ ఆత్మకు కర్తృత్వము చెప్పవలసి ఉండగా దానిని విడిచిపెట్టి మూడువిధములైన కరణములకు మీరు కర్తృత్వము ఎట్లు చెప్పుదురు? అనినచో ఆత్మ అవికారి నిష్క్రియుడు, స్వగతభేద శూన్యుడు, అట్టి ఆత్మకు కర్తృత్వము చెప్పుట కుదురదు.కర్తృత్వము ఆత్మయందే ఉన్నట్లు కనబడుచున్నది. వేరొక కర్త ఉన్నట్లు కనబడుటలేదు. కరణములకు కర్తృత్వమెట్లు? అనగా ఆత్మయందు ఉన్నట్లనిపించు కర్తృత్వము అధ్యాస వలన కల్గినదేగాని స్వాభావికము కాదని తెలిసికొనుము. స్వాభావికమైనచో ఎవరు కూడా వేదాంత విచారము చేసి తన ఆత్మకు కర్తృత్వమును తొలిగించుకొను యత్నముపో వలసివచ్చును. ఆత్మకు అట్టి కర్తృత్వము తొలగనిచో సంసార బంధము కూడా తొలగదు. కనుక దానికై వ్యర్థమైన ప్రయత్నము చేయవలసివచ్చును.

ఆత్మనః కర్తృత్వం స్వాభావికం భవతు। ప్రయత్న విశేషేణ నశ్యత్వితి చేత్- స్వరూపనాశార్థం కోవా ప్రయత్నం కుర్యాత్ । స్వరూపనాశే సతి కోవా పురుషార్థం అనుభవేత్। కించ అకర్తా జీవన్ముక్తోనచేత్ । వేదాన్త సంప్రదాయో గురు శిష్యాఃచనస్యుః। కించ'' ఆత్మా అకర్తా సాక్షీ నిష్క్రియ ఇతి ప్రతిపాదకస్య "నిష్కళం నిష్క్రియం, శాన్తం, నిరవద్యం, నిరంజనం " సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ " ఇత్యాదిశ్రుతివాక్యస్యాపి హానిః స్యాత్।

ఆత్మకు కర్తృత్వము స్వాభావికము కావచ్చును కాని విశేష ప్రయత్నముచే నశించవచ్చునన్నచో స్వరూపనాశము కొరకు ఎవడు ప్రయత్నము చేయును? స్వరూపము నశించినచో ఎవడు పురుషార్థమును అనుభవించును? ఇంతేకాదు అకర్త (కర్త కానివాడు) జీవన్ముక్తుడు కాడన్నచో వేదాంత సంప్రదాయము, గురుశిష్యులు కూడా లేకుండ ఉండవలసి వచ్చును. ఆత్మ, అకర్త, సాక్షి, నిష్క్రియుడని ప్రతిపాదించు వాక్యమునకు (నిష్కళం, నిష్క్రియం, శాంతం అను శ్రుతి వాక్యమునకు) హాని (నిరుపయోగము) ఏర్పడును.

సుషుప్తౌ ఆత్మని విద్యమానే-పి కర్తృత్వం నదృశ్యతే। యది కర్తృత్వం స్వాభావికం అగ్నేః ఉష్ణత్వమివ ఉపలభ్యేత। తథా నోపలభ్యతే । తస్మాత్ ఆత్మనః కర్తృత్వం న స్వాభావికమ్

నుషుప్తియందు ఆత్మఉన్నప్పటికిని దానికి కర్తృత్వము కనపడుటలేదు . కర్తృత్వము స్వాభావికమే అయినచో అగ్నికి స్వాభావికమైన ఉష్ణత్వమువలె గాఢనిద్రలో ఆత్మకు కర్తృత్వము తెలియవలసి ఉండెడిది. కాని సుషుప్తిలో ఆత్మకు కర్తృత్వమును ఉన్నట్లు తెలియుటలేదు. కావున ఆత్మకు కర్తృత్వము స్వాభావికము కాదు.

" నను సుషుప్తౌ కర్తృత్వానుపలంభః కరణ వియోగాత్। యథా తక్షాదేః కర్తృ త్వే విద్యమానే - పి స్నాన భోజనాది సమయే తదనుపలంభః । తద్వత్ భవితవ్యమితి చేత్। న। తూష్ణీంభూతావస్థాయామన్తఃకరణ సంయోగే విద్యమానే -పి కర్తృత్వానుపలంభాత్। ఆత్మనః కర్తృత్వం న స్వాభావికమ్ కింతు ఆధ్యాసికమేవ''

'సుషుప్తియందు కరణములు ప్రవర్తించనందువలన ఆత్మకు

కర్తృత్వము తెలియుటలేదు; అని చెప్పకూడదా! వడ్రంగికి కర్రపని యందు కర్తృత్వము ఉన్నప్పటికిని స్నానభోజనాదిసమయములందు కర్తృత్వము తెలియుట లేదు కదా? అట్లే కావచ్చుననుచో ఊరక ఉన్నప్పుడు అంతః కరణసంయోగమున్నప్పటకిని కర్తృత్వము కనపడుట లేదు. కనుక ఆత్మకు కర్తృత్వము స్వాభావికము కాదు. కానీ అది అధ్యాసవలననే అని తెలియవలెను.

" అధ్యాసోనామ అన్యనిష్ఠ ధర్మాణామన్యత్రావభాసః । యథానౌనిష్ఠ గమనస్య తీరస్థ వృక్షే, తీరస్థ వృక్షాచలత్వస్య నావి చాధ్యాసవశాత్ భానమ్ ఏవం త్రివిధకరణ నిష్ఠ కర్తృ త్వస్య ఆత్మని, ఆత్మ నిష్ఠాకర్తృతస్యత్రివిధ కరణేచ భానమ్ అజ్ఞానవశాదేవ । తస్మాత్ ఆత్మనః కర్తృత్వం ఆరోపాదితి జానీహి।'

"అధ్యాన అనగాఒకదాని ధర్మములుమరియొకదానియందు కనపడుచుండుట. పడవయొక్కగమనముతీరమునఉన్న వృక్షముల యందును, ఒడ్డున ఉన్న వృక్షముల యొక్క స్థిరత్వము పడవ యందును. భ్రమచేతఎట్లుఅనిపించునోఅట్లేమూడువిధములగు కరణములందు ఉన్నట్లునిశ్చితమైన కర్తృత్వము ఆత్మయందునుఆత్మయందున్న అకర్తృత్వము మూడు కరణములయందును అజ్ఞానవశమువలననే భాసించుట. ఆ కారణమువలన ఆత్మకు కర్తృత్వము ఆరోపణము వలనవచ్చినదే కాని సహజమైనది కాదు అని తెలియుము.

" జడస్య త్రివిధకరణస్య అచేతనత్వాత్,అచేతనస్య కథం కర్తృత్వమ్? కరణత్రయస్యైవకర్తృత్వే తస్యాపి కరణాంతరేణ భవితవ్యమితి చేత్ శృణు। యథాలోకే అచేతనస్య వాయోః వృక్షాదీనామున్మూలనే తేషాం దూరనిరసనేచ కరణం వినా కర్తృత్వం, యథా జల ప్రవాహస్య అచేతనస్య అపి వృక్షాదీనా మున్మూలనే తేషాం దూరనిరసనేచ కరణం వినా కర్తృత్వం దృశ్యతే, తథాత్రివిధ కరణస్యాపి కరణాంతరం వినా కర్తృత్వం ఉపపద్యతే"

జడములైన మూడువిధములైన కరణములు మనోవాక్కాయములు అచేతనములు కదా?అచేతన పదార్థములకు ఎటులకర్తృత్వము ఉండును? అచేతన కరణత్రయమునకు కర్తృత్వము చెప్పవలసివచ్చినచో వాటికి కూడా

వేరే కరణములు ఉండవలెనుకదా అన్నచో -వినుము.లోకములో అచేతన మైనటువంటి వాయువునకు వృక్షాదులను పెకలించుట, వాటిని దూరముగా విసిరి వేయుటలో వేరు ఉపకరణములు కనిపించుటలేదు. అచేతనమైన నీటి ప్రవాహమునకును ' పని చేయుటకు వేరు ఉపకరణములు లేకుండానే కర్తృత్వముఉన్నట్లు కనబడుచున్నది అటులనే త్రివిధ కరణములకుకూడా వేరు కరణములు లేకుండగనే కర్తృత్వము కుదురును.

ఏతత్త్రి విధకరణ కృత్యాని కానీతిచేదుచ్యతే సవిశేషచింతా,నిర్విశేషచింతా,పరలోకచింతా భక్తి,జ్ఞాన,వైరాగ్యచింతా ఇత్యాదివికారాః సర్వే -పి మనసా క్రియమాణాని కర్మాణి మానస పుణ్యకర్మాణి విషయచింతా పరేషామపకారచింతా వేదశాస్త్రయోః అప్రామాణ్యచింతా ధర్మాద్యభావచింతా ఇత్యాది బుద్ధి వికారాఃసర్వేఽ పిమానసపాపకర్మాణి సవిశేషచింతాయానిర్విశేషచింతాయాఅపి విషయచింతాదిపాపచింతయా మిశ్రీకృత్యానుష్ఠానం మానసం మిశ్రకర్మ.

ఈ మూడు కరణములు కృత్యములు ఏమిటి అనగా చెప్పబడుచున్నవి. సవిశేషచింత నిర్విశేషచింత పరలోకచింత భక్తి,జ్ఞాన, వైరాగ్యచింత మొదలగు వికారములన్నియు మనస్సుతో చేయబడు పుణ్యకర్మలు. విషయచింత పరులకు అపకారము చేయువలెనను చింత వేదశాస్త్రములు అప్రమాణములు, అనుచింత, ధర్మాదులు లేవనుచింత మొదలైన బుద్ధివికారములన్నియు మానసపాపకర్మలు. సవిశేషచింతను గాని నిర్విశేష చింతనుగాని చేయుచు మధ్యలో విషయచింతన గాని ఇతర పాపచింతనుగాని కలిపి చేయుట మనస్సు యొక్క పుణ్యపాప మిశ్రమకర్మ ఇచట చింత అనగా అలోచన.

వేద శాస్త్ర పఠనం, గీతా పఠనం, సహస్రనామ పఠనం, పంచాక్షర్యాది మంత్రజపః భగవన్నామ సంకీర్తనం, పరోపకారవార్తా సత్యవాక్యం, మృదుభాషణం చ వాచా క్రియమాణం పుణ్యకర్మ, వేద శాస్త్ర దూషణం, అసత్య, పిశున, పారుష్య వార్త , అపహాస్యవార్తా ఇత్యాది వచనం సర్వం వాచికం పాప కర్మ వేదాధ్యయనే పూజాకాలే ఏవమాది పుణ్యవార్తాసు చ

పరనిందాయా అసత్యస్య పరిహాసస్యచ లౌకికవార్తాయాః ఏవమాది పాపానాం మిశ్రీకృత్యఅనుష్ఠానం వాచికం మిశ్రకర్మ.

వేదశాస్త్ర పఠనము, గీతా పఠనము, సహస్ర నామ పఠనము, పంచాక్షరీ మున్నగు మంత్రములను జపించుట, భగవన్నామ కీర్తనము, పరోపకార ప్రసంగము సత్యవాక్యము, మృదుభాషణము, వాక్కుతో చేయబడు పుణ్యకర్మలు వేదశాస్త్ర దూషణము, అసత్యము చాడీలు చెప్పుట, కఠినముగా మాట్లాడుట, వ్యావహారిక ప్రసంగము, పరిహాస భాషణము మొదలగు వాగ్వ్యాపారమంతయు వాచిక పాపకర్మ. వేదాధ్యయన సమయమున, పూజాకాలమున, పుణ్య ప్రసంగముల యందు మధ్యన పరనింద చేయుట, అసత్యము పలుకుట పరిహాసము చేయుట, లౌకిక విషయములు మాట్లాడుట మొదలైన పాపపు మాటలను కలిపి మాట్లాడుట పుణ్యపాప మిశ్రతమైన, వాచిక మిశ్రమ కర్మ.

పుణ్య తీర్థ స్నానం, గురువేదాన్త నమస్కారః, దేవపూజా, ప్రదక్షిణం, సజ్జన దర్శనం, త్యాగః, లోకానుగ్రహసంచారః, ఏవమాది కాయేన క్రియమాణం సర్వంకర్మకాయికం పుణ్యకర్మ। పరహింసా, పరస్త్రీసంగః, చౌర్యం దుష్టసంగఃఇత్యేవం కాయేన క్రియమాణం సర్వం కర్మకాయికం పాపకర్మ। బ్రాహ్మణ భోజనార్థం బ్రాహ్మణోపద్రవః దేవాలయనిర్మాణార్థం పరద్రవ్యాపహారః ప్రపాం స్థాపయిత్వా భృతకస్యాప్రదానం ఏవమాది పుణ్యం పాపం మిశ్రీకృత్య కాయేన అనుష్ఠీయమానం కర్మ కాయికం మిశ్రకర్మ

పుణ్య తీర్థ స్నానము,గురువుల వేదాంతులకు నమస్కారము చేయుట, దేవపూజనము, ప్రదక్షిణము నజ్జనదర్శనము త్యాగము, లోకానుగ్రహసంచారము మొదలైన కర్మ శరీరముతో చేయుపుణ్యకర్మ. పరహింస, పరస్త్రీసంగము, దొంగతనము, దుష్టసహవాసము ఈ మొదలైనకర్మ శరీరముతో చేయు పాపకర్మ. బ్రాహ్మణ భోజనార్థము బ్రాహ్మణునికి కష్టము కలిగించుట, దేవాలయ నిర్మాణార్థము పరద్రవ్యమును అపహరించుట, చలివేంద్రను స్థాపించి సేవకులకు ఏమీ ఈయకుండుట ఈమొదలైన కర్మ పుణ్యపాపమిశ్రిత శారీరక కర్మ.

ఏతాని త్రివిధాన్యపి కర్మాణి సమ్యక్ విచార్యాణి। విచారస్య కిం

ఫలమితి చేత్ ముఖ్యఫలం అవాంతర ఫలం ఇతి ఫలద్వయమస్తి। కథమితి చేత్ ఇమాని త్రివిధకర్మాణి త్రివిధైరేవ కరణైః క్రియంతే। ఆత్మాత్వయమాకాశవత్ అసంగోనిరంశః పరిపూర్ణచైతన్య రూపః। అతో న కస్యాపి కర్మణః కర్తా। అత ఏవ "యచ్చాప్నోతి యదాదత్తే యచ్చాత్తి విషయానిహ। యచ్చాస్యసంతతో భావస్తేన చా త్మేతిగీయతే" ఇత్యుక్తః ఆత్మశబ్దస్యార్థః తస్మాత్ నైకమపి కర్మ చిదాకాశ స్వరూపం మాం స్పృశతీతి జ్ఞాత్వా సంశయం విహాయ దృఢానుభవేన అవస్థానం ముఖ్యఫలం। బ్రహ్మజ్ఞానే సత్యపి త్రివిధకరణమపి పుణ్యకర్మణ్యేవ స్థాపనీయం తదసంభవే మిశ్రకర్మణి వా స్థాపయితవ్యం। న కదాచిదపి పాపకర్మణీతి జ్ఞాత్వా తథైవ అవస్థానం అవాంతరఫలమ్। యథాకదళీపోషకస్య కదళీ ఫలం ముఖ్యఫలమ్, తత్పత్ర పుష్పాదికం అవాంతరఫలం। తథైవ త్రివిధకరణ కృత కర్మజ్ఞానస్యాపి పూర్వోక్త ఫలద్వయమితి జ్ఞేయం।

ఈ మూడు విధములైన కర్మలు బాగా ఆలోచించదగినవి. ఈ విచారణ వల్ల కల్గు ఫలము ఏమి? అన్నచో ముఖ్యఫలము. అవాంతర ఫలము అని రెండు విధములైన ఫలములు కలవు. ఎటులనగా ఈ మూడు విధములైన కర్మలు మూడు విధములైన కరణములతో (మనోవాక్కాయములతో) చేయబడుచున్నవి. ఆత్మయగు నేను ఆకాశమువలె అసంగుడను, నిరంశుడను, పరిపూర్ణచైతన్య స్వరూపుడను. ఆకారణముచే ఏకర్మకును నేను కర్తనుకాను. కనుకనే "యచ్చాప్నోతి యదాదత్తే......ఆత్మేతిగీయతే" ఏది అన్నిటిని పొందుచున్నదో ఏది స్వీకరించుచున్నదో ఏది విషయములను అనుభవించుచున్నదో ఏది ఏడతెగక ఎప్పుడు ఉనికి కల్గియున్నదో అంతటానిండి వ్యాపించియున్నట్టి దానికి ఆత్మయను పేరు సార్థకము అని ఆత్మ శబ్దమునకు అర్థము. అందుచే ఏకర్మకూడా చిదాకాశ స్వరూడనైన నన్ను స్పృశింపదు. అని తెలిసికొని సందేహము విడిచిపెట్టి దృఢమైన అనుభవముతో ఉండుటయే ముఖ్యఫలము. బ్రహ్మజ్ఞానము కలిగినతరువాత కూడా మూడు కరణములను పుణ్యకర్మయందే ప్రసరింపజేయవలెను. అది కుదరనిఎడల మిశ్రకర్మ యందైనను వర్తింపజేయవలెను. ఎప్పుడు పాపకర్మయందు ప్రవర్తింపనీయకుండవలెను

సాధన చేయుటయే అవాంతర ఫలము. అరటిచెట్టును పోషించువానికి అరటిపండు లభించుట ముఖ్యఫలము. పూవులు, మున్నగునవి లభించుట అవాంతర ఫలము. అటులే మూడు విధములైన కరణములచే చేయబడు కర్మను తెలిసికొనినందు వలన పైన చెప్పిన రెండు ఫలములు కల్గునని తెలియవలెను.

" నను అమ్భసా పద్మపత్రమివ కర్మణా జ్ఞానీ న లిప్యతే।తస్య న కోఽపి విధిః, న నిషేధో వా స తు అకర్తా, కర్మసాక్షీ, కృతకృత్య ఇతి సిద్ధాంతితత్వాత్ తస్య జ్ఞానినః అజ్ఞానిన ఇవ పుణ్యకర్మైవానుష్ఠేయమితి నియమః। కథమ్? ఇతిచేత్ - సత్యం, జ్ఞానీ కృతకృత్య ఏవ । కర్తాపినభవతి । న తత్రసందేహః। తథాపిబ్రహ్మవిత్‌బ్రహ్మవిద్వరః। బ్రహ్మవిద్వరీయాన్‌। బ్రహ్మవిద్వరిష్ఠః। ఇతి సచతుర్విధః తత్ర చతుర్థ ఏవ విదేహముక్తః। అసౌ వరిష్ఠ ఏవ వృత్తిశూన్యః। తస్యైవ న విధిః న నిషేధశ్చ । అన్యేషామపి త్రయాణాం జ్ఞాన మహిమ్నా విధి నిషేధ అభావే ఽపి వృత్తిశూన్యత్వాభావాత్ వ్యవహారసత్వాత్ సలోకానుగ్రహార్థం సదాచారే ఏవ స్థాతవ్యమితి ఉచ్యతే । నతు నియమ్యతే। తస్మాత్ తత్త్వజ్ఞానినా కర్మిణాం మధ్యే కర్మివత్ కర్మానుష్ఠేయం। జిజ్ఞాసూనాంమధ్యేతు కర్మత్యక్త్వా, బ్రహ్మైవ సత్యమన్యత్ సర్వ మనిత్యమితి జ్ఞానమేవోపదేష్టవ్యమ్।

నీటితో తామరాకు అంటకయున్నట్లు కర్మ చేత జ్ఞాని అంటుకొనడు కదా! జ్ఞానికి ఒక విధి ఒకనిషేధము లేదు కదా! అతడు కర్తకాదు. కర్మసాక్షి కృతకృత్యుడు అని సిద్ధాంతము చేయబడినది కదా! అట్టి జ్ఞానికి అజ్ఞానికి వలె పుణ్యకర్మను చేయవలెనను నేమము ఎట్లు పొసగును అనగా సత్యమేజ్ఞాని కృతకృత్యుడే. దేనికి కర్తకాదు. ఈ విషయములో సందేహము లేదు. అయినప్పటికి బ్రహ్మవిత్తు, బ్రహ్మ విద్వరుడు బ్రహ్మవిద్వరీయుడు, బ్రహ్మవిద్వరిష్ఠుడు అని జ్ఞాని నాల్గు విధములు. అందు నాల్గవ వాడే విదేహ ముక్తుడు. ఈ బ్రహ్మవిద్వరిష్ఠుడే వృత్తిశూన్యుడు.విధి నిషేధములు వీనికే ఉండవు. మిగిలిన ముగ్గురికి జ్ఞానమహిమ వల్ల విధి నిషేధములు లేకపోయినప్పటికి వృత్తి శూన్యత లేనందున వ్యవహారము కలవారగుటవలన లోకానుగ్రహార్థమై సదాచారమందే వారు

ప్రవర్తించవలెనని చెప్పబడినది. ఇది వారిని నియమించుటకాదు. ఆకారణముచే తత్త్వజ్ఞాని కర్మిష్ఠులమధ్య కర్మిష్ఠివలె కర్మను అనుష్ఠించవలెను. జిజ్ఞాసువుల మధ్య కర్మను విడిచి బ్రహ్మమే సత్యమనియు ఇతరమైనదంతయు అనిత్యమని జ్ఞానమును ఉపదేశించవలెను.

అత్ర ప్రకృతం కిమితి చేత్ త్రివిధకరణస్యైవ కర్తృత్వం న ఆత్మనః ఇతి నిశ్చితమ్।

ఇచట ఇంతవరకు ప్రస్తావించిన విషయమేమి? అనగా త్రివిధకరణములకే కర్తృత్వముగాని ఆత్మకు కర్తృత్వము లేదు అని నిశ్చయించబడినది.

అథత్రివిధమపి కరణం కిం స్వయమేవ కర్తృ, అన్యేనప్రేరితంవా। ఇతి విచార్యమాణే రాగద్వేషాదినా ప్రేరితమేవ కర్తృ । నస్వయం కర్తృ। రాగద్వేషాదౌ సతి కరణ త్రయం ప్రవర్తతే। అసతి న ప్రవర్తతే। ఇతి అన్వయ వ్యతిరేకాభ్యాం రాగద్వేషాదేః కరణ ప్రవర్తకత్వస్య అనుభవసిద్ధత్వాత్।

ఇక మూడు విధములైన కరణములు స్వయముగా చేయుచున్నవా? మరియొకరిచే ప్రేరితములై చేయుచున్నవా? అని విచారించినచో ఈ మూడు కరణములు రాగద్వేషాదులచే ప్రేరితములై చేయుచున్నవి. కాని స్వయముగా చేయుట లేదు. ఎట్లన రాగద్వేషాదులుఉన్నపుడే కరణత్రయము ప్రవర్తించుచున్నది లేని ఎడల ప్రవర్తించుట లేదు. అను అన్వయ వ్యతిరేకముల ద్వారా ( కార్యకారణ భావ నిర్ణాయక సాధనముల ద్వారా) రాగద్వేషాదులకు కరణత్రయమును ప్రేరేపించుట అను స్వభావముఉండుట అనుభవ సిద్ధము.

నను అహం దేవాలయం కారయామి, అహం తటాకం కారయామి ఇత్యాది వ్యవహారాత్ ఆత్మాకారయితాభవతీతి చేత్ న ఆత్మనో నిర్వికారత్వాత్ న తత్రాపి కారయితృత్వం ఉపపద్యతే। ఆత్మని కారయితృత్వం భాతీతి చేత్ జపాకుసుమనిష్ఠ లౌహిత్యం స్ఫటిక ఇవ రాగద్వేషాది నిష్ఠకారయితృత్వం ఆత్మని భ్రాంత్యా ఆరోప్యతే ఇతి జ్ఞేయమ్। స్వాభావికం చేత్ నకో ఽపి యత్నం కుర్యాత్। స్వభావస్య స్వరూపత్వాత్। కథంచిత్ తస్యనాశేస్వరూపస్యఏవ నాశః స్యాత్। ఆత్మ జ్ఞానినోఽపి కారయితృత్వం

యది స్యాత్, "ఆత్మా అనంగో, నిష్క్రియ ఇతి ప్రతిపాదికా", అదృశ్యమవ్యవహార్యం అగ్రాహ్యం, అలక్ష్యం, అచింత్యం, అవ్యపదేశ్యం ప్రపంచోపశమం శాంతం శివ మద్వైతం చతుర్థం మన్యంతే స ఆత్మా! సవిజ్ఞేయః " ఇతి శ్రుతిః, భజ్యేత। కారయితృత్వస్య జన్యత్వే తత్ప్రయుక్తముక్తేరపి జన్యత్వం స్యాత్। సుషుప్తావపి కారయితృత్వం దృశ్యేత। తస్మాత్ ఆత్మనః కారయితృత్వం నస్వాభావికమ్। కిన్త్వాగంతుకమేవ

నేను దేవాలయము కట్టించుచున్నాను. నేను చెఱువు త్రవ్వించ చేయుచున్నాను అనువ్యవహారము ఉండుటవలన ఆత్మప్రేరకత్వము కావచ్చుగదా అని అనినచో అట్లుకాదు. ఆత్మనిర్వికారుడగుటవల్ల ఆత్మయందు ప్రేరకత్వము కుదురదు. ఆత్మయందు ప్రేరకత్వము ఉన్నట్లనిపించుచున్నది కదా అని అనినచో మందార పుష్పము యొక్క ఎఱ్ఱదనము స్ఫటికమందు భాసించుచున్నట్లు రాగద్వేషాదికమందున్న ప్రేరకత్వము ఆత్మయందు భ్రాంతిచేత ఆరోపింపబడుచున్నదని తెలియవలెను. ఆ ప్రేరకత్వమాత్మకు స్వాభావికమైనచో ఎవడును దానిని పోగొట్టుకొనుటకు ప్రయత్నము చేయకుండ ఉండవలసివచ్చును స్వభావమనగా స్వరూపమే. కనుక స్వభావము నశించినచో స్వరూపము కూడా నశింపవలసి వచ్చును.

ఆత్మజ్ఞానికి ప్రేరకత్వమున్నదనినచో ఆత్మ అసంగుడు, నిష్క్రియుడు అని ప్రతిపాదించు "అదృశ్యం..............సవిజ్ఞేయః" అను శ్రుతికి భంగము వచ్చును. ప్రేరకత్వము పుట్టినది కనుక దాని వలన కల్గుముక్తియు పుట్టియుండవలసివచ్చును. సుషుప్తియందు కూడా ఆత్మకు ప్రేరకత్వము (స్వాభావికమగుటవలన) కనబడవలసియుండును. అందువలన ప్రేరకత్వము ఆత్మకు స్వాభావికము కాదు. ఆగంతుకమే అని తెలియవలెను.

ననుసుషుప్తౌ కారయితృత్వాదర్శనమాత్రేణ ఆత్మనః కారయితృత్వం నాస్తీతి వక్తుం నశక్యతే। యథా ఉపాధ్యాయస్య అధ్యాపకత్వం విద్యమానమపి శిష్యవర్గాసన్నిధానే నదృశ్యతే, తద్వత్ సుషుప్తౌ కరణ సంయోగాభావాత్ విద్యమానమపి కారయితృత్వం నదృశ్యతే। జాగ్రత్

స్వప్నయోః కరణసంయోగే సతి వక్తుం శక్యత్వాత్ ఇతి చేత్। తర్హి జాగ్రతి ఉదాసీన తూష్ణీంభావా వస్థయోః కరణసంయోగస్య విద్యమానత్వాత్ కారయితృత్వం దృశ్యేత। తత్ న దృశ్యతే । తస్మాత్ ఆగంతుకం ఏవ ఇతి వక్తవ్యమ్।

సుషుప్తియందు కారయితృత్వము కనబడనంత మాత్రము చేత ఆత్మకు కారయితృత్వము లేదని చెప్పుటకుదురదు. ఉపాధ్యాయునికి అధ్యాపకత్వము ఉన్నప్పటికి శిష్యవర్గము దగ్గర లేనపుడు కనపడదు కదా! అటులే సుషుప్తియందు కరణముల సంబంధము లేకపోవుటవలన ఆత్మకుఉన్న కారయితృత్వమే కనబడుటలేదు. జాగ్రత్ స్వప్నాదుల యందు కరణసంయోగముఉన్నందున కారయితృత్వము ఉన్నట్లు చెప్పవచ్చుగదా! అనినచో జాగ్రదవస్థలోనే ఉదాసీన స్థితియందు కాని ఊరక ఉండునపుడు కాని కరణసంయోగము ఉన్నందున కారయితృత్వము కనిపించవలసివచ్చును. కాని కనిపించుట లేదు. కావున ఆత్మకు కారయితృత్వము ఆగంతుకమనియే చెప్పవలెను.

అన్యోన్య అధ్యాసాత్ అయోనిష్ఠ దీర్ఘత్వహ్రస్వత్వాదయః అగ్నౌ,అగ్ని నిష్ఠ ఉష్ణప్రకాశాదయః అయసి చ భాన్తి। తద్వదేవ రాగద్వేషాది నిష్ఠకారయితృత్వం ఆత్మని ఆత్మనిష్ఠఅకారయితృత్వం రాగద్వేషాదౌ భాతి।

అన్యోన్య అధ్యాస వలన ఇనుప కడ్డీ యొక్క పొడుగుదనము, పొట్టిదనము మున్నగునవి అగ్ని యందును, అగ్నియొక్క వేడి ప్రకాశకత్వము మున్నగునవి ఇనుపకడ్డీ యందును భాసించును. అట్లే రాగద్వేషాది నిష్ఠమైన కారయితృత్వముఆత్మయందును ఆత్మనిష్ఠమైన అకారయితృత్వము. రాగద్వేషాదులయందును ప్రకాశించుచున్నది.

నను అచేతనస్య రాగద్వేషాదేః కథం కారయితృత్వం? నహి ఘటో ఘటాంతరం ప్రేరయతి ఇతిచేత్।సత్యం । తథాపికుత్రచిత్ యోగ్యతావశాత్ జడః ప్రేరయతి యోగ్యతాభావాత్ కుత్రచిత్ న ప్రేరయతి। యథా జడః అపి అగ్నిః గంధకాది సంయుక్త ఇంగాల చూర్ణ విశేషైఃసహితః సన్ జడమేవ బృహత్ నలికాంతః స్థితస్థూల పాషాణం ప్రేరయిత్వా తేన చతురంగసేనాం హన్తి। కించ ప్రేతశరీరం జడమపి స్వజ్ఞాతి క్రియమాణ అపరక్రియాం ప్రతి

స్వయం కారయితృభవతి। ఏవం అచేతనమపి రాగ ద్వేషాది కారయితృభవతి।

అచేతనములైన రాగద్వేషాదులకు కారయితృత్వము (ప్రేరణ) ఎట్లు కుదురును. ఒక కుండ మరియొకకుండను ప్రేరణ చేయదు కదా (కదపలేదుకదా) అన్నచో నిజమే అయినప్పటికి యోగ్యత్వము ఉన్నచో ఒక చోట జడమే ప్రేరణ చేయును. యోగ్యత్వము లేని ఎడల అది ప్రేరణ చేయదు. ఉదాహరణకు అగ్ని జడమైనదైనను గంధకాదులతో కూడిన బొగ్గు పొడితో కూడి పెద్ద గొట్టమునందున్న లావు రాతిని ప్రేరణ చేసి దానివల్ల చతురంగసేనను చంపుచున్నది. ఇట్లే ప్రేతశరీరము జడమైప్పటికి తమ జ్ఞాతుల అపరక్రియను గూర్చి స్వయముగా కారయితయగుచున్నది. ఈ విధముగా అచేతనము లైనప్పటికి రాగద్వేషాదులకు కారయితృత్వము కలదు.

తర్హి " ఆత్మాహృషీకేశః సర్వాంతర్యామీ" ఇతి వదంత్యాః శ్రుతేః కిం తాత్పర్యమితిచేత్। ఆదిత్యవత్ సన్నిధాన మాత్రేణ సర్వజన పుణ్యా పాప అనుకూలఃస్యాత్। తత్పుణ్యం పాపం తత్ఫలంచ యథా నస్యాత్ తథా ఆత్మనో ఽపి మంతవ్యం।అయఃచేష్టా సన్నిధానమాత్రేణ స్వానుకూల కాంతశిలాం యథానస్పృశ్యతి తథా పాపకర్మాపి ఆత్మానమితి జ్ఞేయం। తస్మాత్ ఆత్మనో నిరంజనత్వ నిర్వికారత్వ భంగః నాస్తి।

అట్లయితే ఆత్మ హృషీకములకు (ఇంద్రియములకు) నియామకుడు సర్వాంతర్యామి అని చెప్పుచున్న శ్రుతికి తాత్పర్యమేమి అనినచో సూర్యుని వలె ఆత్మ సన్నిధాన మాత్రము చేత సమస్త జనుల పుణ్యపాపములకు అనుకూలము అగును. పుణ్యము,పాపము , వాని ఫలము కాని సూర్య భగవానునికి ఎట్లుండదో ఆత్మకు కూడా అట్లే ఉండదని భావించవలెను. దగ్గఱ ఉన్నంత మాత్రమున ఇనుము క్రియతో తనకు అనుకూలము అయిన సూదంటురాయిని ఎట్లు స్పృశించుట లేదో అట్లే ప్రాణికర్మ ఆత్మను స్పృశించదని తెలియదగును. కావున ఆత్మ నిరంజనత్వ నిర్వికారత్వలక్షణములకు భంగము జరుగదు. ఆత్మనిరంజనమే నిర్వికారమే.

ఏవం ఆత్మస్వరూపే ప్రసిద్ధగురుణా ఉపదిశ్యమానే ఽ పి,

ప్రతిబంధత్రయేణ నిశ్చయో న భవతి! ప్రతిబంధత్రయంచ 1. సంశయభావనా 2. అసంభావనా 3. విపరీత భావనా చేతి.

ఈ విధముగా ఆత్మస్వరూపము ప్రసిద్ధ గురువుచేత ఉపదేశించబడినప్పటికిని ప్రతిబంధకత్రయముచేత నిశ్చయము కల్గుటలేదు. ప్రతిబంధత్రయము అనగా 1.సంశయభావన 2. అసంభావన 3. విపరీతభావన.

ఋగాది శాఖాసూపదిశ్యమానం ఉపనయనాది కర్మఅనేకవిధం, యథా, తథా ఋగాదిశాఖసూపదిశ్యమానం ఆత్మతత్త్వం అనేక ప్రకారం వానవేతి సంశయః సంశయభావనా । సా సకల వేదాంత తాత్పర్య అవధారణరూప శ్రవణేన నశ్యతి। ఏవం సర్వేషాం వేదాన్తానాం అద్వైతే బ్రహ్మణ్యేవ తాత్పర్యమితి శ్రవణేన ప్రమావిషయే అసంశయేన ఇదమద్వైతం సంభావ్యతే । సత్యత్వేన ప్రతీయమానేషు జీవేశ్వరజగత్సు పరస్పర అభిన్నేషు సత్సు భిన్నత్వబుద్ధిః అసంభావనా । ఇయం స్వప్నదృష్టాంతాది రూపయుక్త్యాత్మక మననేన నశ్యతి। ఏవం శ్రవణే మననే కృతే అపి అనాది అవిద్యా వాసనయా సర్వస్యాపి జగతో యథాపూర్వం సత్యత్వప్రతీతిః విపరీత భావనా। సాబ్రహ్మైకాకార ప్రత్యయ ప్రవాహ రూప నిదిధ్యాసేన నశ్యతి।ఏతత్ ప్రతిబంధ త్రయస్య నాశకారణమ్।

ఋగ్వేదాదిశాఖల యందు ఉపదేశించబడిన ఉపనయనాది కర్మఆయావేదశాఖల వారికి అనేక విధములుగా నిర్ణయించబడినట్లు ఆత్మతత్త్వము కూడా ఋగ్వేదాది శాఖలను బట్టి అనేక ప్రకారములా? ఒకటేనా? అని సందేహము సంశయభావన ఇది సకలవేదాన్తముల తాత్పర్యమును అవగాహన చేసికొనుటయనెడి శ్రవణముచేత ఈ సంశయభావన నశించును. ఇట్లే అన్ని వేదాంతములకు అద్వైతబ్రహ్మమందే తాత్పర్యము అని శ్రవణము చేయుట చేత ఆత్మజ్ఞాన విషయమున సందేహము లేకుండా ఈ అద్వైతము (ఒక్కటే అనుభావన) ఊహకు వచ్చును కాని అనుభవమునకు రాదు. కావున సత్యముగా కనిసించుచుండు జీవేశ్వరజగత్తులు పరస్పరము ఒకటి అయి, భిన్నములు కానప్పటికి భిన్నములని అనుకొనుటయే అసంభావన. స్వప్న దృష్టాంతాది రూప యుక్తి

అనెడు మననము చేత ఈ అసంభావన నశించును. ఈ విధముగా శ్రవణము, మననముచేసినప్పటికి అనాది అవిద్యావాసనల చేత సర్వులకు జగత్తుయథాపూర్వముగాసత్యమని అనిపించుటయేవిపరీతభావన. ఈవిపరీతభావనబ్రహ్మైకాకార (బ్రహ్మమొకటే అను) జ్ఞాన ప్రవాహమనెడు నిదిధ్యాసముతో నశించును. ఈ విధముగా ప్రతిబంధత్రయమునకు నిదిధ్యాసముతో నశించును.ఈ విధముగా ప్రతిబంధత్రయమునకు శ్రవణ,మనన నిదిధ్యాసలుఅనునవి మూడు నాశకారణములు.

యథా సర్వస్యదాహకో ఽ పి అగ్నిః మణి మంత్రాది ప్రతిబంధకైః ఏకం తృణమపి దగ్ధుం నశక్నోతి, ఏవం జ్ఞానాగ్నిరపి ప్రతిబంధైః ప్రతిబద్ధః సన్ అజ్ఞాన తత్ కార్యేషు కించిదపి దగ్ధుం న శక్నోతి। పూర్వోక్త ప్రకారేణ అస్మిన్ ప్రతిబంధత్రయే అపనీతేసతి సద్య ఏవ, అగ్నిః తృణమివ, జ్ఞానాగ్నిః అవిద్యా తత్ కార్యం సర్వమపి దగ్ధుం శక్నోతి।

అన్నింటిని తగుల పెట్టునట్టి అగ్ని మణి మంత్రాది ప్రతిబంధకముల చేత ఒక గడ్డి పరకను కూడా తగులబెట్టుటకు శక్తిమంతము కాదు. అట్లే జ్ఞానాగ్ని కూడా ప్రతిబంధత్రయముచే ప్రతిబంధింపబడినదై అజ్ఞానము దాని కార్యములలో ఏ ఒకదానిని కూడా దహింపజేయుటకు శక్తిమంతము కాదు. పూర్వోక్తప్రకారముగా ఈ ప్రతిబంధత్రయము తొలగింపజేయబడగా అగ్ని గడ్డిని కాల్చునట్లు జ్ఞానాగ్ని అవిద్య దాని కార్యమునంతటిని దహించుటకు శక్తి కలదగును.

కించ "ఉపక్రమోపసంహారావభ్యాసోపూర్వతాఫలమ్। అర్థవాదోపపత్తీచలింగం తాత్పర్య నిర్ణయే" ఇతి వచనేనషడ్విధలింగేన తాత్పర్యనిర్ణయః కర్తవ్యః।

ఇంతేకాదు 1.ఉపక్రమోపసంహారములు 2.అభ్యాసము, 3.అపూర్వత, 4.ఫలము, 5.అర్థవాదము, 6.ఉపపత్తి అను ఈఆరు తాత్పర్యలింగములచే వేదాన్తగ్రంథము యొక్క తాత్పర్యనిర్ణయమును చేయవలెను.

అత్ర ఛాందోగ్య షష్ఠా ఽ ధ్యాయే" సదేవ సౌమ్య ఇదమగ్ర ఆసీత్''ఏకమేవాద్వితీయమ్' ఇతి ఉపక్రమ్య " ఐతదాత్మ్యమిదగం సర్వంతత్సత్యం''ఇతి అఖండకైరసే ఏవోపసంహృతః ఇతి

ఉపక్రమోపసంహారైక్యరూపం ప్రథమం లింగమ్ ‘ తత్త్వమసి ’ ఇతి నవకృత్వః తస్యైవ అభ్యాసో ద్వితీయమ్। అఖండైకరసస్య ప్రత్యక్షాది ప్రమాణాంతరఅవిషయత్వం అపూర్వతా తృతీయమ్। “ తస్య తావదేవ చిరం యావత్ న విమోక్ష్యే అథ సంపత్స్యే” ఇతి అఖండైకరసస్య జ్ఞానస్య ప్రారబ్ధ భోగానంతరం విదేహ కైవల్య రూప ఫల వచనం చతుర్థమ్। “ యథా సౌమ్య ఏకేన మృత్పిండేన” ఇత్యాదినా దృష్టాంతకథనం ఉపపత్త్యాఖ్యం షష్ఠమ్।అర్థవాదస్తు పంచమమ్।

ఈ బ్రహ్మవిషయమున ఉపనిషత్తునందలి ఛాందోగ్య షష్ఠా-ధ్యాయమందు“సదేవసౌమ్య ఇదమగ్ర ఆసీత్” “ఏకమేవాద్వితీయమ్” అని ప్రారంభించి “ ఐతదాత్మ్యమిదగ్ం సర్వం తత్ సత్యం అని అఖండైక రసస్వరూపమగు బ్రహ్మమందే తాత్పర్యము ఉపసంహరింపబడినది. ఇదియే ఉపక్రమోపసంహారములు అను మొదటి లింగము. తత్త్వమసి అని తొమ్మిదిమార్లు బ్రహ్మమునుగూర్చియే పలుకుట అభ్యాసముఅనెడి రెండవలింగము. అఖండైకరస స్వరూపమగు బ్రహ్మము ప్రత్యక్షాది ప్రమాణాంతరములచే తెలియబడకుండుటయే అపూర్వత యనెడు మూడవలింగము. “తస్య..................సంపత్స్యే అని అఖండైక రసమగు బ్రహ్మజ్ఞానము కలుగుటకు ప్రారబ్ధ భోగానంతరము విదేహకైవల్యమను ఫలము చెప్పుట నాల్గవ లింగము. ‘యథాసౌమ్య................అను వాక్యము ద్వారా మృత్పిండ దృష్టాంతమును చెప్పుట ‘ఉపపత్తి’ అనెడిది ఆరవలింగము. అర్థవాదమే ఐదవ లింగము.

సృష్టి,స్థితి, ప్రలయ, ప్రవేశ, సంయమన తత్త్వం పదార్థ పరిశోధన ఫల ప్రతిపాదకా ఇతి సప్తార్థవాదాః।తత్ర“ తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశః సంభూతః” ఇత్యాద్యాః అర్థవాదరూపాః।శ్రుతయః ఆకాశాదేఃసర్వస్య బ్రహ్మణఏవోత్పత్తేః తస్మిన్ ఏవ అవస్థానాత్, పునస్తత్రైవ లయాత్ మృదుత్పత్తి స్థితి లయాత్మకస్యఘటాదేః మృదభేదవత్ కారణ బ్రహ్మమాత్రతాం ఉపగమయన్త్యః సృష్టి స్థితి ప్రలయ।శ్రుతయః మహావాక్యోక్తం బ్రహ్మాద్వితీయత్వం సంభావయామాసుః। యథా “ఏతమేవ సీమానం విదార్య ఏతయా ప్రాపద్యత” ‘తత్ సృష్ట్వా తదేవానుప్రావిశత్’। “అనేన జీవేనాత్మనా

-ను ప్రవిశ్య నామ రూపే వ్యాకరవాణి'' ఇత్యాద్యాః ప్రవేశశ్రుతయో బ్రహ్మణ ఏవ జీవరూపేణ ప్రవేశం బ్రువంత్యోబహిఃస్థిత్వా అంతర్గృహ ప్రవిష్ట దేవదత్తవత్ జీవబ్రహ్మణోఃఅభేదం మహావాక్యార్థం సంభావయామాసుఃతథా " యః పృథివ్యాం తిష్ఠన్ పృథివ్యా అన్తరో యం పృథివీ న వేద। యస్య పృథివీ శరీరం। యఃపృథివీ మన్తరోయమయత్యేకః ఆత్మాన్తర్యామ్యమృతః '' ఇత్యాది నియమనశ్రుతయశ్చ అత్యన్త భేదే నియామ్యనియామక భావ అనుపపత్తేః తయోఃఅభేదమేవ సంభావయన్తి। తథా "సవాఏషపురుషోఽ న్నరసమయః" "యదగ్నేఃలోహితం రూపం'' ఇత్యాద్యాః తత్త్వం పదార్థ పరిశోధన రూపాః శ్రుతయో జీవేశ్వర ఉభయగత విరుద్ధ ధర్మ నిరసన ద్వారా తయోః ఐక్యమేవ సంభావయన్తి। తథా "బ్రహ్మవిదాప్నోతిపరం" " అమృతః సమభవత్ '' ఇత్యాద్యాశ్చ అభేదజ్ఞానస్య నిరతిశయఫల ప్రదర్శనేనఅభేదస్య వివక్షితత్వం జ్ఞాపయంత్యః తమేవ సంభావయన్తి ఇత్థం,సృష్టి స్థితి,లయ ప్రవేశ సంయమన,తత్త్వం,పదార్థ పరిశోధన, ఫలప్రతి పాదకైఃసప్తవిధాఽర్థవాదైఃఅనుగృహీతం జీవ బ్రహ్మైక్యరూపమఖండైక రస తత్త్వమేవ అవాంతరవాక్యైఃనహితంనత్ ప్రతి పాద్యతే । అతః అఖండైకరసత్వేనైవ మహావాక్యార్థో వక్తవ్యః। ఇతి అఖండైకరసత్వేనైవ మహావాక్యార్థో వక్తవ్యః। ఇతి షడ్విధ లింగైఃశ్రుతి తాత్పర్య అవధారణమ్। శ్రవణమిత్యుక్తమ్। ఇదానీం కిం ప్రకృతమితిచేత్ మయోక్త ప్రకారేణ విచార్య రాగద్వేషాదినాప్రేరితం సత్ త్రివిధకరణం త్రివిధకర్మకరోతీతిప్రేరిత సేనయయానంపాదితంజయంయథారాజాఅవాంవిజితవాని త్యాత్మన్యారోపయతి , ఏవమాత్మని చ రాగద్వేషాదినిష్ఠ ప్రేరకత్వం అజ్ఞానాత్ అభిమన్యతే । ఆత్మనః అస్వభావత్వాత్ కర్తృత్వం కారయితృత్వం చ నాస్తి ఇతి యో దృఢం నిశ్చినోతి స ఏవ జీవన్ముక్తః

ఇతిమననే పంచమవర్ణకం సమాప్తమ్

అర్థవాదములు ఏడు సృష్టి,స్థితి,ప్రళయ,ప్రవేశ.సంయమన,తత్త్వం పదార్థపరిశోధన,ఫలప్రతిపాదకములనునవి. అందు ''తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశః సంభూతః''మొదలైన అర్థవాద శ్రుతులు ఆకాశాదులన్నియు బ్రహ్మమునందే పుట్టును ఉండును.లయించును.కనుక

మృత్తుయందే పుట్టిఉండి, లయించు ఘటాదులు మృత్తుకంటే వేరు కాదుఅనునట్లుకారణమాత్రమందేకార్యరూపజగత్తు ఉపసంహరింపబడునని చెప్పు సృష్టి స్థితి ప్రళయశ్రుతులు మహావాక్యమునందు చెప్పబడిన బ్రహ్మమునకు అద్వితీయత్వమును భావింప జేసినవి. బయట ఉన్నదేవదత్తుడు గృహములోనికి ప్రవేశించినట్లు బ్రహ్మమే జీవరూపములో ప్రవేశించినట్లు యథా ఏత మేవ ....." " తత్ సృష్ట్వా..... ఇత్యాది ప్రవేశ శ్రుతులు జీవబ్రహ్మాభేదమును సూచించినవి. అట్లే "యః పృథివ్యాం తిష్ఠన్ ....." మున్నగు నియమనశ్రుతులు అత్యంత భేదమున్నచో నియమము కుదరదు కనుక జీవేశ్వరులకభేదమును నిర్ణయించుచున్నవి. అట్లే స ఏష పురుషో ..........మున్నగు తత్త్వం పదార్థ పరిశోధక శ్రుతులును విరుద్ధ ధర్మములను నిరసించి జీవేశ్వరుల ఐక్యమును బోధించుచున్నవి. భూమియందలి మట్టిబొమ్మలకు భూమికి అభేదమే ఉండును కాని భేదము లేదనునట్లు ఆత్మయందున్న జగత్తుకు ఆత్మాభేదమే అని అభేదజ్ఞానమునకు నిరతిశయ ఫల ప్రదర్శన ద్వారా అభేదమే చెప్పదలచినదని విశదీకరించి బ్రహ్మమును సూచించుచున్నవి. ఈ విధముగ సప్తవిధ అర్థవాదముల చేత జీవ బ్రహ్మైక్యరూప అఖండైకరసతత్త్వమే అవాంతరవాక్యములతో కూడి ప్రతిపాదింపబడుచున్నది. ఈ విధముగా షడ్విధ తాత్పర్యము ఆరులింగములతోశ్రుతి తాత్పర్యావధారణము చేయుటయే శ్రవణమని చెప్పబడినది. ఇక ప్రస్తుత విషయమేమనగా నేను చెప్పిన విధముగా విచారణ చేసి రాగద్వేషాదులచే ప్రేరేపింపబడిన త్రివిధకరణమే త్రివిధకర్మలను చేయును. ప్రేరేపింపబడిన సేన చేత సంపాదింపబడిన జయముతాను జయించితినని రాజుదానిని తనయందు ఆరోపించుకొన్నట్లు రాగద్వేషాదులయందలి ప్రేరకత్వమును అజ్ఞానము చేత తనయందు ఆరోపించుకొనును. కావున ఆత్మకు స్వభావము కానందున కర్తృత్వము గాని కారయితృత్వముగాని లేవని దృఢముగా ఎవడు నిశ్చయించుకొనునో అతడే జీవన్ముక్తుడగునని తెలియవలెను.ఇట్లు మననమందు పంచమ వర్ణకము సమాప్తము.

అథషష్ఠ వర్ణకమ్

పూర్వం ప్రతిజ్ఞాతదుఃఖాదిసప్తకే దుఃఖం, శరీరం, కర్మ,రాగద్వేషాది చ ఉత్తరోత్తరహేతుత్వేన ఉక్తాని ఇదానీం షష్ఠవర్ణకే రాగ ద్వేషాది వృత్తి భేదాః అభిమానః, అవివేకః, అజ్ఞానం చ కథ్యంతే.

అరవ వర్ణకము

పూర్వము చెప్పబడిన దుఃఖాది సప్తపదార్థములలో దుఃఖము, శరీరము, కర్మ, రాగ ద్వేషాదికము ముందు ముందు వానికి తరువాత తరువాతివి కారణముగా చెప్పబడినవి. ఇప్పుడు ఆరవవర్ణకమున రాగద్వేషాది వృత్తిభేదములు అభిమానము, అవివేకము, అజ్ఞానము పూర్వమువలె కారణములని చెప్పబడుచున్నవి.

రాగో, ద్వేషః,కామః, క్రోధో, లోభో, మోహో,మదో,మాత్సర్యం, ఈర్ష్యా, అసూయా, దంభో,దర్పః, అహంకారః, ఇచ్ఛా,భక్తిః,శ్రద్ధా,ఇతి,రాగ ద్వేషాదివృత్తయఃషోడశ.

1.రాగము,2.ద్వేషము,3.కామము, 4.క్రోధము,5.లోభము, 6.మోహము,7.మదము, 8.మాత్సర్యము, 9.ఈర్ష్య, 10.అసూయ, 11.దంభము, 12.దర్పము,13.అహంకారము, 14.ఇచ్ఛ,15భక్తి,16.శ్రద్ధ అని రాగద్వేషాది వృత్తులు పదహారు.

1.స్త్రీవిషయకచిత్తవృత్తిఃరాగః। 2.అపకార కర్తుః ప్రత్యప కారేచ్ఛాద్వేషః । 3.గృహక్షేత్రాదిసంపాదనేచ్ఛా కామః। 4.తస్య విఘ్నకర్తరి వైరస్యం క్రోధః। 5)స్వసంపాదితేషు కించిదపి సత్పాత్రే నదేయమిది బుద్ధిః లోభః । 6.ఐశ్వర్యమస్తీతి మదేన కృత్యాకృత్యే అవిచార్య తూష్ణీం అవస్థానం మోహః । 7)స్వస్యసంపదస్తికింవా కింవా కర్తుమశక్యం ఇతి బుద్ధిః మదః । 8.స్వసమాన సంపన్న జనదర్శన అసహనం మాత్సర్యం । 9.ఇదం దుఃఖం తం విహాయ మమ కిమితి ఆగతమితి చిత్త వృత్తిః ఈర్ష్యా । 10.ఇదం దుఃఖం తం విహాయ మమేవ తస్యాపి నకిమిత్యాగతమ్ ఇతి బుద్ధిః అసూయా। 11.అనేన ధర్మేణ మమ ప్రసిద్ధిః భూయాత్ ఇతి చిత్తవృత్తిఃదంభః-12.అవర్జనీయ ప్రాశన మోచనాది కర్మచికీర్షా ఇచ్ఛా। 13.మమకోఽపినసమాన ఇతిబుద్ధిఃదర్పః 14.సర్వత్ర అగ్రహఃఅహంకారః 15.గురౌ సజ్జనేషు దేవతాసు చ అతిప్రీతిః

భక్తిః 16.యాగాది కర్మసు వేదాంతవాక్యే గురూపదేశే చ విశ్వాసః శ్రద్ధా ఇతి షోడశవిధం రాగ ద్వేషాది.

1.స్త్రీ విషయకమైన చిత్తవృత్తి రాగము. 2. అపకారము చేసిన వారికి ప్రత్యపకారము చేసి తీరవలెనను ఇచ్ఛయే ద్వేషము. 3.గృహక్షేత్రాదులను సంపాదించవలెనను ఇచ్ఛ కామము. 4.దానికి విఘ్నము చేయువాని యందు విరసభావమే క్రోధము. 5.తాను సంపాదించినవానిలో దేనిని కూడా సత్పాత్రునికి దానము ఈయకూడదను బుద్ధియే లోభము. 6.ఐశ్వర్యమున్నదన్న మదముచే కృత్యాకృత్యములను ఆలోచించకుండా ఉదాసీనముగా ఉండుట. మోహము. 7.తనకు సంపద కలదు. ఏమేమి చేయరాదు. అని అనుకొనుట మదము. 8.తనతో సమానులగు సంపన్నజనులు కనిపించినచో చూచి సహించలేకపోవుట మాత్సర్యము. 9.ఈ దుఃఖము అతనిని విడిచి నాకు ఎందుకు రావలెను అనెడి బుద్ధి ఈర్ష్య 10.ఈ దుఃఖము అతనిని విడిచి నాకే ఎందులకు వచ్చినది వానికి కూడా ఎందులకు రాలేదను కొనెడి బుద్ధిఅసూయ 11.ఈ పుణ్యము చేత నాకు గొప్పప్రసిద్ధి కలుగవలెను అను చిత్తవృత్తియే దంభము. 12.నాతో సమానుడెవడును లేడు అను బుద్ధియే దర్పము.13.అందరి పట్ల ఆగ్రహముతో (అధికారముతో పట్టుదలతో)ఉండుట అహంకారము. 14.తినకూడని (నిషేధించిన ) వానిని భక్షించుట విడువవలసిన వానిని త్యజించుట మొదలగు పనులను చేయవలెనని కోరుటయే ఇచ్ఛ. 15. గురువు లందు సజ్జనులయందు దేవతలయందును అతి ప్రేమ కలిగి యుండుట భక్తి. 16.యాగాది పుణ్య కర్మలయందును వేదాంత వాక్యములయందును శాస్త్రముల యందును గురూపదేశము నందును నమ్మకము కల్గియుండుట శ్రద్ధ. ఇవి రాగద్వేషాది షోడశ వృత్తులు.

ఆత్మవిచారప్రకరణే చిత్తవృత్తివిచారస్య కిం ప్రయోజనం ఇతిచేత్ శృణు।సకల జీవానాం బంధ మోక్షౌ మనసైవ న అన్యేన। కథమితి చేత్ స్వభావ నిర్మలస్య మనసః అశుద్ధేన యోగః బంధః శుద్ధ రూపేణ అవస్థానం మోక్షః। రాగాది చతుర్దశ వృత్తయః అశుద్ధాః భక్తి శ్రద్ధే ద్వేతు శుద్ధే। రాగాది త్రయోదశ వృత్తయః సర్వేషాం ప్రయత్నం వినైవ పునః పునః ఆగచ్ఛంతి।

పాపేషు ఏవ మనుష్యాన్ ప్రవర్తయంతి తద్వృత్తి శీలానాం అధోగతిరేవ న ఊర్ధ్వగతిః। రాగాది వృత్తీః నిరుధ్య భక్తిశ్రద్ధాభ్యాం ఏవ కర్మకుర్వతః క్రమేణ సంసారనివృత్తిః భవిష్యతి। తస్మాత్ పురుషః స్వ చిత్తం సమ్యక్ శోధయిత్వా అశుద్ధిహేతురాగాదివృత్తీర్వర్జయిత్వాభక్తిశ్రద్ధయోరేవ చిత్తం స్థాపయేత్. ఇచ్ఛయా క్రియమాణక్షుత్పిపాసాదివృత్తీః మూత్ర పురీష విసర్జనాది కర్మ చ త్యక్తుమశక్యం, తత్ త్యాగే తు దుఃఖ మేవ। తేన కర్మణా స్వర్గో ఽపి నాస్తి। తస్మాత్ ఐచ్ఛికం అవశ్యకం ప్రాశన మోచనాదికం కర్మ కర్తవ్యమేవ. ఏవం జాగ్రత్ స్వప్నయోః రాగాదౌ సతి కర్మఅస్తి। 1.సుషుప్తి 2.మూర్ఛా 3.సమాధి 4.తూష్ణీంభూతార్చావస్థాసు రాగాదికం నాస్తి। కర్మాపి నాస్తి ఇతి అన్వయ వ్యతి రేకాభ్యాం రాగాదేః కర్మహేతుత్వం సిద్ధమ్।

ఆత్మవిచార ప్రకరణమునందు చిత్తవృత్తులవిచారణకు ప్రయోజనమేమి అనినచో వినుము. సకల జీవులకు బంధ మోక్షములు మనస్సు చేతనే ఏర్పడినవి. ఏ ఇతరసాధనములచేతను కాదు. అదెట్లనగా సహజముగా నిర్మలమైన మనస్సునకు అశుద్ధవృత్తితో సంబంధమే బంధము. శుద్ధముగా ఉండుటయే మోక్షము. మొదటి రాగాదులు పదునాలుగు వృత్తులును అశుద్ధములే. భక్తిశ్రద్ధలు రెండే శుద్ధవృత్తులు. రాగాదులు మరల మరల కలుగుచుండును. అవి మనుష్యలను పాపములయందే ప్రవర్తింపజేయును. ఈరాగాదులు కలవారికి అధోగతియే కాని ఊర్ధ్వగతి ఉండదు. రాగాది వృత్తులను నిరోధించి భక్తిశ్రద్ధలతో కర్మ చేయువానికి క్రమముగా సంసార నివృత్తి కల్గును. కావున మానవుడు తన చిత్తమును బాగుగ శోధన చేసికొని అశుద్ధికి కారణములైన రాగాది వృత్తులను విడిచి శుద్ధికారణములైన భక్తిశ్రద్ధలయందే చిత్తమును నిలుపవలెను. ఇచ్ఛచే ఏర్పడిన ఆకలి దప్పిక మున్నగు వృత్తులను మూత్ర పురీష విసర్జనాది కర్మలను విడిచిపెట్టవీలుగాదు. వాటిని విడిచిన దుఃఖమే కల్గును అట్టికర్మలను విడచుట చేత స్వర్గము కూడా రాదు. కావున ఐచ్ఛికమైన ప్రాశన విసర్జనాది కర్మచేయదగినదే కాని విడువదగినది కాదు. ఇట్లే జాగ్రత్ స్వప్నాదులయందు సమాధి ఉదాసీనతాది అవస్థలయందు అన్వయ వ్యతిరేకముల చేత రాగాదులే కర్మకు కారణమని సిద్ధించినది.

ఇతః పరం తద్రాగాది కేన ఆగచ్ఛతి ఇతిచేత్ అభిమానేనేతి వక్తవ్యమ్ ఏవంవ్యాప్తిఃఅస్తివా ఇతిచేత్ అస్తి। స్త్రీ జనస్య అహం స్త్రీ జన ఇతి యావదభిమానః అస్తి తావత్ రాగాదిపూర్వకం భర్తృశుశ్రూషణ గృహరక్షా పాక క్రియాది కర్మసు ప్రవృత్తిః భవతి. పురుష జనస్యాపి యావత్ అహం పురుష ఇతి అభిమానః భవతి తావత్ రాగాది పూర్వకం దారాది పరిగ్రహః కృషివాణిజ్యాది కర్మసుచ ప్రవృత్తిః భవతి. ఏవం సర్వేషాం జీవానామపి వర్ణ ఆశ్రమాది అభిమానేన రాగాది పూర్వకం స్వస్వవ్యాపారే ప్రవృత్తిఃభవతి. తస్మాత్ రాగాదేః అభిమాన ఏవ కారణమ్.

ఇక ఈ రాగాదికము దేనిచే కల్గును అనినచో అభిమానముచే అని అనవలయును. ఈ రెంటికీ సంబంధము కలదా అన్నచో కలదు. స్త్రీకి నేను స్త్రీని అని అభిమానమున్నంత వరకు రాగాది పూర్వకముగా భర్తృసేవ, గృహరక్షణము, వంట,మున్నగు పనుల యందు ప్రవృత్తి కల్గును. పురుషునకు నేను పురుషుడనుఅనుఅభిమాన మున్నంత వరకు రాగాదిపూర్వకముగా భార్యాపుత్రాదులను స్వీకరించుట, కృషి,వ్యవసాయము, వ్యాపారము మున్నగు కర్మల యందు ప్రవృత్తి, కల్గుచున్నది. కావున రాగాదికమునకు అభిమానమే కారణము.

అస్య విచారస్య కింఫలమితి చేత్ ముముక్షుః పురుషః స్వజాతి వర్ణ ఆశ్రమ వయో అవస్థాది అభిమానం త్యజేత్. తస్మిన్ త్యక్తే బంధః న భవతీతి జానీహి.అభిమానే సతి రాగాదిః అభిమానాభావేరాగాద్యభావః ఇతి అన్వయవ్యతిరేకౌ యుక్త్యాజానీహి. తత్కథమితి చేత్ జాగ్రదాద్యవస్థాసు వర్ణాశ్రమాదిఅభిమానస్యవిద్యమానత్వాత్ రాగద్వేషాదినిమిత్తక ప్రవృత్తి. సుషుప్తౌ ఉదాసీనావస్థాయాంచ వర్ణాశ్రమాది అభిమానాభావాత్ రాగద్వేషాదినిమిత్తకా ప్రవృత్తిః నాస్తీతి జానీహి

ఈ విచారణకు ఫలమేమి అనినచో మోక్షాపేక్ష కల మనిషి తన జాతి వర్ణ ఆశ్రమ వయో అవస్థలు మొదలగువాని పట్ల అభిమానమును విడువవలెను. అభిమానము విడువబడినచో బంధము కూడా విడువబడినదగును అని తెలిసికొనుము అభిమానమున్నచో రాగాదికముండును. అభిమానము లేకున్నచో రాగాదికముఉండదు. అను

అన్వయవ్యతిరేకములను యుక్తి చేత తెలిసికొనుము. అదెట్లనగా జాగ్రదాది అవస్థల యందు వర్ణాశ్రమాది అభిమానము ఉండుట వలన రాగద్వేషాదులు నిమిత్తముగా గల ప్రవృత్తి కలుగుచున్నది. సుషుప్తి యందు ఉదాసీన అవస్థయందును వర్ణాశ్రమాది అభిమానము లేకుండుట వలన రాగద్వేషాదినిమిత్తకప్రవృత్తికూడా ఉండదుఅను ఈ విషయమును గమనింపుము.

తర్హి అయం అభిమానః కేన భవతీతి చేత్ అవివేకేన భవతి. తత్కథమితి చేత్ సర్వేషాం జీవానాం దేహవ్యతిరిక్తత్వే సత్యపి వివేకాభావాత్ అహం బ్రాహ్మణః అహం క్షత్రియః అహం వైశ్యఃఅహంశూద్రః, అహం బ్రహ్మచారీ, అహం గృహస్థః అహం వానప్రస్థః అహం సన్యాసీ, అహం పురుషః ఇత్యాది అభిమానః జాయతే. తంవినా నఅన్యో హేతుః

మరి ఈ అభిమానము దేనిచే కల్గుచున్నది అనినచో అవివేకము చేతనే కల్గుచున్నది. అదెట్లనగా సమస్త జీవులు దేహముకంటె వేరుగా ఉండుట వాస్తవమైనను నేను వేరు అను వివేకము లేనందున నేను బ్రాహ్మణుడను నేను క్షత్రియుడను నేను వానప్రస్థుడను నేను సన్యాసిని నేను పురుషుడను అను మొదలుగాగల అభిమానము కల్గుచున్నది. ఈ అభిమానమునకు అవివేకము తప్పమరియొక కారణము లేదు.

అస్యఅభిమానస్య అవివేకం అనపేక్ష్య,తదన్యత్ శరీరమేవ అవలంబనమ్ భవతు ఇతిచేత్ క్షత్రియస్య అహం బ్రాహ్మణః ఇతి స్త్రియః అహంపురుషః ఇతి బ్రహ్మచారిణః అహం గృహస్థః ఇతి అభిమానః భవేత్. నఃనదృశ్యతే.తస్మాత్శరీరమవలంబ్యఅభిమానఃనాగచ్ఛతిశిఖాం యజ్ఞోపవీతమవలంబ్యఅహంబ్రాహ్మణఃఇతికాషాయ కమండల్వాది కమవలంబ్యఅహంసన్యాసీతిచ అభిమానః భవతీతి చేత్ శిఖాయజ్ఞోపవీతాది వైశ్యకులాలయోరపి అస్తి. కాషాయకమండల్వాది కేషాంచిత్ శూద్రాణాం తపస్వినామపి అస్తి. తేషాం ఏతేషాం చ అహం బ్రాహ్మణః అహం సన్యాసీతి అభిమానః స్యాత్ ననదృశ్యతే.స్త్రీ పురుషాభిమానవత్ అవయవ విశేషమవలంబ్య అహం బ్రాహ్మణ ఇతి అభిమానః ఇతి చేత్ సర్వేషామపి అవయవ విశేషాభావాత్ ఏకరూపత్వాత్ అవయవ విశేషఃఅపి అవలంబనం

నభవతి. తర్హి విశిష్ట మాతాపితృజన్య అవయువవిశేషమవలంబ్య అభిమానవిశేషః ఇతిచేత్ తజ్జన్య లోమ నఖ దంత మూత్రపురీషాది అవయవానామపి బ్రాహ్మణత్వాది వ్యవహారః స్యాత్, సనదృశ్యతే. తస్మాత్ అవివేకం విహాయ అన్యత్ కిమప్యవలంబ్య అభిమానః భవతీతి బ్రహ్మణాపి వక్తుం న శక్యతే.

ఈ అభిమానమునకు అవివేకము కాక వేరైన శరీరమే ఆధారము (కారణము) అనవచ్చును కదా అన్నచో క్షత్రియునకు నేను బ్రాహ్మణుడని ,స్త్రీకి నేను పురుషుడనని, బ్రహ్మచారికి నేనుగృహస్థుడనని అభిమానము ఉండవలసివచ్చును. అది ఎచ్చటను కనపడుటలేదు. కావున శరీరమును అవలంబనము చేసికొని అభిమానమురాదు. శిఖను యజ్ఞోపవీతము మున్నగు వానిని ఆధారము చేసికొనినేను బ్రాహ్మణుడను అని కాషాయ కమండలువులను ఆధారము చేసికొని నేను సన్యాసినని అభిమానము కలుగవచ్చును కదా అనినచో శిఖాయజ్ఞోపవీతాదికము వైశ్యులకు కుమ్మరి వారికిని కలదు. కాషాయకమండలువులు కొంతమంది శూద్రతపస్వులకును ఉండవచ్చును. వారికి వీరికిని నేను బ్రాహ్మణుడను నేను సన్యాసిని అను అభిమానము ఉండవలెను. గదా కాని అది కనపడుటలేదు. అవయవ విశేషమును అవలంబించి నేను బ్రాహ్మణుడనను అభిమానము కలుగవచ్చును కదా అన్నచో ఎవరికిని అవయవవిశేషముబట్టి అభిమానము లేదు ఉన్నఅవయములకు ఏక రూపత్వమే కలదు కనుక అవయవ విశేషముఅభిమానమునకు ఆధారముకాదు. ఆయా తల్లిదండ్రులనుండి పుట్టిన అవయవవిశేషములను అనుసరించి ఈ అభిమాన విశేషము కలుగవచ్చును కదా అన్నచో ఆయా తల్లితండ్రుల నుండి పుట్టిన రోమ,నఖ,దంత, మూత్ర,పురీషాది అవయవములకును బ్రాహ్మణత్వాదివ్యవహారము ఉండవలసివచ్చును. అదియును కనబడుటలేదు. కావున అవివేకము కాక వేరొక దానిని అవలంబించి ఈ శరీరాభిమానము కల్గుచున్నదని బ్రహ్మకు కూడా చెప్పుటకు వీలు కాదు.

తర్హి బ్రాహ్మణత్వాది అభిమానః కేన భవతి ఇతి సమ్యక్ విచార్యమాణే లోకే ఉత్సవ ఇతి కల్యాణమితి సభాఇతి సేనా ఇతి వస్తు

సమూహస్య తత్తత్ నామ్నా వ్యవహారః ప్రవర్తతే. తథా మాయామయస్యాపి అనిర్వచనీయస్యాపి దేహేంద్రియాది సంఘాతస్యైవ లోక వ్యవహారేణ కేవలం, బ్రాహ్మణః, క్షత్రియః, వైశ్యః, శూద్రః, స్త్రీ, పురుషః, నపుంసకః, గుర్జరః, మహరాష్ట్రః, ఆంధ్రః, కర్నాటకః, ద్రావిడః,శాస్త్రీ,దీక్షితః, అవధానీ పౌరాణికః, గంగాస్నాయీ, శైవః, భాగవతః, సేవకః, ప్రధానీ, రాజా, మంత్రీ, గురుః శిష్యః, ఇత్యాది సకల నామ వ్యవహారః కాలత్రయేఽపి ఆత్మనః నామ వ్యవహారః నాస్తి ఇత్యేవం రూప విచారా కరణమేవ అవివేకః, అనేనైవ అవివేకేన సర్వేషాం ఆత్మని వర్ణాశ్రమాది అభిమానః భవతి.

అయినచో ఈ బ్రాహ్మణత్వాది అభిమానము దేనిచే కల్గుచున్నది అని బాగుగ విచారణ చేయగా లోకమున ఉత్సవమని కల్యాణము అని సభ అని సేన అని అనేక జనుల వస్తువుల సమూహమునకు ఆయా పేర్లతో వ్యవహారము జరుగుచున్నది కదా అట్లే మాయామయమైనను అనిర్వచనీయమైనను చెప్పుటకు వీలుకానిదైనను దేహేంద్రియ సంఘాతమునకే (దేహేంద్రియముల ముద్దకే) కేవలము లోక వ్యవహారము అనుసరించి బ్రాహ్మణుడు, క్షత్రియుడు, వైశ్యుడు, శూద్రుడు, స్త్రీ, పురుషుడు, నపుంసకుడు, గుజరాతీయుడు ,మహారాష్ట్రుడు,ఆంధ్రుడు, కర్నాటకుడు,ద్రావిడుడు, శాస్త్రి, దీక్షితుడు, అవధాని,పౌరాణికుడు గంగాస్నాయి (గంగలో నిత్యము స్నానము చేయువాడు) శైవుడు,భాగవతుడు,సేవకుడు, ప్రధాని,రాజు,మంత్రి, గురువు,శిష్యుడుఅని మొదలైన సకలనామ వ్యవహారము జరుగుచున్నది. ఏకాలమునందును ఆత్మకు ఈ నామవ్యవహారము ఉండదు అని విచారణచేయకుండుటయే అవివేకము.ఈ అవివేకము చేతనే అందరికీ ఆత్మవిషయమున వర్ణాశ్రమాది అభిమానము కలుగుచున్నది.

అయం అవివేకః కేనభవతి ఇతి చేత్ స్వస్యనిజస్యచిదాత్మ స్వరూపస్య అనాది కాలమారభ్య ఆవరకం ఆత్మ జ్ఞానైకాపనోద్యం యత్ అనాది అజ్ఞానం, తదేవ కారణమ్. ఇదమేవ అజ్ఞానం మాం ఇహ నజానామి ఇతివ్యవహ్రియతే.

ఈ అవివేకము దేనిచే కల్గుచున్నది? అనినచో తన వాస్తవ చిదాత్మస్వరూపమును అనాదికాలమునుండి ఆవరించునది. ఆత్మజ్ఞానము మాత్రము చేతనే తొలగజేయదగినదియునగు ఏ అనాది అజ్ఞానము ఉన్నదో అదియే అవివేకమునకు మూలకారణము. ఈ అజ్ఞానమేనన్నునేను తెలునుకొనలేకున్నాను అని వ్యవహరింపబడుచున్నది.

నను లోకేభ్రాంతమేకం వినా కోవా ఆత్మానం నజానాతి ఇతిచేత్ సర్వే భ్రాంతాః ఏవ.తత్కథమితి చేత్ అహం బ్రాహ్మణః అహంక్షత్రియః అహం వైశ్యఃఅహం బ్రహ్మచారీ అహం గృహస్థః ఇత్యాది రూపేణ మిథ్యాభూతం ఇమందేహమేవ సర్వేజానంతి. శరీర వ్యతిరిక్త మాత్మానంనకోపి జానాతి అతః సర్వేభ్రాంతాఃఏవ.

లోకమునభ్రమ చెందినవాడొకడు తప్ప ఆత్మను తెలియని వాడు ఎవడుండును? అన్నచో అందరూ భ్రాంతులే. అదెట్లన్నచో నేను బ్రాహ్మణుడను, నేను క్షత్రియుడను నేను వైశ్యుడను నేను బ్రహ్మచారిని నేను గృహస్థుడను అను మొదలైన అయాభావముచే మిథ్యాభూతమైనఈ దేహమునే అందురు తెలిసికొనుచున్నారు కాని శరీరముకంటెవేరైన ఆత్మను ఎవరును తెలిసికొనుట లేదు. కావున అందరును భ్రమగలవారే (ఒకదానినిఇంకొకటిగా భావించువారే, ఈశరీరమును ఆత్మగా భావించు వారే)

నను లోకే కేచిత్ శాస్త్రజ్ఞాః పౌరాణికాశ్చ దేహం అనాత్మత్వేన మన్యమానాఃఘటకుడ్యసన్నిభం దేహం విహాయ అన్యమేవ ఆత్మానం జానంతి. హే స్వామిన్,భవద్భిః ఆత్మానం కో ఉపిన జానాతి ఇతి కథముచ్యతేఇతి చేత్ హేపుత్ర, కే ఉపి పరమార్థమాత్మానం నజానంతి. కింతు కర్తారం, భోక్తారం,పరిచ్ఛిన్నం లోకాంతరగామినం చిదాభానరూపం వ్యావహారికం జీవాత్మానమేవ ఆత్మత్వేన జానంతి.తం విహాయ అకర్తారం, అభోక్తారం, అపరిచ్ఛిన్నం, అచలం, చిద్రూపం,పారమార్థికమాత్మానం న జానంతి.

లోకములో కొంతమంది శాస్త్రజ్ఞులు పౌరాణికులును దేహమును అనాత్మగనే తలుచుచు ండ, గోడవలె నున్న ఈదేహమును దీనికంటె

వేరుగా నున్న ఆత్మను తెలిసిన వారు ఉన్నారు కదా! స్వామీ! తాము ఆత్మను ఎవరును తెలిసికొనుటలేదని ఎట్లనుచున్నారు అనినచో నాయనా! వినుము వారు కూడా యథార్థమైన ఆత్మను తెలిసికొనుటలేదు. కాని కర్త భోక్త వరిచ్ఛిన్నుడును లోకాంతర గామియు చిదాభానరూపుడును వ్యావహారికుడును అగు జీవాత్మనే ఆత్మగా తలంచుచున్నారు.ఆ జీవాత్మకాకుండా వేరుగా అకర్త అభోక్త అపరిచ్ఛిన్నుడు, చిద్రూపుడు, పారమార్థికుడును అయిన ఆత్మను తెలిసికొనుట లేదు.

ఇదమజ్ఞానం కేన భవతి ఇతిచేత్ అనాదిత్వేన వేదేషు శాస్త్రేషు చ ప్రసిద్ధత్వాత్ అస్యకారణం వక్తుం న శక్యతే. తర్హి తస్య అజ్ఞానస్య ఆదిః నాస్తి చేత్ అంతో ఒపి నాస్తీతినిశ్చయః తథా చేత్ జీవస్యముక్తిరపి నస్యాత్ ఇతిచేత్ శృణు.అజ్ఞానస్య ఆదేః అభావే ఒపి అంతః అస్త్యేవ. లోకే కేషాంచిత్ పదార్థానాం ఆదేః అభావే ఒ పి అంతఃఅస్తి కేషాంచిత్ అంతాభావే ఒపి ఆదిః అస్తి . తత్కథమితి చేత్ ప్రాగభావస్య ఆదిఃనాస్తి అంతః అస్తి. ప్రధ్వంసాభావన్య ఆదిరస్తిఅంతోనాస్తి కింతువాత పిత్తశ్లేష్మజన్యవ్యాధేఃమూలాజ్ఞానేపి వైద్యశాస్త్రే ఉక్తైరౌషధైః యథా నివృత్తిః దృశ్యతే తథా అజ్ఞానస్య మూలఅజ్ఞానే ఒపి వేదాంత శాస్త్ర ఉక్త వాక్య జన్య జ్ఞానేన అజ్ఞానం వినశ్యతీతి సిద్ధాంతః

ఈ అజ్ఞానము దేనిచే కల్గుచున్నది అనినచో వేదమునందు శాస్త్రములందును అజ్ఞానము అనాదిగా (ఆది లేకుండా) ఉన్నట్లు ప్రసిద్ధముగా ఉండుట వలన దీనికి కారణము చెప్పుటకు వీలు లేదు.అయినచో అజ్ఞానముగా ఉండుట వలన దీనికి కారణము చెప్పుటకు వీలు లేదు. అయినచో అజ్ఞానమునకు ఆది లేనిచో అంతము కూడ ఉండదని నిశ్చయమే కదా. అప్పుడు జీవునకు ఉన్న అజ్ఞానము నశించదు కనుక ముక్తి కూడా లేకపోవలసి వచ్చును. అనినచో వినుము అజ్ఞానమునకు ఆది లేకున్నప్పటికి అంతము ఉండవచ్చును. లోకములో కొన్ని పదార్థములకు ఆది లేనప్పటికిని అంతముఉండును. కొన్ని పదార్థములకు ఆది ఉండును.అదెట్లనగా ప్రాక్ అభావము ప్రాగభావము అనగా పుట్టకుండుట. దీనికి ఆదిలేదు. అంతము కలదు. వస్తువు పుట్టిన తర్వాత

పుట్టకుండుట అనునది నశించును అట్లే ప్రధ్వంసాభావము అనగా నశించుట. దీనికి అంతము లేదు. ఆది కలదు. నశించుటకు ఆరంభమున్నను నాశనమునకు అంతము ఉండదుకదా) అట్లే అజ్ఞాన విషయమున ప్రాగభావమునకువలె ఆదిలేకున్నను అంతము భావించవచ్చును. వాతపిత్తశ్లేష్మములవలన కల్గిన వ్యాధికి అసలు మూలకారణము తెలియకున్నను వైద్యశాస్త్రమున చెప్పబడిన ఔషధములచే నివారణ కనబడుచున్నది.అట్లే అజ్ఞానమునకు మూలము తెలియనప్పటికీని వేదాంత శాస్త్ర వాక్యములవలన కల్గిన జ్ఞానముచేత అజ్ఞానము నశించునని సిద్ధాంతము.

అజ్ఞానస్య స్వరూప లక్షణం కిమితిచేత్ తద్దుర్వచమ్ తథాహి తదజ్ఞానం న సత్, న అసత్,నాపి సదసత్, నసావయవం, ననిరవయవం,న ఉభయాత్మకం,న భిన్నం, న అభిన్నం, నాపి భిన్నాభిన్నం కింతు అనిర్వచనీయమ్.

ఈ అజ్ఞానము యొక్కస్వరూపలక్షణమేమి?అనగా అది చెప్పనలవికానిది. దీనినే పరిశీలింతము. అజ్ఞానము సత్పదార్థము కాదు. అసత్పదార్థము గాదు. అవయవములుకలదికాదు, అవయవములు లేనిది కాదు, ఉభయ స్వరూపము గాదు, వేరైనది కాదు, వేరు కానిది కాదు, వేరై, వేరు కానిదియు కూడా కాదు. కాని అజ్ఞానముఇదమిత్థమని నిర్వచించుటకువీలులేనిది.

తత్కథమితి చేత్ తత్త్వజ్ఞానేన బాధితత్వాత్ నసత్. శశవిషాణ నరవిషాణగగనారవిందవత్ అసదపి న. అహం అజ్ఞః ఇతి సర్వైః అనుభూయమానత్వాత్. నాపి సదసత్. పరస్పర విరోధాత్.

అదెట్లనగా తత్త్వజ్ఞానముచేత బాధింపబడుటవలన అజ్ఞానమును సత్ అని అనరాదు. కుందేటి కొమ్ము, మనుష్యునికొమ్ము, ఆకాశకమలముల వలె బొత్తిగలేనిది కాదు. నేను,అజ్ఞుడను అని అందరిచే అనుభవింపబడుచున్నది కనుక పరస్పర విరోధము కల్గును. కనుక సదసత్ అని అనుటకును వీలు కాదు.

స్థూలాకాశఃసూక్ష్మః.తస్మాదపి సూక్ష్మఃఅపంచీకృతః ఆకాశః తస్మాదపి

సూక్ష్మాఃగుణాః,తేభ్యోఅపి సూక్ష్మం అజ్ఞానమ్.తస్మాత్ సూక్ష్మస్య అపిమూలకారణత్వాత్. అజ్ఞానం న సావయవమ్ స్థూలపదార్థ జగదాకారేణ పరిణామాత్ న నిరవయవం అన్యోన్యవిరోధాత్ న ఉభయాత్మకమ్.

స్థూలాకాశమే సూక్ష్మముగా ఉన్నది. పలుచనైనది దానికంటె సూక్ష్మమైనది అపంచీకృతఆకాశము. దాని కంటెను సూక్ష్మములైనవి గుణములు. వాని కంటె సూక్ష్మము అయినది అజ్ఞానము. కావున అట్టి సూక్ష్మమైనదానికిని మూల కారణమైనందున అజ్ఞానము అవయవములు కలది కాదు. స్థూలపదార్థమైన జగత్తుగా పరిణామము చెందినందున నిరవయవమును కాదు. అన్యోన్యవిరోధము కలుగును కనుక ఉభయాత్మకము కాదు.

ఆత్మనో భిన్నమితి చేత్న. అద్వైత విరోధాత్. ఆత్మసత్తా యాఃఅతిరిక్త సత్తాభావాత్ చ న భిన్నమ్. అభిన్నమితి చేత్ ఆత్మశక్తిత్వ అభావ ప్రసంగాత్, "పరాస్య శక్తిః వివిధైవ శ్రూయతే" ఇతి శ్రుతి విరోధా త్తదపి న సంభవతి.కించ ఆత్మనోజడత్వం మాయాయాః చేతనత్వంవా స్యాత్.ఆత్మనః అవిద్యాదినామ్నా చ భవితవ్యమ్ ఆత్మనః సచ్చిదానంద స్వరూపస్య చ అనృతజడదుఃఖరూపమపి స్యాత్. తస్మాత్ న అభిన్నమ్. భిన్నత్వాభిన్నత్వయోః విరోధాత్ న ఉభయాత్మకమ్ తస్మాత్ అజ్ఞానం అనిర్వచనీయమేవ.

ఆత్మకంటె భిన్నమనిన అద్వైతమునకు విరోధము కల్గును. ఆత్మ సత్త (ఉనికి) కంటె వేరైన సత్త దానికిలేనందున భిన్నము కాదు. అభిన్నమని చెప్పినచో అది ఆత్మ శక్తికాకుండపోవలసివచ్చును. "పరాస్యశక్తిః వివిధైవ శ్రూయతే" అను శ్రుతికి (ఆత్మశక్తియే అజ్ఞానము మాయ అను చెప్పుశ్రుతికి) విరోధము కూడా కలుగును. అందుచే అది అభిన్నమనుటయు కుదురదు. అంతే కాదు ఒకటి అని అనుట వలన ఆత్మకు జడత్వము మాయకు చేతనత్వమును రావలసి వచ్చును. ఆత్మకు అవిద్యాదినామములు కూడా రావలసియుండును. సచ్చిదానందస్వరూపమగు ఆత్మకు అనృతజడదుఃఖ స్వభావము కూడా ఏర్పడవలసి యుండును. అందువలన అజ్ఞానము ఆత్మాభిన్నమనిఅనరాదు. భేదాభేదములకు విరోధముండును కనుక

ఉభయమును (భిన్నాభిన్నమని అనుటయు) కుదురదు. ఈ విధముగా అజ్ఞానము అనిర్వచనీయమనియే చివరకు తేలినది.

ఏవం భూతాత్ అనాదేః అజ్ఞానాత్ అవివేకః, తస్మాత్ అభిమానః, తస్మాత్ రాగద్వేషాదిః, తేన కర్మ, కర్మణా శరీరం, తస్మాత్ దుఃఖమ్ ఇతి సాంసారిక దుఃఖం ఆత్మనః అజ్ఞానాత్ పరంపరయా భవతీతి జ్ఞాతవ్యమ్

ఈ విధమైన అనాది అజ్ఞానము వలననే అవివేకము దాని వలన అభిమానము దానివలన రాగద్వేషాదికము దానిచే కర్మ,కర్మవలన శరీరము,దాని వలన దుఃఖము ఏర్పడినది. ఈ సాంసారిక దుఃఖము ఆత్మయొక్కతెలివి లేకపోవుటవలన పరంపరగాకలుగుచున్నదని తెలియవలయును.

తర్హి ఏతత్ దుఃఖం కథం నశ్యతి ఇతిచేత్ శరీరే గతే సతి దుః ఖంనశ్యతి శరీరంచ కర్మణి నష్టే సతి నశ్యతి. కర్మచ రాగద్వేషాదౌ నశ్యతి సతి నశ్యతి. రాగద్వేషాదిశ్చ అభిమానే నష్టే సతి నశ్యతి. అభిమానశ్చ అవివేకే నశ్యతి సతి నశ్యతి. అవివేకశ్చ అజ్ఞానే నశ్యతి సతి నశ్యతి. అజ్ఞానంచ అద్వైతబ్రహ్మ స్వరూపస్య ఆత్మనః స్వస్య దృఢ నిశ్చయరూపేణ బ్రహ్మైవాహం అహం బ్రహ్మాస్మి ఇతి మహావాక్యజన్య జ్ఞానేన వినశ్యతి. న అన్యేన ఇతి జ్ఞాతవ్యమ్.

అయితే ఆత్మకు ఈ దుఃఖము ఎప్పుడు పోవును? అని అడిగినచో శరీరము పోయిన దుఃఖము పోవును. కర్మ నష్టమైన శరీరము నశించును. కర్మరాగద్వేషాదికము నశించిన నశించును. రాగద్వేషాదికము అభిమానము నశించిన నశించును అవివేకము నశించిన అభిమానము నశించును.అజ్ఞానము అద్వైతజ్ఞానానుభవముతో నశించును అజ్ఞానమునశించిన అవివేకము నశించును. అద్వైతము బ్రహ్మస్వరూపమైన ఆత్మతానే అను దృఢ నిశ్చయరూపముగా "బ్రహ్మము నేను, నేనే ఆబ్రహ్మమును" అను మహావాక్యములవలన కలిగిన జ్ఞానము చేత అజ్ఞానము నశించును. వేరొక సాధనచే నశించదని తెలియవలయును.

నను బ్రహ్మహత్యాది మహాపాతకాన్యపి ప్రాయశ్చిత్తరూప సత్కర్మభిః నిశ్శేషం నశ్యంతి తాదృశ కర్మశక్త్యా అల్పం మిథ్యాభూతం ఇదంఅజ్ఞానం

కిమితి న నశ్యేత్ ? ఇతి చేత్, కర్మణః అజ్ఞానస్య చ విరోధో నాస్తి. కర్మ అజ్ఞానం వర్ధయతి. యథా అమావాస్యాంధకారః మేఘావరణం వర్ధయతి తథాకర్మ అజ్ఞానం వర్ధయతి. న నివర్తయతి. తమంధకారం సూర్యో యథా నివర్తయతి తథా అజ్ఞానం జ్ఞానమేవ నివర్తయేత్ న కర్మ.

బ్రహ్మ హత్యాది మహాపాతకములు ప్రాయశ్చిత్తరూప సత్కర్మల చేత నిశ్శేషముగా నశించును కదా. అట్టి కర్మశక్తితో అల్పమైన మిథ్యాభూతమైన ఈ అజ్ఞానము ఏల నశించదు? అనినచో కర్మకు అజ్ఞానమునకు విరోధము లేదు. కర్మచేత అజ్ఞానము పెరుగును. అమావాస్య చీకటి మేఘావరణమును వృద్ధి పొందించినట్లు కర్మ అజ్ఞానమును పెంచును గాని తొలగించదు. ఆ చీకటిని సూర్యభగవానుడు ఎట్లు నివర్తింపజేయునో అట్లే అజ్ఞానమును జ్ఞానమే నివర్తింపజేయును కాని కర్మ అజ్ఞానమును తొలగించదు.

నను త్రివిధకరణజన్యం కర్మ(విజ్ఞానస్యాపి అంతఃకరణ జన్యవృత్తిత్వేన కర్మత్వాత్) తత్ కథం అజ్ఞానం నాశయేత్? ఇతి చేత్ శృణు, సత్యం.వృత్తిః మాననం కర్మైవ. సా వృత్తిః జ్ఞానస్య అజ్ఞానస్య నివర్తనేరూపగ్రహణే నేత్రవత్ ఉపాధిభూతైవ న స్వయం నివర్తికా.

కర్మ త్రివిధకరణముల వలన పుట్టినది కదా. విజ్ఞానము కూడా అంతఃకరణము వలన పుట్టిన వృత్తి కనుక కర్మయే కదా. ఈ కర్మఅజ్ఞానమును ఎట్లు నివర్తింపజేయును అని అడిగినచో వినుము. సత్యమే. విజ్ఞానము అంతఃకరణవృత్తియే. మానసిక కర్మయే వృత్తి రూపమగు జ్ఞానము అజ్ఞానము నివర్తింప జేయుటలో రూపమును గ్రహించుటలో కన్ను ఉపాధి యైనట్లు, ఈ జ్ఞానవృత్తి ఉపకరించును కాని స్వయముగా నివర్తింప జేయలేదు.

జ్ఞానం తు నిత్యం తత్ జ్ఞానం స్వరూపజ్ఞానం వృత్తిజ్ఞానమితి ద్వివిధమ్ సుషుప్తౌ అజ్ఞాన ప్రకాశకం జ్ఞానం స్వరూప జ్ఞానం జాగ్రత్ స్వప్న యోః విషయ ప్రకాశకం వృత్తి జ్ఞానం. యథా ఆదిత్యేన ప్రకాశ్యమానే కుడ్య అనేక దర్పణాదిత్య దీప్తయశ్చ భానంతే, తాసాం మధ్యే మధ్యగతా ఆదిత్యదీప్తిశ్చ, తథాజాగ్రత్ స్వప్నయోఃవృత్తిజ్ఞాన ప్రకాశః, సుషుప్తౌ స్వరూప

జ్ఞాన ప్రకాశశ్చ భాతి ఇతి జ్ఞేయమ్.

జ్ఞానము నిత్యమైనది. అది స్వరూప జ్ఞానము వృత్తిజ్ఞానము అని రెండు రకములు. సుషుప్తి యందు గల అజ్ఞానమును ప్రకాశింపజేయగల జ్ఞానము స్వరూపజ్ఞానము. జాగ్రత్ స్వప్నఅవస్థలయందు విషయములను ప్రకాశింపచేయునది వృత్తి జ్ఞానము. సూర్యుని చేత గోడ ప్రకాశింప చేయబడగా గోడయందలి అనేకములైన అద్దము లందు అనేక సూర్య ప్రకాశములును, అప్రకాశముల మధ్యన అసలైన సూర్యప్రకాశమును ఎట్లు కనపడునో అట్లే జాగ్రత్ స్వప్నముల యందు వృత్తి జ్ఞాన ప్రకాశము సుషుప్తియందు స్వరూపజ్ఞానప్రకాశము ఉండునని తెలియవలయును.

తర్హి జాగ్రత్ స్వప్నయోః స్వరూపజ్ఞానం నాస్తివా ఇతిచేత్ స్వరూపజ్ఞానం సర్వాసు అపి అవస్థాసు అస్తి. వృత్తయః సుషుప్తౌ న సన్తి.వృత్తయః సర్వాఃఅపిఅంతఃకరణధర్మాః జ్ఞానం ఆత్మస్వరూపమ్. తత్ స్వరూపభూతం జ్ఞానం వృత్తిం ప్రవిశ్య అజ్ఞానంనాశయతి. కేవలం బుద్ధివృత్తిః అజ్ఞానం నాశయితుంనశక్తా. తస్మాత్ ఆత్మనః అజ్ఞానమపి ఆత్మాకారవృత్తిప్రవిష్టేన స్వరూపజ్ఞానేన వినాశ్యం. న బుద్ధి వృత్త్యా, నకర్మ కోటి సహస్రేణాపివినాశ్యమ్.

జాగ్రత్ స్వప్నాదులయందు స్వరూపజ్ఞానముండదా అనినచో స్వరూపజ్ఞానము సర్వావస్థలయందును ఉండును వృత్తులు సుషుప్తి యందు ఉండవు. అవి అన్నియు అంతఃకరణ ధర్మములే. జ్ఞానము ఆత్మ స్వరూపము. స్వరూపభూతమైన జ్ఞానము వృత్తులయందు ప్రవేశించి అజ్ఞానమును నశింపజేయును. కేవలము బుద్ధివృత్తి అజ్ఞానమును నశింపజేయలేదు. కావున ఆత్మకుగల అజ్ఞానము ఆత్మాకారవృత్తియందు ప్రవేశించిన స్వరూపజ్ఞానముచేతనే నశింపజేయదగినది. కాని కేవలము బుద్ధి వృత్తిచే కాదు గాన కోట్లకొలది వేల కొలది కర్మలచే గాని అజ్ఞానము తొలగింపజేయబడదు.

యథా సత్కర్మైవ పాపకర్మ నాశయతిఏవం వృత్తిజ్ఞానమేవ అజ్ఞానం నాశయతి. యథా మాణిక్యం శిలారూపమపి ప్రకాశ యుక్తత్వేన రత్నదీప ఇతి వ్యవహ్రియతే ఏవం వృత్తిజ్ఞానస్య మనోవృత్తిరూపత్వే ఽపి స్వప్రవిష్ట

స్వరూప జ్ఞాన యుక్తత్వాత్ జ్ఞానమితి వ్యవహారః గౌణఃఏవ, న కర్మ ఇతి వ్యవహారః

సత్కర్మమే పాపకర్మను నశింపజేసినట్లు వృత్తిజ్ఞానమే అజ్ఞానమును నశింపజేయును. మాణిక్యము శిలారూపమైనను ప్రకాశముతో కూడిఉండుటచేత రత్నదీపము అని వ్యవహరింబడుచున్నట్లు వృత్తి జ్ఞానము కూడా మనోవృత్తిరూపమైనను తన యందు ఉన్నస్వరూపజ్ఞానవృత్తితో కూడి ఉండుట వలన జ్ఞానమను వ్యవహారమును గౌణము గానే పొందును. కాన వృత్తి అయినను దాని (జ్ఞానమునకు) కర్మయను వ్యవహారము లేదు.

నను సుషుప్తౌ స్వరూపజ్ఞానస్య అజ్ఞానప్రకాశకత్వే విరోధాభావాత్ కథంజ్ఞానం అజ్ఞానం నాశయేత్ ఇతి చేత్ స్వరూపజ్ఞానస్య అజ్ఞానేన సహవిరోధాభావే ఽపి వృత్తిజ్ఞానస్య అజ్ఞానేన సహవిరోధః అస్త్యేవ. వృత్తౌప్రవిష్టస్యాపి జ్ఞానస్య స్వరూప జ్ఞానత్వాత్ కథం అజ్ఞానేన సహవిరోధః ఇతిచేత్ తృణాదేః ప్రకాశకత్వేన ఆదిత్యకిరణస్య తేన సహ విరోధాభావే ఽపి సూర్యకాంతప్రవిష్టస్య తస్యైవ యథాతృణాదిదాహకత్వేన తేనసహ విరోధః తథా స్వరూపజ్ఞానస్యకేవలస్య అజ్ఞానేన సహవిరోధా భావే ఽపి వృత్తి ప్రవిష్టస్యఅస్య అజ్ఞానేన సహ విరోధః అస్తి.

సుషుప్తి యందు ఉన్న స్వరూప జ్ఞానముఅజ్ఞానమును ప్రకాశింపజేయుటలో ఏ విరోధము లేదు కదా,మరి ఈ జ్ఞానము అజ్ఞానమును ఎట్లు నశింపజేయునుఅని అనినచో స్వరూప జ్ఞానమునకు అజ్ఞానముతో విరోధము లేనప్పటికీ వృత్తి జ్ఞానమునకు అజ్ఞానముతో విరోధము ఉండనే ఉన్నది.వృత్తియందు ప్రవేశించిన జ్ఞానము కూడా స్వరూపజ్ఞానమే కదా దానికి అజ్ఞానముతో విరోధము ఎట్లుండును? అని అనినచో గడ్డిమొదలైన పదార్థములను ఆదిత్య కిరణము ప్రకాశింపచేయును కనుక దానికి వానితో విరోధము లేదు. కాని సూర్యాకాంత మణి శిలయందు ప్రవేశించినసూర్యకిరణము తృణాదులను దహింప చేయుట వలన దానికి తృణాదికముతో విరోధము కనబడుచున్నది.అట్లే అజ్ఞానముతో కేవల స్వరూప జ్ఞానమునకు విరోధము ఉండవచ్చును(కావున వృత్తి జ్ఞానము వలన అజ్ఞానము నశించును.)

నను వృత్తి జ్ఞానేన అజ్ఞాన తత్కార్యనాశే ఽపి వృత్తేః, తత్రప్రవిష్టజ్ఞానస్యాపి విద్యమానత్వాత్ కథం అద్వైతం సిద్ధ్యేత్ ఇతిచేత్ కతకరజోన్యాయేన వృత్తిజ్ఞానం అజ్ఞానం తత్కార్యంచ నివర్త్య స్వమపి స్వయమేవ నివర్తయేత్ వృత్తినాశే సతి వృత్తౌ ప్రతిబింబితం జ్ఞానమపి బింబభూతం స్వరూపజ్ఞానమేవ ప్రాప్నోతి. తతఃఅద్వైతం ఆత్మస్వరూపమేవ అవతిష్ఠతే ఏవం వృత్తిజ్ఞానేనైవ అజ్ఞానస్య వినాశః ఏవం అజ్ఞానం ఆత్మవిచారేణైవ నశ్యతి. నకర్మభిః న యోగోపాసనయావా.

వృత్తి జ్ఞానముచే అజ్ఞానము దాని కార్యము నశించినను వృత్తియు దానియందు ప్రవేశించిన జ్ఞానమును (రెండును) ఉండగా అద్వైతము (ఏకబ్రహ్మపదార్థస్థితి) ఎట్లు సిద్ధించును అనినచో కతకరజోన్యాయముచే ఇందుప(చిల్ల) గింజ గంధము నీటిలోని మాలిన్యమును పోగొట్టి తాను కూడా అడుగంటునట్లు వృత్తి జ్ఞానము కూడా అజ్ఞానమును దాని కార్యమగు జగత్తును నివర్తింప చేసి తనను కూడా అజ్ఞానమును దాని కార్యమగు జగత్తును నివర్తింప చేసి తనను కూడా స్వయముగనే నివర్తింప చేసికొనును. వృత్తినశించగా అందు ప్రతిబింబించిన వృత్తి జ్ఞానము బింబభూతమైన స్వరూప జ్ఞానమును చేరును. కావున అద్వైతమైన ఆత్మస్వరూపమే మిగులును. ఈ ప్రకారముగా వృత్తి జ్ఞానము వలన అజ్ఞానము నశించును. ఈ విధముగా అజ్ఞానము ఆత్మవిచారణ చేతనే తొలగును. కాని కర్మలచేత గాని యోగ ఉపాసనల చేతగాని తొలగదు.

జ్ఞానం వస్తుతంత్రమ్ అత ఏవ కర్తుం అకర్తుం అన్యథాకర్తుం అశక్యమ్. ఉపాసనయోగౌ తు పురుషతంత్రత్వాత్కర్తుం అకర్తుం, అన్యథాకర్తుంశక్యౌ. తాభ్యాం చిత్తైకాగ్ర్యంఅణిమాది అష్టైశ్వర్యం చ సాధ్యతే. నతు జ్ఞానమ్. ఉపాసనయోగయోః మనోవ్యాపారరూపత్వాత్ తౌ క్రియాతంత్రౌ న వస్తు తంత్రౌ. తస్మాత్ వస్తుతంత్రం జ్ఞానం కర్మణా నాయాతి. కింతు విచారేణైవ సాధ్యమ్. సాలగ్రామః రత్నం,స్వర్ణం ఇత్యాది వస్తునిర్ణయః లక్షణ పరీక్షాభ్యాం నిఘర్షణేన చ కర్తవ్యః నతుస్నాన సంధ్యావందన ప్రాణాయామాదినా కస్యాపి సాధ్యః ఇతి నిశ్చయః ఏవ.ఏవం ఆత్మజ్ఞానమపి ఆత్మానాత్మ విచారం వినా ఉపాసనాదిభిః సాధయితుం న శక్యతే.

జ్ఞానము వస్తువును బట్టి కలుగునది. (వస్తుతంత్రము, వస్త్వధీనము).కనుకనే చేయుటకు చేయకుండుటకు ఇంకొక విధముగా చేయుటకును వీలులేనిది. ఉపాసనా యోగములు పురుష తంత్రములు (పురుషాధీనములు) అగుటచే చేయుటకు చేయకుండుటకు ఇంకొక రకముగా చేయుటకును.వీలైనవి. ఉపాసన యోగములచే చిత్తైకాగ్ర, అణిమ మొదలగు అష్ట సిద్ధులను సాధించుట వీలుగును గాని వానిచే జ్ఞానము సాధింపరాదు. ఉపాసనాయోగములు మనోవ్యాపారములు (మానసిక క్రియలు) అగుట వలన అవి క్రియాతంత్రములే కాని వస్తు తంత్రములు కావు. వస్తుతంత్రమైన (వస్త్వధీనమైన) జ్ఞానము కర్మచే సాధింపబడదు.అది విచారణ చేతనే సాధ్యమగును. ఇది సాలగ్రామము, ఇది రత్నము, ఇది బంగారము అను మొదలైన వస్తువుల నిర్ణయము లక్షణ పరీక్షల చేత రాపిడి చేతను సాధ్యమగును కాని స్నానసంధ్యావందన ప్రాణాయామాది క్రియలచేత ఎవరికిని వాటిని నిశ్చయించుట సాధ్యము కాదని నిర్ణయమే కదా! ఇట్లే ఆత్మ జ్ఞానము కూడా ఆత్మానాత్మ విచారణ లేకుండా ఉపాసనాదులచే సాధించుటకు వీలైనది కాదు.

తస్మాత్ ముముక్షుః ఇతర వ్యాపారం విహాయ శ్రవ ణమననాభ్యాం సదా ఆత్మానాత్మ విచారమేవకుర్యాత్. య ఏవం తదేకపరః సః అస్మిన్నేవ జన్మని సంసారబంధాత్ విముక్తః సన్ జీవన్ముక్తిం విదేహముక్తించ ప్రాప్నోతి ఇతి సకల వేదాంతాః ఘుష్యంతి. ఏవం మయా ఉక్తమ్ హే పుత్ర! తత్ త్వం విశ్వాసేన గృహీత్వా చిద్రూపేణ తిష్ఠ ! న తు కదాచిదపి కర్తృత్వాది రూపేణ తిష్ఠ!ఇతి మననే షష్ఠ వర్ణకం సమాప్తమ్.

కావున మోక్షాపేక్ష కల్గినవాడు (ముముక్షువు) ఇతర వ్యవహారములను విడిచి శ్రవణమననాదుల ద్వారా ఎల్లప్పుడు ఆత్మానాత్మ విచారమును మాత్రమే చేయవలెను. ఎవరీ విధముగ ఆత్మయందు నిష్ఠగలవాడగునో ఆ మహానుభావుడు ఈ జన్మమందే సంసార బంధము నుండి విముక్తుడై క్రమముగా జీవన్ముక్తిని విదేహముక్తిని పొందును అని సమస్త వేదాంతములు ఘోషించుచున్నవి. కావున నాయనా! నేను చెప్పిన ఈ తత్త్వమును విశ్వాసముతో గ్రహించి చిద్రూపముతోడనే ఉండుము. ఎట్టి

పరిస్థితిలోను ఎప్పుడునూ కర్తృత్వాది రూపముతో ఉండవద్దు.

ఇట్లు మననమున ఆరవ అధ్యాయము సమాప్తము.

అథ సప్తమ వర్ణకమ్

ఇత:పరమస్మిన్ సప్తమవర్ణకే ఆత్మానాత్మ వివేక:,తత్ సాధ్యమాత్మజ్ఞానం బ్రహ్మకైవల్యం చ కథ్యతే. ఆత్మానాత్మవివేకేన ఆత్మజ్ఞానం జాయత ఇతి ఖలూక్తమ్। స ఆత్మా క ఇతి చేత్-శృణు.ఆత్మా శరీరత్రయ విలక్షణ: అవస్థాత్రయసాక్షీ పంచకోశవ్యతిరిక్త: సచ్చిదానందలక్షణ:.అనాత్మా తు శరీరత్రయమ్. తస్యకిం లక్షణమిత్యుక్తే అనృతజడదు:ఖరూపత్వమ్. తత్ చ వ్యష్టి సమష్ట్యాత్మకమ్.వనం సమష్టిః వృక్షఃవ్యష్టిః ఇతిపూర్వమేవోక్తం

ఇక ఈ ఏడవ వర్ణకమునందు ఆత్మానాత్మ వివేకము, దానిచే సాధింపబడు ఆత్మ జ్ఞానము బ్రహ్మకైవల్యమును చెప్పబడుచున్నవి. ఆత్మానాత్మ వివేకము ద్వారా ఆత్మజ్ఞానము కల్గునని కదా చెప్పబడినది ఆ ఆత్మ ఎవరు? అనినచో వినుము. ఆత్మయనగా శరీర త్రయవిలక్షణుడు అవస్థాత్రయమునకు సాక్షి పంచకోశములకంటె వేరైనవాడు సచ్చిదానంద లక్షణుడు. ఇక అనాత్మ అనగా శరీరత్రయమే. దీనికి లక్షణమేమనగా అనృత, జడ దుఃఖ రూపమగుటయే. అది వ్యష్టి సమష్ట్యాత్మకము.

సమష్టి వ్యష్టులకు లక్షణము మొదటి వర్ణకములోనే చెప్పడినది. ఇచట కూడా చెప్పబడుచున్నది. వనము=తోట్ట సమష్టి. వృక్షము చెట్టువంటిది వ్యష్టి . అనగా సమస్తము సమష్టి అనియు వ్యస్తము వ్యష్టి అనియు అర్థము.

"ఏవం శరీరత్రయమపి వ్యష్టిసమష్ట్యాత్మకమ్। తత్ కథమితి చేత్। సమష్టి స్థూలశరీరమ్। సమష్టి సూక్ష్మశరీరమ్। సమష్టికారణశరీరమితి। వ్యష్టిస్థూలశరీరం, వ్యష్టిసూక్ష్మశరీరం వ్యష్టికారణశరీరమితి చ శరీరత్రయమపి సమష్టి వ్యష్టి రూపేణ షట్ ప్రకారమ్।

ఇట్లే శరీరత్రయము కూడా వ్యష్టి సమష్టి రూపముగా నున్నది అదెట్లు? అనగా సమష్టి స్థూల శరీరము, సమష్టి సూక్ష్మ శరీరము సమష్టి కారణ శరీరము, వ్యష్టి స్థూలశరీరము వ్యష్టి సూక్ష్మ శరీరము వ్యష్టి కారణ శరీరము అని మూడు శరీరములు సమష్టి వ్యష్టి రూపముగా ఆరు విధములు.

"ఆత్మనః సమష్ట్యుపాధినా ఈశ్వరత్వమ్। వ్యష్ట్యుపాధినా జీవత్వం

నతు వాస్తవమ్। ఆత్మన ఏకత్వాత్। ఆత్మనో మాయోపాధినా ఈశ్వరత్వమ్। అవిద్యోపాధినా జీవత్వమ్। నతు వాస్తవమితి, జీవః యావత్ న జానాతి తావత్ బంధవిముక్తిః దుఃఖ నివృత్తిశ్చ తస్య న భవతి।" జీవేశావాభాసేన కరోతి మాయాచ అవిద్యాచ స్వయమేవ భవతి" ఇతి సకల జీవమాతా శ్రుతిశ్చ ఏవమేవ ఉపదిశతి।

ఆత్మకు సమష్టి ఉపాధిచే ఈశ్వరత్వము, వ్యష్టి ఉపాధిచే జీవత్వము వచ్చినది. కాని వాస్తవంగాలేదు ఆత్మ ఏకమే కనుక ఆత్మకు మాయోపాధిచే ఈశ్వరత్వము అవిద్యోపాధిచే జీవత్వము కాని వాస్తవముగా లేదని జీవుడెంత వరకు తెలిసికొనడో అంత వరకు అతనికి బంధ విముక్తి దుఃఖనివృత్తి కలుగదు. ఇందులకు "జీవేశావాభాసేన కరోతి మాయా చ అవిద్యాచ, స్వయమేవ భవతి" (మాయా, అవిద్య అను ఉపాధులు జీవేశులను భాసింపచేయునవి) ఉన్నదితానొకడే అని సకల జీవమాతయగు శ్రుతి కూడా దీనినే ఉపదేశించుచున్నది.

ఈశ్వరస్య సమష్టి కారణ శరీరే అభిమానో నాస్తి। కుత ఇతి చేత్-తదా మహాసుషుప్తావహంకారస్య లీనత్వేన అభిమాన కారణఅభావాత్ । అయం సమష్టి కారణోపాధిక ఈశ్వరః అవ్యాకృతః, అన్తర్యామీతి చ ఉచ్యతే। అయం ముఖ్యై భక్తైః జీవైః ఉపాస్యతే। అస్యోపాసనాయాం అశక్తానాం శ్రుతిః సమష్టి సూక్ష్మ శరీరోపాధికమీశ్వరముపాసీత ఇత్యుపదిశతి।తస్య హిరణ్య గర్భః,సూత్రాత్మా, మహాప్రాణః, ఇతి నామాని సన్తి। అస్యాపి హిరణ్య గర్భస్య సూక్ష్మ శరీరే అభిమానో అస్తి వా న వేతి చేత్ తదా స్వప్నావస్థానాత్ అభిమానాశ్రయ స్థూల శరీర ప్రవేశాభావాత్ సూక్ష్మ శరీరే అపి అభిమానః ఈశ్వరస్య నాస్తి। అస్య సూక్ష్మోపాధేః ఈశ్వరస్య ఉపాసనాయాం అశక్తాన్ జీవాన్ ప్రతి సమష్టి స్థూలోపాధికస్య ఈశ్వరస్య ఉపాసనాం శ్రుతిః విధత్తే। తస్య ఈశ్వరస్య విరాట్, వైరాజః, వైశ్వానరః, ఇతి నామాని సన్తి। అస్యాపి అస్మిన్ స్థూల సమష్టి శరీరాభిమానోఽస్తి వానవేతి విచార్యమాణే నాస్తి। కథమితి చేత్। సకలజీవ శరీరాణామపి ఏకీభూయ అస్య శరీరత్వేన అవస్థానాత్ । అహమితి వ్యావర్తనీయ ప్రతియోగ్యభావాత్।

ఈశ్వరునకు సమష్టికారణ శరీరము నందు అభిమానము లేదు. ఏలననగా మహాసుషుప్తియందు అహంకారము లీనమైనందున అభిమానమునకు కారణము లేకుండుట వలన ఈ సమష్టి కారణోపాధిక ఈశ్వరుడే అవ్యాకృతుడు. అంతర్యామి అని చెప్పబడుచున్నాడు. ఈయనయే ముక్తికై భక్తులైన జీవులచేత ఉపాసింపబడును. ఈతనిని ఉపాసించుటకు అశక్తులైన వారికి సమష్టి సూక్ష్మ శరీరోపాధికుడగు ఈశ్వరుని ఉపాసించవలెనని శ్రుతి చెప్పుచున్నది. ఆయనకు హిరణ్య గర్భుడు, సూత్రాత్మ, మహాప్రాణుడు అనిపేర్లుకలవు. ఈ హిరణ్యగర్భునకు సూక్ష్మశరీరమందు అభిమానమున్నదా? లేదా? అనినచో స్వప్నావస్థయందు అభిమానమునకు ఆశ్రయమైన స్థూలశరీరప్రవేశము లేనందున సూక్ష్మశరీరాభిమానము ఈశ్వరునకు లేదు. సూక్ష్మోపాధికుడగు ఈ ఈశ్వరునికే విరాట్, వైరాజుడు, వైశ్వానరుడు అని పేర్లు కలవు. ఈ ఈశ్వరునకు కూడా స్థూల సమష్టి శరీరము నందు అభిమానము (నేనుఅనుభావము) ఉన్నదా? లేదా? అని అడిగినచో లేదని సమాధానము. అదెట్లన్నచో జీవశరీరములన్నియు ఒకటిఅయి ఈతనికి శరీరముగా ఉండుట వలన నేను అని విడిగావిడిగా వేరు చేయదగిన శరీరము లేకుండుట వలన ఇది సాధ్యము కాదు.

" ఏతత్ శరీరోపహిత సమష్ట్యా ఈశ్వరముపాసితుం అశక్తానామపి శ్రుతిః రాజస, సాత్త్విక తామస మూర్తి సహితస్య సృష్టి, స్థితి, సంహార కర్తుః , బ్రహ్మ, విష్ణు,రుద్ర నామధేయస్య దుష్టనిగ్రహ, శిష్టపరిపాలనాయ మత్స్య, కూర్మాది వ్యవహార కర్తురీశ్వరస్య ఉపాసనాం విధత్తే। ఏవం బ్రహ్మాదిమూర్తి ధరస్య ఈశ్వరస్య తత్తన్మూర్తావభిమానోఽస్తి వానవేతి చేత్ ఽ అభిమానాభావే తత్తన్మూర్త్యా సృష్ట్యాదికం కార్యం కర్తుం నశక్యతే। అతోఽభిమానో స్త్యేవ।

ఈ విధమైన పై శరీరోపాధులతో కూడిన సమష్టి ఈశ్వరుని ఉపాసించుటకు అశక్తులైన వారికి కూడా రాజస, సాత్త్విక, తామస, ఆకృతి కల్గి సృష్టి,స్థితి, సంహారములను చేయు బ్రహ్మ,విష్ణు, రుద్రనామధేయములు గల దేవతలను దుష్ట నిగ్రహ,శిష్ట పరిపాలనల కొరకు మత్స్య కూర్మాది వ్యవహారములు కల అవతారములను ఈశ్వరునికి చేయదగిన ఉపాసనను

శ్రుతివిధించుచున్నది. అయితే బ్రహ్మాదిమూర్తిధరుడైన ఈశ్వరునికి ఆయా ఆకృతియందు అభిమానమున్నదా? లేదా? అనినచో అభిమానమున్నది. నేనను అభిమానము లేని ఎడల ఆ ఆకృతి ద్వారా సృష్ట్యాది కార్యము చేయుట కువీలుకాదు. కావున ఈశ్వరునకు ఉపాధులయందు అభిమానముండియే ఉన్నది.

ఈశ్వరస్య అపి జీవవదభిమానే సతి జీవాత్ ఈశ్వరస్య కో విశేష ఇతి చేత-విశేషో౽స్తి। కథమితి చేత్- జీవానాం స్వస్వ దేహేషు అహంతా, మమతా చ సంతతమస్తి। ఈశ్వరస్య తు స్వమూర్త్యభిమానః కృపయా లోకరక్షణార్థం తత్ కార్యసమయే ఏవ కేవలం కల్ప్యతే నటేన స్వభూమికాయాం ఇవ, ఇతి జీవాభిమానస్య ఈశ్వరాభిమానస్య చాస్తి మహాన్ భేదః

ఈశ్వరునకు కూడా జీవులకువలె అభిమానమున్నచో జీవునికంటె ఈశ్వరునకు గల విశేషమేమి? అని అనినచో, విశేషము కలదు. ఎట్లనగా జీవులకు వారి వారి దేహముల యందు నేను నాది అని అహంకార మమకారము నిరంతరముఉండును. ఈశ్వరునకు అట్లు కాక ఆయా తన మూర్తి యందు తనకు గల అభిమానము భక్తులందు కృపచేత ఏర్పడినది. లోకరక్షణార్థముఆయాకార్యములుచేయువలసిన సమయమందే ఉన్నట్లుగాకేవలముకల్పించబడుచున్నది.ఈవిధముగా జీవాభిమానమునకు ఈశ్వరాభిమానమునకును ఎంతో భేదము కలదు.

మూర్తి స్వరూపం ఈశ్వరం ఉపాసితుం అశక్తానాం శాస్త్రం మూర్తి రూపేణ కల్పితతామ్రాది ప్రతిమోపాసనాం విధత్తే. అత ఏవ ప్రతిమాం కేచిత్ ఈశ్వరబుద్ధ్యాఉపాసతే। సర్వత్ర బ్రహ్మాదిమూర్తిష్వపి తత్తత్ ప్రతిమాస్వపి అన్తర్యామీ పరమేశ్వర ఏక ఏవ, తత్రస్థిత్వా తేషాం ఉపాసకానాం ఫలం దదాతి।

మూర్తిస్వరూపుడైన ఈశ్వరునిఉపాసించుటకు అశక్తులైన వారికి మూర్తి రూపముగా కల్పించబడిన రాగి మొదలగు వానిచే చేయబడిన ప్రతిమల ఉపాసనము శాస్త్రము విధించుచున్నది. కావున ప్రతిమలను కొంతమంది ఈశ్వరభావనతో ఉపాసించుచుందురు. బ్రహ్మాది మూర్తులన్నింటి యందును ఆయా ప్రతిమలన్నిటియందు అంతర్యామి

యైన పరమేశ్వరుడు ఒక్కడే. ఆయా స్థానములయందు ఉండి, ఆయా ఉపాసకులకు ఫలము ఇచ్చును.

"మూఢాః ఈశ్వరస్య సర్వాత్మకత్వం అవిచార్య తత్ర తత్ర ఈశ్వరాః బహవో భిన్నభిన్నతయా వర్తన్తే ఇతి మత్వా అన్యోన్యం కలహాయన్తే। తస్మాత్ అన్తర్యామీ ఈశ్వరః ఏక ఏవేతి జానీహి।

మూఢులు ఈశ్వరుని సర్వాత్మకత్వమును(సర్వత్రఉండుటను) ఆలోచించక అచ్చటచ్చట ఈశ్వరులు చాలమంది వేరువేరుగా ఉన్నారని తలచి శైవులు వైష్ణవులు ఒకరినొకరు కలహించుకొనుచుందురు. కావున అంతర్యామి ఈశ్వరుడు ఒక్కడేనని తెలిసికొనుము.

తర్హి నర్వత్ర ఈశ్వరస్యైకత్వే శాస్త్రమపి తత్తత్ మూర్తి భేదమంగీకృత్యతత్తదుపాసనాభేదం కథం విధత్తే? ఇతి చేత్ బహిర్ముఖానపి శనైఃశనైఃఅన్తర్ముఖాన్ కృత్వా పరమాత్మైవ జీవాత్మా నాన్య ఇతి బోధయిత్వా తేషాం ముక్తిందాతుమేవ అనాదికాలమారభ్యప్రవృత్తం భేదమంగీకృత్య తేషాం బుద్ధిమనుసృత్య భేదేన శాస్త్రం ఉపాసనాం విధత్తే నతు తాత్పర్యేణ। ఏవం ఈశ్వరన్య వరమాత్మనః నమష్టిత్రయం శరీరోపాధినా ఈశ్వరత్వసిద్ధిప్రకారః ఉక్తః।

అంతట నుండు ఈశ్వరుడు ఒక్కడే అయినచో శాస్త్రము కూడా ఆయా మూర్తి భేదములను అంగీకరించి ఆ మూర్తి ఉపాసనలను వేరువేరుగా ఎట్లు విధించుచున్నది అని అనినచో బహిర్ముఖులైన వారిని కూడా నెమ్మది నెమ్మదిగా అంతర్ముఖులను చేసి 'పరమాత్మయే జీవాత్మజీవాత్మయే పరమాత్మ వేరు కాదు' అని బోధించి వారికి ముక్తిని ప్రసాదించుట కొరకే అనాది కాలము నుండి ప్రవృత్తమైన ఈ భేదమును అంగీకరించి వారి వారి బుద్ధులను అనుసరించి భేదముతో శాస్త్రము ఉపాసనను విధించుచున్నది. కాని యథార్థముగా తాత్పర్యముచే మాత్రము కాదు. ఈ విధముగా ఈశ్వరుడైన పరమాత్మునకు సమష్టి శరీర ఉపాధిత్రయముతో ఈశ్వరత్వము సిద్ధించిన విధము చెప్పబడినది.

"అథ ఇదానీం ఏకస్యైవ పరమాత్మనః వ్యష్టి శరీర త్రయ ఉపాధినా జీవత్వసిద్ధి ప్రకారః ఉచ్యతే। వ్యష్టికారణ శరీరోపహితస్య పరమాత్మన ఏవ

ప్రాజ్ఞః, పారమార్థికః, అవిద్యావచ్ఛిన్నః ఇతి నామాని సన్తి। వ్యష్టి సూక్ష్మశరీరోపహితస్య పరమాత్మనః, స్వప్నకల్పితః, తైజసః ప్రాతిభాసికః ఇతి నామాని సన్తి। వ్యష్టి స్థూల శరీరోపహితస్య పరమాత్మనః విశ్వఃవ్యావహారికః చిదాభాసః ఇతి నామాని సన్తీతి జానీహి.

ఇప్పుడు ఏకమైన పరమాత్మకే వ్యష్టిశరీరత్రయ ఉపాధిచేత జీవత్వముసిద్ధించువిధానము చెప్పబడుచున్నది. వ్యష్టి కారణ శరీరము ఉపాధితో కూడిన పరమాత్మకే జీవుడనిపేరు, ప్రాజ్ఞుడని, పారమార్థికుడని, అవిద్యావచ్ఛిన్నుడనియూ పేర్లు కలవు. వ్యష్టి సూక్ష్మ శరీర ఉపాధి కల ఆపరమాత్మకే స్వప్నకల్పితుడు, తైజసుడు, ప్రాతిభాసికుడు అని పేర్లు కలవు. వ్యష్టి స్థూల శరీర ఉపాధి కల పరమాత్మకు విశ్వుడని, వ్యావహారికుడని, చిదాభాసుడని నామములుఉన్నవని తెలిసికొనుము.

అస్య జీవస్య శరీరత్రయమపి కిమర్థ మితిచేత్ ప్రయోజన మస్తి। అంతః కరణ ప్రతిబింబో జీవః। అతో జీవస్య సూక్ష్మశరీరం ప్రథమమావశ్యకమ్। స్థూలశరీరం వినా కర్మకర్తృత్వాభావాత్ స్థూలశరీరమప్యావశ్యకం తస్మాత్ ఇదం కార్యశరీర ద్వయమపి కారణ శరీరం వినా అవస్థాతుం అశక్యమ్। అతఃకారణ శరీరమపి ఆవశ్యకమ్। ఏవం జీవస్య వ్యష్టి శరీరత్రయమపి ఆవశ్యకమ్।

ఈజీవునకు మూడు శరీరములు ఎందులకు అనినచో ప్రయోజనము కలదు.అంతః కరణ ప్రతిబింబము జీవుడు. అందుచే జీవునకు సూక్ష్మశరీరము మొదట అవసరమై ఉన్నది. తర్వాత స్థూలశరీరము కూడా కావలసియున్నది. ఈ రెండు కార్యశరీరములును కారణశరీరము లేకుండా ఉండనేరవు. కనుక కారణ శరీరమును ఆవశ్యకమే. ఈ విధముగా జీవునకు వ్యష్టిశరీరములు మూడును ఆవశ్యకములే.

"అస్య జీవస్య అస్మిన్ వ్యష్టి శరీరత్రయే అభిమానో అస్తి వా నవేతి విచార్యమాణే అభిమానో అస్తి। కథమితిచేత్। జీవస్య కర్మ కర్తృత్వేన, శరీరాభిమానాభావాత్ తత్కర్మకర్తృత్వంనోపపద్యతే। శరీరాభావే జీవత్వమేవ న సంభవతి। తస్మాత్ జీవస్యాభిమానో అస్తి।

ఈ జీవునకు ఈవ్యష్టి శరీర త్రయమందు అభిమానముఉండునా?

లేవా? అని విచారణ చేసినచో అభిమానముఉన్నది. ఎట్లనగా జీవుడు కర్మచేయువాడు. శరీరాభిమానము లేని యెడల అతనికి కర్మచేయుటకుదురదు. అభిమానము లేని యెడల శరీరమే పుట్టదు. శరీరము లేని ఎడల జీవత్వమే సంభవించదు. కావున జీవునకు అభిమానము ఉండును.

" ఏవం పరమాత్మా ఏక ఏవ। వ్యష్టి సమష్ట్యుపాధిభ్యాం జీవేశ్వరభావం గతః। అస్యదృష్టాంతో అస్తివా ఇతి చేత్। యథా ఏకస్యైవ దేవదత్తస్య పుత్రపౌత్రోపాధిభ్యాం పితేతి పితామహ ఇతి నామద్వయమస్తి। తథా అవిద్యామాయోపాధిభ్యాం ఆత్మనః ఏకస్యైవ జీవత్వమీశరత్వం చ సంగతమేవ।

ఈ ప్రకారము పరమాత్మ ఒక్కడే వ్యష్టి సమష్టి ఉపాధులతో జీవేశ్వర భావమును పొందినాడు. ఈ విషయమునకు దృష్టాంతము ఉన్నదా? అనినచో దేవదత్తునకు పుత్రపౌత్రులను, ఉపాధులను బట్టి తండ్రి, తాత అనిఒకనికే రెండు పేర్లెట్లు ఉండునో అట్లే అవిద్యా మాయ ఉపాధుల ద్వారా ఒకే ఆత్మకు జీవేశ్వరత్వములు రెండూ యుక్తమే.

"నను పూర్వోక్త దృష్టాంతే నామద్వయం యుజ్యతే। కించిత్‌జ్ఞత్వ సర్వజ్ఞత్వాది విశిష్టభేదస్య కోవా దృష్టాంతః ఇతిచేత్-దృష్టాంతః అస్తి। ఏకమేవ జలం బృహత్ తటాకస్థం సత్ ఏకగ్రామ సంరక్షణ మహాశక్తిమత్, ఘటస్థంసత్ ఏకగృహ సంరక్షణ మాత్ర అల్పశక్తిమత్ యథా జాతం, అగ్నిరేక ఏవ స్థూల మహావర్తిస్థఃసన్ బహుదూర ప్రకాశక మహాశక్తిమాన్ అల్పవర్తిస్థఃసన్ గృహమాత్రప్రకాశకః అల్పశక్తిమాంశ్చ యథా జాతః, తథా ఆత్మనోఽపి బృహత్ కారణభూత మాయోపాధినా సర్వజ్ఞత్వం, అల్పేన కార్యరూప+ అవిద్యా+ ఉపాధినా కించి జ్ఞత్వం చ సిద్ధం న తు సర్వజ్ఞాత్మా కించి జ్ఞాత్మా ఇతి ఆత్మద్వయమస్తి। అత ఏవ వేదాంతశాస్త్రం తత్పదస్య త్వంపదస్యచ సంబంధ త్రయేణాపి అఖండతాం బోధయతి"।

పూర్వోక్త దృష్టాంతమున ఒకే పరమాత్మకు రెండు పేర్లు కుదురుచున్నవి. కాని కించిజ్ఞత్వ సర్వజ్ఞత్వాది భేదమునకు ఏమి దృష్టాంతము కలదు? అన్నచో దృష్టాంతము కలదు. ఒకే జలము పెద్ద

తటాకమునందుండి ఒక గ్రామమును సంరక్షణ చేయు మహాశక్తి వంతమగుచున్నది. ఆజలమే కుండయందుండి ఒక గృహమును మాత్రము సంరక్షణ చేయు అల్పశక్తికలదగుచున్నది. అగ్ని ఒకటే లావుగ పెద్దవత్తియందుండి చాలా దూరము ప్రకాశము ఇచ్చు గొప్పశక్తికలది గను, చిన్నవత్తియందుండి గృహమును మాత్రము ప్రకాశింపజేయు అల్పశక్తిమాత్రముగలదిగను ఎట్లగుచున్నదో అట్లే ఆత్మకు కూడా మహాకారణమైన మాయోపాధి చేత సర్వజ్ఞత్వము, అల్పమైన కార్యరూప అవిద్య ఉపాధిచే కించిజ్ఞత్వము వచ్చినది. అంతేకాని సర్వజ్ఞాత్మ కించిజ్ఞాత్మ అని రెండు ఆత్మలు లేవు. కనుకనే వేదాంత శాస్త్రము కూడా తత్పదమునకు, త్వం పదమునకు సంబంధత్రయముతో కూడా అఖండ ఏక తాత్పర్యార్థమును బోధించుచున్నది.

"సంబంధత్రయం కిమితి చేత్ పదయోః సామానాధికరణ్య సంబంధః। సహవా పదార్థయోః విశేష్యభావః సంబంధః పదాభ్యాం పదార్థాభ్యాం సహ లక్ష్య లక్షణభావః సంబంధః ఏవం సంబంధత్రయమ్"

సంబంధ త్రయమనగానేమి అన్నచో (1)పదములకు సామానాధి కరణ్య సంబంధము (ఒకే ఒక పదార్థమును బోధించుట) (2) పదార్థములకు విశేషణ విశేష్య భావ సంబంధము (ఒక అర్థమునకు మరొక అర్థమందలిధర్మము ఉండుట). (3) పదములు రెంటి తోడను పదార్థములు రెంటి తోడను ప్రత్యగాత్మకు లక్ష్య లక్షణ భావ సంబంధము రెండు పదములు పరమాత్మను పరోక్షముగా తెల్పుచుండుట అని మూడు సంబంధములు.

"అస్య దృష్టాంతః। సోఽయం దేవదత్తః ఇత్యత్ర ఇదం సంబంధత్రయమస్తి। సః ఇతి శబ్దస్య అయమితి శబ్దస్యచ ఏకో దేవదత్త పిణ్డ ఏవ సమానాధికరణః ఇతి తయోః శబ్దయోః సామానాధికరణ్య సంబధోఽస్తి। తథా తత్పదస్య త్వంపదస్య చ ఏకమేవ చైతన్యం సమానాధికరణమ్। తస్మాత్ పదద్వయస్యాపి సామానాధికరణ్య సంబంధోఽస్తి।

ఈ విషయమునకు దృష్టాంతము ఆతడే - ఈ దేవదత్తుడు (సోయందేవదత్తః ) అను వాక్యమే ఈ వాక్యము నందు సంబంధ త్రయము కలదు. సః (ఆతడు) అను శబ్దమునకు అయం (ఇతడు) అను శబ్దమునకును దేవదత్తుడర్థము ఒకడే. సమానవాచ్యార్థము కనుక ఆరెండు శబ్దములకు సామానాధికరణ్య సంబంధము కలదు. అట్లే తత్ పదమునకు త్వం పదమునకును ఒకే చైతన్యము అర్థము (సమాన వాచ్యార్థము- సమానాధికరణము) కావున రెండు పదములకును సామానాధికరణ్య సంబంధము కలదు.

" తత్కాల తత్ దేశ విశిష్ట వాచక 'స' ఇతిశబ్దార్థస్య, ఏతత్కాల ఏతద్దేశ విశిష్ట దేవదత్త వాచక 'అయం' శబ్దార్థస్యాపి అన్యోన్యభేద వ్యావర్తకత్వేన అన్యోన్యం విశేషణవిశేష్య భావసంబంధోఽస్తి। తథాసర్వజ్ఞత్వ అపరోక్షత్వాది విశిష్ట చైతన్య వాచక తత్పదార్థస్య కించిత్ జ్ఞత్వ పరోక్షత్వాది విశిష్ట చైతన్య వాచక త్వం పదార్థస్యచ అన్యోన్య భేద వ్యావర్తకత్వేన అన్యోన్యం విశేషణవిశేష్య భావః సంబంధోఽస్తి।

ఆకాలము,ఆదేశములతో కూడిన వ్యక్తిని (దేవదత్తుని) బోధించు 'సః (ఆతడే) అను శబ్దార్థమునకును ఈ కాలము ఈ దేశములతో కూడిన వ్యక్తిని (దేవదత్తుని) బోధించు 'అయం' (ఇతడు) అను శబ్దార్థమునకును పరస్పరభేదమును తొలగించు అభేదభావముఉండుటచే అన్యోన్య విశేషణవిశేష్య భావ సంబంధము కలదు. అట్లే సర్వజ్ఞత్వ అపరోక్షత్వాది చైతన్య వాచక "తత్" పదార్థమునకును కించిజ్ఞత్వ పరోక్షత్వాది చైతన్య వాచక''త్వం'' పదార్థమునకును అన్యోన్య భేదమును తొలగించు అభేదభావముండుటచే పరస్పరము విశేష్య విశేషణ భావ సంబంధముఉన్నది.

"సో ఽయం పదయోఃపదార్థయోఃఅఖండార్థ దేవదత్తపిణ్డ మాత్రగ్రహణే విరుద్ధాంశం విహాయ అవిరుద్ధాంశ దేవదత్త మాత్ర లక్షకత్వేన లక్ష్య లక్షణ భావసంబంధో-స్తి। తథా తత్ త్వం పదయోః తత్త్వం పదార్థయోఃవా అఖండ సచ్చిదానంద మాత్ర గ్రహణే విరుద్ధాంశం విహాయ అవిరుద్ధాంశ భూత చైతన్య మాత్ర లక్షకత్వేన లక్ష్యలక్షణభావ సంబంధోఽస్తి।

అతడే ఇతడు (సఃఅయం) అను పదములకును, వాని అర్థములకును అఖండార్థమైన దేవదత్తుడే అర్థముగా గ్రహింపబడినచో విరుద్ధాంశమును విడిచి పెట్టి విరోధము లేని దేవదత్తమాత్రుడను అర్థము పరోక్షముగా తెలియపఱచు లక్షణముఉండుటచే లక్ష్య లక్షక భావ సంబంధము విరుద్ధము కాని చైతన్యమాత్రుడను అర్థమును పరోక్షముగా తెలియపఱచు లక్షణముండుటచే లక్ష్య, లక్షణ భావ సంబంధము కూడా కలదు.

ఇమమేవ లక్ష్య లక్షణ భావ సంబంధం భాగత్యాగలక్షణేతి జహదజహల్లక్షణేతి చ జానీహి। తత్కథమితి చేత్। శాస్త్రేషు వాక్యార్థ గ్రహణే ముఖ్యవృత్తిః గుణవృత్తిః లక్షణావృత్తిరితి వృత్తిత్రయ మస్తి. 'రాజాగచ్ఛతీత్యాది వాక్యార్థే ముఖ్యవృత్తిః, నీలముత్పలమితివాక్యార్థే అగ్నిర్మాణవక ఇత్యాదౌ చ గుణవృత్తిః। లక్షణావృత్తిస్తు త్రివిధా। 1.జహల్లక్షణా 2.అజహల్లక్షణా3. జహదజహల్లక్షణా చేతి। 1.గంగాయాం ఘోషః ప్రతివసతి 2.శోణోధావతి, 3.సోఽయం దేవదత్తః, ఇతి చ క్రమేణ లక్షణావృత్తిత్రయస్య ఉదాహరణ వాక్యాని। ఏతేషు ముఖ్యార్థగ్రహణే విరోధాత్ లక్షణా వృత్తిః స్వీక్రియతే ఇతి జ్ఞేయమ్।

ఈ లక్ష్య లక్షణ భావ సంబంధమును భాగత్యాగలక్షణయని, జహదజహల్లక్షణ అనియు తెలిసికొనుము. అదెట్లనగా? శాస్త్రములందు వాక్యార్థమును గ్రహించుటకై ముఖ్యవృత్తి,గుణవృత్తి, లక్షణావృత్తియను వృత్తి త్రయము చెప్పబడి ఉన్నది. "రాజుగారు వెళ్ళుచున్నారు." అను మొదలగు వాక్యములందు ముఖ్యవృత్తి, నల్లకలువ, ఈబ్రహ్మచారి అగ్నిహోత్రుడుఅను మొదలగు వాక్యములయందు గుణవృత్తి. ఇక లక్షణావృత్తి మూడువిధములుగానున్నది. 1.వాచ్యార్థమును విడిచిన లక్షణ 2.వాచ్యార్థమును విడువని లక్షణ, 3.వాచ్యార్థమును కొంచెము విడిచి కొంచెము విడువని లక్షణ.'1.గంగయందు గొల్లపల్లె కలదు', 2.ఎరుపు పరుగెత్తుచున్నది, 3.అతడే ఈ దేవదత్తుడు' అనునవి క్రమముగా మూడు లక్షణావృత్తులకు ఉదాహరణవాక్యములు వీటిలో ముఖ్యార్థమును

స్వీకరించు విషయమున సామాన్యముగా విరోధమున్నందున లక్షణావృత్తియని చెప్పబడుచున్నదని తెలియవలెను.

తత్త్వం పదయోః వాక్యార్థః లక్ష్యార్థశ్చ కః ఇతి చేత్ ఉచ్యతే। మాయా మాయాప్రతిబింబః, మాయాధిష్ఠానంబ్రహ్మ చ త్రయమపి ఏకీభూయ తత్ పద వాచ్యార్థః,। బ్రహ్మమాత్రం తత్పదలక్ష్యార్థః। అవిద్యా అవిద్యా ప్రతిబింబః అవిద్యాధిష్ఠానసాక్షిచైతన్యం ఏతత్ త్రయమపి వాచ్యార్థః। సాక్షీకూటస్థ చైతన్య మాత్రం త్వం పద లక్ష్యార్థః। తస్మాత్ తత్త్వంపద వాక్యార్థగ్రహణే వాచ్యార్థ జీవేశ్వరయోః విరోధాత్ తయోః విరుద్ధాంశం విహాయ అవిరుద్ధాంశ బ్రహ్మచైతన్యస్య కూటస్థచైతన్యస్యచఏకత్వాత్ బ్రహ్మకూటస్థౌ లక్షయిత్వా, అఖండార్థం తయోః ఐక్యమేవ మహావాక్యేన బోధ్యతే। యథాపుత్ర పౌత్రఉపాధిద్వయపరిత్యాగే పితృపితామహత్వాభావేన ఏకః దేవదత్త ఏవ అవశిష్యతే।మహాతటాక ఘటోపాధి పరిత్యాగే శైత్యద్రవ మధురం జలమ్ ఏవ అవశిష్యతే ,మహావర్త్యల్పవర్తి త్యాగే లోహితోష్ణ ప్రకాశ స్వభావః ఏకఏవ దీపః అవశిష్యతే, తథా మాయా, అవిద్యా, ఉపాధిత్యాగే సచ్చిదానంద స్వభావమేకం ఆత్మవస్త్వేవ అవశిష్యతే !

తత్- త్వంపదములకు వాక్యార్థము లక్ష్యార్థము ఏమి? అని అడిగినచో చెప్పబడుచున్నది. మాయ, మాయా ప్రతిబింబము, మాయాధిష్ఠాన బ్రహ్మమును మూడు ఒకటై "తత్" పద వాచ్యార్థమగును. కేవల బ్రహ్మము తత్ పద లక్ష్యార్థము, అవిద్య, అవిద్యా ప్రతిబింబము, అవిద్యాధిష్ఠాన సాక్షి చైతన్యము. ఈ మూడును ఒకటై త్వం పద వాచ్యార్థము. సాక్షి కూటస్థ చైతన్యమాత్రము త్వం పద లక్ష్యార్థము. కావున తత్త్వం పద వాక్యార్థము ఆలోచించినచో వాచ్యార్థమగు జీవేశ్వరులకు విరోధము కలదు. కావున వారిద్దరిలో గల విరుద్ధాంశమును విడిచి, విరుద్ధాంశము కాని బ్రహ్మచైతన్యమును, కూటస్థ చైతన్యమును ఒక్కటే అయినందున, బ్రహ్మకూటస్థులను లక్ష్యార్థముగా గ్రహించి ఆ ఇద్దరికి, అఖండార్థముగా వారిద్దరికి ఏకత్వమే మహావాక్యము చేత బోధింప బడుచున్నది. ఉదాహరణమునకు పుత్ర, పౌత్రోపాధి ద్వయము విడువగా 'తండ్రి', 'తాత' అను భావము లేకుండుటచే ఒకే ఒక దేవదత్తుడు మిగులును. మహా

తటాక ఘటములను ఉపాధులను విడిచిపెట్టిన చల్లదనము, ద్రవత్వము, మధురత్వము గల జలమే మిగులును. పెద్ద వత్తి చిన్న వత్తులను విడిచినచో ఎరుపు,వేడి ప్రకాశము గల దీపము ఒక్కటే మిగులును, అట్లే సచ్చిదానంద స్వభావమగు ఒకే ఒక ఆత్మ వస్తువు మిగులును.

ఏవం విచార్య పరిపూర్ణస్వభావ ప్రత్యగాత్మైవ మమ స్వరూపమ్। "అహం బ్రహ్మాస్మి" బ్రహ్మైవాహమస్మి, ఇత్యనుభవో యస్య మహానుభావస్య భవతి,స ఏవ ముక్తః, స ఏవ కృత కృత్యఃస ఏవ బ్రాహ్మణ ఇతి సర్వే వేదాన్తాః భేరీ వాద్యవత్ ఘుష్యంతి।

ఇతి మననే సప్తమ వర్ణకం సమాప్తమ్

ఈ విధముగా విచారించినచో, పరిపూర్ణ స్వభావ ప్రత్యగాత్మయే నాస్వరూపము."అహంబ్రహ్మాస్మి""బ్రహ్మైవాహమస్మి'( నేను బ్రహ్మమును, బ్రహ్మమునే నేను.) అను ఈ అనుభవము ఏమహాను భావునకు కల్గునో ఆయనయేముక్తుడు.ఆయనయేకృతకృత్యుడు,ఆయనయే బ్రాహ్మణుడు అనిసమస్తవేదాంతములుభేరీవాద్యముతో మ్రోగించినట్లుఉద్ఘోషించు చున్నవి.

ఇది మననమున ఏడవ వర్ణకము సమాప్తము.

అథ అష్టమ వర్ణకమ్

ఇతఃపరమాత్మనః పూర్వోక్తశరీరత్రయవిలక్షణత్వమ్, అవస్థాత్రయసాక్షిత్వం పంచకోశవ్యతిరిక్తత్వం సచ్చిదానంద స్వరూపత్వమితి చత్వారి లక్షణాని చతుర్భిః వర్ణకైః ఉచ్యన్తే.

ఎనిమిదవ వర్ణకమ్

ఇక తరువాత, ఆపరమాత్మకు పూర్వము చెప్పబడిన శరీరత్రయ విలక్షణత్వము, అవస్థాత్రయసాక్షిత్వము పంచకోశవ్యతిరిక్తత్వము, సచ్చిదానందస్వరూపత్వము అను ఈ నాలుగు లక్షణములు నాలుగు వర్ణకములలో చెప్పబడుచున్నవి.

ఏతేషు శరీరత్రయవిలక్షణత్వం పంచకోశవ్యతిరిక్తత్వం చ వ్యావృత్తి లక్షణమ్. అవస్థాత్రయసాక్షిత్వం తటస్థలక్షణమ్. సచ్చిదానంద స్వరూపత్వం స్వరూపలక్షణమ్. తథా ఆకాశాదిశరీరాన్తదృశ్యజాతం నేతి నేతీతి వాక్యేన

విహాయఅవశిష్టం వస్తు ఆత్మేతి ఏతత్ వ్యావృత్తి లక్షణమ్.అన్య ప్రపంచస్యయత్ అధిష్ఠానం తదాత్మవస్త్వితి తటస్థలక్షణమ్. సచ్చిదానంద పూర్ణం నిత్యం ఆత్మవస్త్వితి స్వరూప లక్షణమ్.

వీటిలో శరీర త్రయ విలక్షణత్వము, పంచకోశ వ్యతిరిక్తత్వము అనునవి ఇతరముల నుండి వేరు పఱచు (వ్యావృత్తి) లక్షణముఅందురు అవస్థాత్రయ సాక్షిత్వము అనునది తటస్థ (తత్కాల)లక్షణము అందురు. సచ్చిదానందస్వరూపత్వము అనునది స్వరూప (వాస్తవ) లక్షణము. ఎటులనగా ఆకాశము మొదలు శరీరపర్యంతము తెలియబడుచున్న దంతయు"ఇదికాదు ఇది కాదు" అను వాక్యముచే విడిచి పెట్టబడి మిగిలి ఉన్న వస్తువు ఆత్మ అని చెప్పుట ఇతరముల నుండి వేరు పర్చుట కావున వ్యావృత్తి లక్షణము. ఈ ప్రపంచమునకు ఏది అధిష్ఠానముగా నున్నదో అదియే ఆత్మవస్తువు అని చెప్పుట తటస్థ లక్షణము. సచ్చిదానందము పూర్ణమునిత్యమైనది ఆత్మ వస్తువు అని చెప్పుట స్వరూప (యథార్థ) లక్షణము.

అస్మిన్ అష్టమవర్ణకే శరీరత్రయవిలక్షణత్వమ్ ఉచ్యతే? శరీరత్రయస్య అజ్ఞానేతద్విలక్షణత్వమపిదుర్జ్ఞేయ మితి ప్రథమతః స్థూలం సూక్ష్మం కారణమితి శరీరం త్రివిధమ్ తత్రసర్వేషాం ప్రత్యక్షం స్తంభవద్వర్తమానంతత్స్థూల శరీరమ్॥ సప్తదశ అవయవాత్మకమ్ సూక్ష్మ శరీరమ్॥ అజ్ఞానమేవ కారణ శరీరమ్॥

ఈ ఎనిమిదవ వర్ణకమున శరీరత్రయ విలక్షణత్వము చెప్పబడుచున్నది. 1.స్థూలశరీరము 2.సూక్ష్మశరీరము 3. కారణశరీరము అని శరీరములు మూడువిధములు శరీరత్రయమును తెలిసి కొనకుండా వాటికంటె ఆత్మ విలక్షణమైనదని తెలియరాదు.ఆత్మకు విలక్షణత్వము కూడా చెప్పబడుచున్నది. అందు అందరికీ ప్రతక్షముగా కరచరణాది అవయములు కలిగి స్తంభమువలె కనబడునది స్థూలశరీరము. పదిహేడు అవయవముల కలది జ్ఞాన కర్మేంద్రియ ప్రాణ మనోబుద్ధులు కలిపి సూక్ష్మశరీరము, అజ్ఞానమే కారణ శరీరము.

ఏతేషాం శీర్యతే క్షీయతే ఇతి వ్యుత్పత్త్యా శరీరమితి నామ ఇదం

స్థూలశరీరం అన్నాభావే శీర్యతే. అన్నే విద్యమానే వ్యాధినా శీర్యతే, తదభావే ఽపి వయః పరిణామేన శీర్యతే. పల్లవమివ సూక్ష్మశరీరమపి కదాచిత్ వర్ధతే కదాచిత్ క్షీయతే. రాగద్వేషాది అంతఃకరణ వృత్తిజృంభణమేవ సూక్ష్మ శరీరస్యవృద్ధిః తేషాంసంకోచేనజీర్ణతా అహం జీవ ఇతివృద్ధిః, అహం బ్రహ్మాస్మీతి సంకోచః అనయోః సూక్ష్మ కారణశరీరయోః ఉక్త రూపా వృద్ధిః తత్సంకోచరూపాఏవజీర్ణతా। కారణశరీరస్యాపి అజ్ఞానిషు దృశ్యతే సంకోచశ్చ జ్ఞానిషు దృశ్యతే ఏవం శరీరత్రయస్యాపి జరాయా దర్శనేన శరీరమితి నామ

ఈ మూటికినశించునవి లేదా శిథిలమై పోవునవి అను వ్యుత్పత్తిని బట్టిశరీరమని పేరు. వీనిలో స్థూల శరీరము అన్నము లేని ఎడల నశించును. అన్నము ఉన్నను వ్యాధులచే నశించును. వ్యాధులు లేకున్నను వయస్సు యొక్క పరిణామముచే నశించును. చిగురుటాకువలె సూక్ష్మశరీరము కూడా ఒకానొకప్పుడు పెరుగును. ఒకానొకప్పుడు నశించును. రాగద్వేషాది అంతఃకరణవృత్తుల విజృంభణమే సూక్ష్మ శరీరము యొక్క వృద్ధి వాటి సంకోచమే శిథిలత్వము. కారణశరీరమునకు కూడ నేను జీవుడను అని అనుకొనుటయే వృద్ధి. నేను పరబ్రహ్మమును. అని తలచుకొనుటయే క్షయము. సూక్ష్మకారణ శరీరములకు పూర్వము చెప్పిన వృద్ధి అజ్ఞానులయందు, క్షీణత జ్ఞానులయందు కనబడుచున్నది. శరీరములు మూటికిని జీర్ణత కనబడుచున్నందున శరీరమనుపేరు సార్థకమైనది

ఏతేషామ్ దేహ ఇతి చ నామ దహ్యాత ఇతి వ్యుత్పత్త్యా ఆగతమ్. లోకే సర్వో ఽపిస్థూలదేహః అగ్నినా దహ్యాతేసూక్ష్మశరీరం కారణ శరీరంచ నకదాచిదపి అగ్నినా దహ్యాతే తత్కథం ఏతేషాం దేహత్వమితి చేత్ అగ్నేరప్యధికేన తాపత్రయేణ సర్వమపి దహ్యాతే అతః శరీరత్రయస్యాపి దేహ ఇతి నామ యుజ్యతే

వీటికి దహింపబడునది అను వ్యుత్పత్తిచేత దేహమను పేరు వచ్చినది. లోకమున నర్వులకునునస్థూలదేహము అగ్నివలన దహింపబడును. కాని సూక్ష్మశరీరముకారణశరీరములు ఒకప్పుడును అగ్నిచేత తగులబడుచున్నట్లు కనబడుటలేదు కదా. వాటికి కూడా దేహమని

పేరు చెప్పుట ఎట్లు కుదురును అని అడిగినచో అగ్ని కంటెను అధికమైన తాపత్రయముఅనెడి అగ్నిచే అన్నియు తగులబడుచున్నవి. కనుక మూడు శరీరములకును దేహములు అనెడి పేరు కుదురును.

స్థూలశరీరస్యస్తంభవత్స్థూలభూతకార్యత్వేనస్థూలత్వమ్సూక్ష్మస్య స్థూలశరీరవత్ స్థూలత్వాభావాత్సూక్ష్మభూతజన్యతావచ్చసూ క్ష్మత్వం, లీనం శబ్దార్థంగమయతీతి లింగమితినామ అస్యాగతమితిజ్ఞేయమ్ హేస్వామిన్, పూర్వమ్ స్థూలసూక్ష్మశరీరద్వయమపి పంచ భూతేభ్యః ఉత్థితమిత్యుక్తమ్ తథైవాత్మనః శరీరత్వేఅజ్ఞానం కారణమిత్యుక్తమ్ ఇదానీం సృష్టౌ యుగపత్ సర్వస్యాపి అజ్ఞానం కారణమితి సర్వం కారణశరీరాదుత్థితమితి కథముచ్యతే ఇతి చేత్ శృణు! అధ్యారోపసృష్టౌతథా పంచభూతేభ్యః ఉత్థిత మిత్యుక్తమ్.తథైవాత్మనః శరీరత్వే అజ్ఞానమ్ కారణమితి యుగపత్ సృష్టౌ సర్వస్యాపిజగతః అజ్ఞానమేవ కారణమితి కృత్వా శరీరద్వయస్యాపి అజ్ఞానమేవ కారణమిత్యుక్తమ్

స్థూలశరీరమునకు స్తంభమువలె స్థూలభూతకార్యముకాన స్థూలశరీరమనిపేరు సూక్ష్మశరీరానికి స్థూలత్వము లేదుకాన సూక్ష్మభూతములచే పుట్టినది కాన సూక్ష్మ శరీరము అని పేరు దాగియున్నదానిని సూచించునది. కాన దీనికి లింగ శరీరమనిపేరు ఓస్వామీ ! పూర్వము స్థూల సూక్ష్మ శరీరములు రెండు పంచభూతముల నుండి పుట్టినవని తాము చెప్పియున్నారు. అటులనే ఆత్మను శరీరమనుకొనుటకు అజ్ఞానము కారణమని చెప్పియున్నారు. ప్రస్తుతము సృష్టిని గూర్చిచెప్పుచు ఒకేసారి అన్నిటికిని అజ్ఞానమే కారణమని, అంతయు కారణశరీరమునుండి వచ్చినదని ఎట్లు చెప్పుచున్నారు ? అనినచో వినుము అధ్యారోపసృష్టియందు (క్రమసృష్టి పక్షమున) పంచభూతములనుండి స్థూల సూక్ష్మశరీరములు వచ్చినవని పూర్వము చెప్పబడినది ఆత్మను శరీరమనుకొనుటకు కూడా అజ్ఞానమే కారణము అనియు పూర్వము చెప్పబడినది. కాని ఈ యుగపత్ సృష్టిపక్షమున జగత్తుఅంతటికిని అజ్ఞానమే కారణము కనుక రెండు శరీరములకు అజ్ఞానమే కారణమని చెప్పబడినది.

కథం క్రమ సృష్టిః కథం వా యుగపత్ సృష్టిః ఇతిచేత్ ఉచ్యతే మూల ప్రకృతిః, అవిద్యా,మాయా, ఆవరణమ్ విక్షేపః, ఆకాశః,వాయుః, అగ్నిః, ఆపః పృథివీ ఇతి క్రమేణోత్పత్తికథనం క్రమ సృష్టిఃసర్వోఽపిప్రపంచః ఆత్మాజ్ఞానేన జాతః ఇతికథనం యుగపత్సృష్టిః

క్రమముగా సృష్టియగుట క్రమ సృష్టి ఒకేసారి సృష్టియగుట యుగపత్ సృష్టి. ఎటుల క్రమసృష్టి ఎటుల ఒకేసారి సృష్టి అని అనినచో చెప్పబడుచున్నది. మూలప్రకృతి, అవిద్య, మాయ, ఆవరణము,విక్షేపము, ఆకాశము,వాయువు, అగ్ని,జలము, పృథ్వి అని క్రమముగా ఉత్పత్తి చెప్పుట క్రమ సృష్టి.సర్వప్రపంచము, ఆత్మను తెలిసికొనకపోవుట చేతపుట్టినది అని చెప్పుటయుగపత్సృష్టి అగును.

స్థూలస్యప్రత్యక్షేణ అనుభూయమానత్వాత్ తత్ర న సందేహః, సూక్ష్మ శరీరస్య బహిరప్రతీతేః తదస్తీతి జ్ఞానం కథం జాయతే? శృణు।సప్త దశకరణకార్యైః తత్ సూక్ష్మ శరీరమ్ జ్ఞాతుం శక్యం తత్ సప్తదశ కరణ కార్యమపి స్థూలశరీరేణ కర్తుం న శక్యతే కుత ఇతిచేత్ సుషుప్తి, మూర్ఛా,మరణేషు స్థూలశరీరే విద్యమానే ఽపి సప్తదశ కరణ కార్యాణా మదర్శనాత్జాగ్రత్స్వప్నయోః తత్కార్యదర్శనాత్స్థూల శరీరవ్యతి రేకేణసప్తదశావయత్మకం లింగశరీరమ్ అస్త్యేవేతి అవగన్తవ్యమ్.

స్థూల శరీరము ప్రత్యక్షముగా అందరికి అనుభవమై యున్నందున ఇందు సందేహము లేదు. సూక్ష్మశరీరముబయట కనబడుట లేనందువలన అది ఉన్నదను జ్ఞానము ఎటుల కలుగును అని అడిగినచో వినుము పదిహేడు కరణముల (ఇంద్రియముల) కార్యములచే (వ్యాపారములచే) సూక్ష్మ శరీరము కూడా తెలిసికొనుటకు శక్యముగానే ఉన్నది. ఆపదిహేడు కరణముల కార్యములను కూడ స్థూల శరీరమే చేయుటకు వీలు ఉన్నప్పటికి ఈ పదిహేడు కరణముల కార్యము లేదు కనబడుట లేదు. కాన స్థూలశరీరము కంటె వేరుగా పదిహేడు అవయవములు కలిగిన లింగ శరీరము ఒకటి ఉన్నదని యుక్తిచే తెలియవలయును.

ఇదం స్థూల శరీరం సూక్ష్మశరీరం వినానకదాచిదపి కార్యం కరోతి అథ ఉభయమపి దర్శనాదికార్యం కరోత్వితి చేత్ వివేకేన విచార్యమాణే

దర్శనాది కార్యం సకలమపి సూక్ష్మశరీరసాధ్యమేవ నతు స్థూలశరీర సాధ్యమ్ కథమితి చేత్ కాష్ఠమాశ్రిత్యాగ్నిః దాహపాకాది కర్మకరోతి, కాష్ఠాభావే న కరోతి, తథాపి అగ్నికార్యమేవ దాహపాకాది నతు కాష్ఠ కార్యమ్ తథా స్థూల శరీరమాశ్రితేన సూక్ష్మశరీరేణ క్రియమాణమపి దర్శనాదికం సూక్ష్మకార్యమేవ, నతు స్థూలకార్యమ్ అతో దర్శనాదికార్యేణ అనుమేయంసప్తదశావయవం సూక్ష్మశరీరమితి యుక్తమ్.

ఈ స్థూల శరీరము సూక్ష్మ శరీరము లేకుండా ఎప్పుడును ఏ పనిని కూడా చేయలేదు. స్థూల సూక్ష్మములు రెండు కలసి చూచుట మొదలైన కార్యములను చేయవచ్చును కదా అన్నచో వివేకముతో విచారణ చేయగా చూచుట మొదలైన కార్యమంతయు సూక్ష్మశరీర సాధ్యమే కాని స్థూల శరీరసాధ్యము కాదు. ఎట్లనినచో కట్టెను ఆశ్రయించి కాని అగ్నికాల్చుట,పచనముచేయుటమున్నగుకర్మను చేయుచున్నది. కట్టెలేనియెడల,చేయలేదు. అయినను కాల్చుట వండుట మున్నగు క్రియ అగ్నికార్యమేకాని కట్టెపనికాదు. అటులనే స్థూలశరీరమును ఆశ్రయించి సూక్ష్మశరీరము సూక్ష్మ శరీరమే దర్శనాది క్రియను చేయుచున్నప్పటికి అది సూక్ష్మ శరీర కార్యమే కాని స్థూల శరీరకార్యము కాదు కావున చూచుట మొదలైన కార్యముల చేత (అనుమానప్రమాణముచే) తెలియబడి పదిహేడు అవయవములు కలిగిన సూక్ష్మశరీరము తప్పక యున్నదని చెప్పుట యుక్తము.

జ్ఞానేంద్రియపంచకమ్, కర్మేంద్రియపంచకమ్, ప్రాణ పంచకమ్ మనోబుద్ధిః చేతి సప్తదశావయవాః। ఏతత్ సప్త దశాంగం సూక్ష్మశరీరం ॥ శ్రోత్ర, త్వక్, చక్షుః, జిహ్వా,ఘ్రాణాని జ్ఞానేంద్రియాణి శబ్ద, స్పర్శ, రూప,రస,గంధాః। తేషాం విషయాః జ్ఞాన సాధనత్వాత్ జ్ఞానేంద్రియాణి సుఖప్రకాశాభివ్యంజక సత్త్వ గుణ కార్యత్వాత్ ఏతేషాం జ్ఞానసాధనత్వమ్. వాక్,పాణి,పాద, పాయు, ఉపస్థాఃకర్మేంద్రియాణి.వచన ఆదాన, ఆగమన, విసర్గ ఆనంద రూప క్రియాత్వేన తేషాం కర్మేంద్రియత్వంచంచలమలిన రజోగుణ కార్యత్వేన క్రియాసాధనత్వమ్। ప్రాణ అపాన, వ్యాన ఉదాన

సమానాః ప్రాణాః।ఉచ్ఛ్వాస నిశ్వాసాది వ్యాపారైః శరీర ధారకత్వాత్ బలప్రదత్వాత్ చ తేషాం ప్రాణ సంజ్ఞా. తాదృశ సామర్థ్యం చ తేషాం రజోగుణ జన్యత్వాత్ ఇతి జ్ఞేయమ్। విమర్శాత్మికా అన్తఃకరణవృత్తిః మనః, నిశ్చయాత్మికా అన్తః కరణ వృత్తిః, బుద్ధిః ఏవమ్ సూక్ష్మ శరీరస్య సప్తదశావయవాః।

జ్ఞానేంద్రియ పంచకము, కర్మేంద్రియ పంచకము, ప్రాణ పంచకము, మనస్సు, బుద్ధి అని పదిహేడు అవయవములు. ఈ పదిహేడు అవయువములేసూక్ష్మశరీరము।శ్రోత్రేంద్రియము,త్వగింద్రియము, చక్షురింద్రియము,జిహ్వేంద్రియము, ఘ్రాణేంద్రియము అనునవి జ్ఞానేంద్రియములు వీటి విషయములు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు. ఈ విషయములను తెలిసికొను సాధనములైనందున జ్ఞానేంద్రియములని పేరు. సుఖమును ,ప్రకాశము తెలుపు సత్త్వగుణ కార్యమైనందున వీటికిజ్ఞానసాధనత్వముకలిగినదివాక్,పాణి,పాద, పాయు,ఉపస్థలు కర్మేంద్రియములు. మాటలాడుట, ఇచ్చిపుచ్చుకొనుట నడచుట, విసర్జించుట ఆనందించుట అను క్రియలకు సాధనములైనందువలన వీటికి కర్మేంద్రియములని పేరు. చంచలత్వము, మలినత్వము గల రజోగుణము యొక్క కార్యమైనందున వీటికి క్రియాసాధనత్వము చెప్పబడినది. ప్రాణ, అపాన, వ్యాన ఉదాన సమానములని ప్రాణ పంచకము ఉచ్ఛ్వాస నిశ్వాసాది వ్యాపారముల చేత శరీరమును నిలువ బెట్టుటవలనను దానికి బలమును ఇచ్చుట వలనను వీటికి ప్రాణములని పేరు. అట్టి సామర్థ్యము రజోగుణము వలన,పుట్టుట వలననే వాటికి ఉన్నదని తెలియవలెను. విమర్శచేయు అంతఃకరణవృత్తియే మనస్సు నిశ్చయాత్మక అంతః కరణ వృత్తియే బుద్ధి. ఈ విధముగా సూక్ష్మశరీరమునకు పదిహేడు అవయవములని చెప్పబడినవి.

లోకే ఏకస్మిన్ వస్తుని జ్ఞాతవ్యే ఉద్దేశో లక్షణమ్, పరీక్షాచేతి ఉపాయత్రయమస్తి। తత్ర వస్తునామ గ్రహణ మాత్రమ్ ఉద్దేశః

లోకమందు ఒక వస్తువును తెలిసికొనుటకు ఉద్దేశము లక్షణము

పరీక్ష అని మూడు ఉపాయములు కలవు. అందు వస్తువు యొక్క పేరు మాత్రము గ్రహించుట తెలిసికొనుట ఉద్దేశము

వస్తు స్వరూప గ్రహణం లక్షణమ్। వస్తు స్వరూప విచారః పరీక్షా

స్వరూపమును గుర్తుతో గ్రహించుట లక్షణము. వస్తు స్వరూప విచారణయే పరీక్ష.

సప్త దశావయవ నామ గ్రహణ ఉద్దేశో జాతః। ఇతః పరమ్ లక్షణమ్ పరీక్షాంచ వదామః।

పదిహేడు సూక్ష్మ శరీరపు అవయవములకు పేర్లు తెలిసినవి ఇక లక్షణమును చెప్పి పరీక్షను చేయవలెను. దానినే చెప్పుదుము.

లక్షణమ్ నామ అవ్యాప్తి అతివ్యాప్తి అసంభవాఖ్య దోషత్రయ రహిత ధర్మః।

అవ్యాప్తి,అతివ్యాప్తి, అసంభవము అను మూడు దోషములు లేనిధర్మమే లక్షణము.

లక్ష్యైకదేశే లక్షణస్య అవర్తనం అవ్యాప్తిః యథా కపిలా గౌరితి.

కపిల వర్ణము కలది ఆవు అనినచో కొన్ని ఆవులయందే ఉండి కొన్ని ఆవుల యందు ఆ కపిలత్వము లేకుండుటచే అవ్యాప్తి.

అలక్ష్యే లక్షణస్య వర్తనమ్ అతివ్యాప్తిః। యథా చతుష్పాద్గౌః ఇతి।

లక్ష్యము కాని వాని యందు (చెప్పదలచిన చోటకాక చెప్పకూడనిచోట) లక్షణముఉండుట అతివ్యాప్తి నాలుగు పాదములు కలిగినది ఆవు అని చెప్పినచో ఆలక్షణముఆవుకే కాక ఇతరములకును ఉండును కదా!

లక్ష్యమాత్రే లక్షణస్య అవర్తనమ్ అసంభవః యథా ఏకశఫా గౌరితి!

చెప్పదలచిన వాటిలో ఏఒక్కదానికిని లక్షణము వర్తించకుండా ఉండుట అసంభవము ఒక్క గిట్ట గలది ఆవు అని చెప్పినచో ఏ ఆవునకును ఆలక్షణముఉండదు కనుక అది అసంభవము.

దోషత్రయరహితఅసాధారణధర్మః లక్షణమ్। యథా సాస్నాదిమత్త్వం

ఈమూడు దోషములు లేనటువంటి అసాధారణ ధర్మము

ఉదాహరణకు గోవునకు గంగడోలుండుట లక్షణము.

జ్ఞానేంద్రియాణాం కిం లక్షణమితి చేత్ శృణు క్రమేణ కథయిష్యామః।

జ్ఞానేంద్రియములకు లక్షణమేమిటి అనినచో వినుము క్రమముగా చెప్పెదము.

దిగధిష్ఠానదేవతయా(ప్రేరితమ్ సత్ కర్ణ శష్కుల్యవచ్ఛిన్ననభోదేశే స్థిత్వా అష్టాదశభాషాణాం వేదశాస్త్రాణామ్ చ ఇదమిత్థమితి జ్ఞాత్ర యదింద్రియం తత్ శ్రోత్రేంద్రియమ్। పరీక్షా కీదృశీతిచేత్, ఇత్థమ్. కర్ణశష్కుల్యవచ్ఛిన్నం నభోవిద్యమానమపి శబ్దం నగృహ్ణాతి। తస్మాత్ తదన్యదితి పరీక్షా।

దిక్కుఅను అధిష్ఠానదేవతచే ప్రేరితమై చక్కిలము వంటి చెవిని ఆశ్రయించి ఆకాశమందు ఉండి పదునెనిమిది విధములైన భాషలను వేదశాస్త్రము'లను ఏశబ్దములనైనను స్పష్టముగా తెలిసికొను ఇంద్రియమే శ్రోత్రేంద్రియము (చెవి) దీని పరీక్ష ఎటుల అనినచో ఇట్లు, ఈశబ్దమును చక్కిలము వంటి చెవినాశ్రయించిన ఆకాశమే తెలిసికొన వచ్చుననన్నచో సుషుప్తిమూర్ఛమరణాదిసమయమునందు కూడా చక్కిలమువంటి చెవినాశ్రయించిన ఆకాశము ఉండనే ఉన్నది. కాని శబ్దమును గ్రహించుట లేదు. కావున ఆకాశముకంటె వేరుగా శ్రవణేంద్రియము ఉన్నదని యుక్తితో ఆలోచించి నిర్ణయించుటయే పరీక్ష.

త్వగింద్రియం కిమితిచేత్ వాయు రూపాధిష్ఠాన దేవతయా ప్రేరితమ్ సత్ త్వచం సర్వత్ర వ్యాప్య శీతం, ఉష్ణం, మృదు, కఠినం కర్కశం ఇత్యనేకవిధం స్పర్శం యత్ జానాతి తత్త్వగింద్రియం త్వగేవ జానాత్విత్యుక్తే సుషుప్త్యాదిషు త్వచి విద్యమానాయామపి స్పర్శం న జానాతి తస్మాత్ న తత్త్వగింద్రియం

త్వగింద్రియమనగానేమి? అనినచో వాయువనే అధిష్ఠాన దేవతచే ప్రేరితమై చర్మమునందంతట వ్యాపించి శీతము ఉష్ణము, మృదుత్వము కఠినత్వము కర్కశత్వము మొదలైన అనేకవిధస్పర్శలను ఏది

తెలిసికొనుచున్నదో అది త్వగింద్రియము. చర్మమే తెలిసికొనవచ్చును కదా అనినచో కాదు. సుషుప్త్యాదులయందు చర్మము ఉన్నప్పటికి స్పర్శను తెలిసి కొనుట లేదు. అందువలన చర్మమే త్వగింద్రియము కాదు.

చక్షురింద్రియం కిమితి చేత్ సూర్యరూపాధిష్ఠానదేవతయా ప్రేరితం సత్ కృష్ణతారాగ్రం ఆశ్రిత్య నీలం, పీతం, శ్వేతం, రక్తం హరితం, ధవళం, స్థూలం,, సూక్ష్మం, హ్రస్వం,దీర్ఘం ఇత్యుక్తబహురూపంయత్ జానాతి తత్ చక్షురింద్రియమ్। కృష్ణతారాగ్రమేవ జానాత్వితిచేత్ సుషుప్త్యాదిషు। తద్విద్యమానమపి తద్రూపం న జానాతి। తస్మాత్ తత్ న చక్షురింద్రియమ్।

చక్షురింద్రియమనగా నేమి? అనినచో సూర్యుడనుఅధిష్ఠాన దేవతచే ప్రేరితమై నల్ల గ్రుడ్డు యొక్క చివరను ఆశ్రయించి నీలము పసుపు తెలుపు, ఎరుపు, ఆకుపచ్చ తెల్లని తెలుపు, లావు,సన్నము, పొడవు, పొట్టి మొదలగు బహురూపములను ఏది తెలిసికొనుచున్నదో అది చక్షురింద్రియము. కృష్ణ తారాగ్రమే తెలిసికొనవచ్చును కదా అనినచో సుషుప్త్యాదులయందు నల్లని గ్రుడ్డు ఉన్నప్పటకినీ అదిరూపమును తెలిసికొనుట లేదు. కావున నల్ల గ్రుడ్డే చక్షురింద్రియము కాదు.

రసనేంద్రియంకిమితి చేత్, వరుణరూపాధిష్ఠాన దేవతయాప్రేరితం సత్ జిహ్వాగ్రమాశ్రిత్య మధురతిక్తామ్లాది ష డ్ర సాన్ యత్ జానాతి తత్ రసనేంద్రియమ్।రసనమేవ జానాత్వితి చేత్ సుషుప్త్యాదిషు రసనామాత్రమ్ విద్యమానమపి రసం న జానాతి। అతః నతత్ రసనేంద్రియమ్।

రసనేంద్రియ మనగా నేమి? వరుణుడనే అధిష్ఠానదేవతచే ప్రేరితమై జిహ్వాగ్రమును ఆశ్రయించి మధురము,పులుపు తీపి,మొదలగు షడ్విధములైన రుచులను తెలిసికొనుట లేదు. కావున నాలుకయే రసనేంద్రియము కాదు.

ఘ్రాణేంద్రియం కిమితిచేత్ అశ్విన్యాదిదేవతయా ప్రేరితం సత్ నాసాగ్ర మాశ్రిత్య సుగంధం దుర్గంధం యత్ జానాతి తత్ ఘ్రాణేంద్రియం। నాసాగ్ర మేవ జానాత్వితి చేత్ సుషుప్తావిద్యమానమపి తత్ గంధం నైవజానాతి। తస్మాత్ న తత్ ఘ్రాణేంద్రియమ్।ఏవం జ్ఞానేంద్రియలక్షణాని।

ఘ్రాణేంద్రియమనగానేమి? అనినచో అశ్విని దేవతలచే ప్రేరితమై ముక్కు చివరను ఆశ్రయించి సుగంధమును దుర్గంధమును ఏది తెలిసి కొనుచున్నదో అదిఘ్రాణేంద్రియము . నాసాగ్రమే తెలిసికొనుచున్నదనినచో సుషుప్త్యాదులయందు అది ఉన్నప్పటికి గంధమును తెలిసికొనుట లేదు. కావున నాసాగ్రమే ఘ్రాణేంద్రియము కాదు. ఇవి జ్ఞానేంద్రియముల యొక్క లక్షణములు.

ఇతఃపరం కర్మేంద్రియ లక్షణముచ్యతే।అగ్నిరూపాధిష్ఠాన దేవతయా ప్రేరితమ్ సత్ తాలుమూలం ఉత్తరాధరోష్ఠం కంఠం హృదయం నాభిమేవమాదిస్థానానిదేవతయా ఆశ్రిత్య పూర్వోక్త శబ్దభేదాన్ యదుచ్చరతి తత్ వాగింద్రియమ్ సుషుప్త్యాదౌ తాల్వాదికం విద్యమానమపి అక్షరాణి నోచ్చరతి! తస్మాత్ న తద్వాగింద్రియమ్!

ఇక కర్మేంద్రియ లక్షణాలు చెప్పబడుచున్నవి.అగ్ని రూప అధిష్ఠానదేవతచే ప్రేరితమై దవడలను పైక్రింది పెదవులను కంఠమును హృదయమును,నాభి మొదలైన స్థానములను ఆశ్రయించి పూర్వము చెప్పబడిన వివిధ శబ్దములను ఏది పలుకు చున్నదో అది వాగింద్రియము సుషుప్త్యాదులయందు తాలు మూలాదులు (దవడలు మున్నగునవి) ఉన్నప్పటికి అక్షరములను పలుకుట లేదు కావున అది వాగింద్రియము కాదు.

ఇంద్రరూపాధిష్ఠానదేవతయాప్రేరితం సత్కరతల మాశ్రిత్యఆదానాది క్రియాంయత్ కరోతి తత్ పాణీంద్రియం, సుషుప్త్యాదౌ విద్యమానమపి కరతలమ్ ఆదానాది న కరోతి। అతో నతత్ పాణీంద్రియమ్।

ఇంద్రరూపఅధిష్ఠానదేవతచే ప్రేరితమై కరతలమును(అరచేతిని) ఆశ్రయించి ఇచ్చిపుచ్చుకొనుట మున్నగు క్రియలను ఏది చేయుచున్నదో అదే పాణీంద్రియము. సుషుప్త్యాదులయందు కరతలము ఉన్నప్పటికి అది ఏమియు చేయుట లేదు కావున అది పాణీంద్రియము కాదు.

ఉపేంద్రరూపాధిష్ఠానదేవతయా ప్రేరితం సత్ పాదతలమాశ్రిత్య గమనం యత్ కరోతి తత్ పాదేంద్రియం, సుషుప్త్యాదౌ విద్యమానమపి పాదతలం గమన క్రియాం న కరోతి। అతో న తత్ పాదేంద్రియమ్।

ఓం నమో భగవతే వాసుదేవాయ

ఉపేంద్రరూపఅధిష్ఠాన దేవతచేప్రేరితమై పాదతలము ఆశ్రయించి గమనము ఏది చేయుచున్నదో అది పాదేంద్రియము. సుషుప్త్యాది స్థితుల యందు పాదతలమున్నను గమన క్రియను చేయుట లేదు. అందువలన పాదతలమే(అడుగే) పాదేంద్రియముకాదు.

మృత్యురూపాధిష్ఠాన దేవతయా ప్రేరితం సత్యోనింగ శుక్రశోణిత మాశ్రిత్య మలవిసర్జనాదికం యత్ కరోతి తత్ పాయు ఇంద్రియమ్ సుషుప్త్యాదౌవిద్యమానమపి యోనిలింగం తత్ న కరోతి, అతో న తత్ పాయు ఇంద్రియమ్

మృత్యురూప అధిష్ఠాన దేవతచే ప్రేరితమై గుద స్థానమును ఆశ్రయించి ఏది మలవిసర్జనాదికము చేయునో అది పాయువను ఇంద్రియము , సుషుప్త్యాదులలో గుదమున్నను విసర్జన చేయుటలేదు. కాన అది పాయు ఇంద్రియము కాదు.

ప్రజాపతిరూపాధిష్ఠానదేవతయాప్రేరితం సత్ యోనిలింగమాశ్రిత్య శుక్ల శోణిత మూత్ర విసర్జనాదికం యత్ కరోతి తత్ ఉపస్థేంద్రియమ్। సుషుప్త్యాదౌ యోనిర్లింగంచ విసర్జనమ్ న కరోతి! అతోన తదుభయం ఉపస్థేంద్రియమ్ ఏవం లక్షణాన్యుక్తాని

ప్రజాపతి రూపఅధిష్ఠాన దేవతచే ప్రేరితమై యోనిలింగములను ఆశ్రయించి శుక్లశోణిత మూత్ర విసర్జనాదికము ఏది చేయుచున్నదో అది ఉపస్థేంద్రియము.సుషుప్త్యాదులయందు యోని లింగములున్నను మూత్రవినర్జనాదికమును చేయుట లేదు. కావున ఆ రెండే ఉపస్థేంద్రియములుకావు. ఈ విధముగా కర్మేంద్రియలక్షణములు చెప్పబడినవి.

అథ ప్రాణ పఞ్చకస్య లక్షణముచ్యతే।

ఇప్పుడు ప్రాణపంచకము యొక్కలక్షణము చెప్పబడుచున్నది.

విశిష్టనామకాధిష్ఠానదేవతయా ప్రేరితః సన్ యో హృది స్థిత్వా ఉచ్ఛ్వాసం కరోతి స ప్రాణః.

విశిష్టుడను అధిష్ఠానదేవతచే ప్రేరితమై ఏది హృదయస్థానమునందుండి ఉచ్ఛ్వాసము చేయుచున్నదో (గాలిని పీల్చుకొనుచున్నదో)అది ప్రాణము.

విశ్వసృష్టనామకాధిష్ఠానదేవతయా ప్రేరితఃసన్ గుదే స్థిత్వా యో నిశ్వాసం కరోతి సః అపానః

విశ్వసృష్టుడను అధిష్ఠాన దేవతచే ప్రేరేపితమై గుదస్థానమందుండి ఏది నిశ్వాసను చేయుచున్నదో (గాలిని వదులు చున్నదో) అది అపానము.

విశ్వయోని నామకాధిష్ఠాన దేవతయా ప్రేరితః సన్ అంతః బహిశ్చ శరీరే స్థిత్వా ఇంద్రియాణాం బలం యచ్ఛన్ యోవర్తతే సవ్యానః

విశ్వయోని అను అధిష్ఠాన దేవతచే ప్రేరితమై లోపల బయట శరీరమంతా ఉండి ఇంద్రియములకు బలమునిచ్చుచూ ఏది శరీరమంతా వ్యాపించి యుండునో అది వ్యానము.

యఃఅజనామకఅధిష్ఠానదేవతయా ప్రేరితః సన్ కంఠేస్థిత్వా సుషుప్తౌ ఇంద్రియాణాం గోళకేషు లయంకారయిత్వా జాగ్రతి పునఃఇంద్రియాణి గోళకేషు ప్రాపయ్య ఉత్క్రమణ కాలే ఇంద్రియాణి గృహీత్వా లోకాన్తరమ్ గచ్ఛతి స వాయుః ఉదానః

అజుడు అను పేరుగల అధిష్ఠానదేవతచే ప్రేరితమై కంఠస్థాన మందుండి సుషుప్తి యందు ఇంద్రియములను ఆయాగోళములందు లయము చేసి జాగ్రత్ దశయందు తిరిగి ఇంద్రియములను తీసుకొని ఏది లోకాంతరమును చేర్చునో అది ఉదానము.

యో జయ నామక అధిష్ఠాన దేవతయా ప్రేరితః సన్ నాభిదేశే స్థిత్వా భక్ష్య భోజ్యలేహ్య చోష్య రూప చతుర్విధాన్నం జఠరాగ్నౌ పాచయిత్వా శరీరపుష్టిం కరోతి స సమాన వాయుః ఏవం పంచ ప్రాణాః శ్రూయన్తే

జయుడను పేరుగల అధిష్ఠాన దేవతచే ప్రేరితమై నాభిదేశమందుండి భక్ష్య భోజ్య లేహ్యచోష్యరూప చతుర్విధ అన్నమును జఠరాగ్నియందు పచనము చేయించి ఏది శరీరమునకు పుష్టిని కలిగించుచున్నదో అది సమానము.ఇవి పంచప్రాణములుగా ప్రసిద్ధములైవ్యవహరింప బడుచున్నవి.

నాగ కూర్మ కృకర దేవదత్త ధనంజయాః ఉపవాయవః ఏతేషామపి పూర్వోక్త పంచ ప్రాణేష్వేవ అన్తర్భావః

నాగ కూర్మ కృకర దేవదత్త ధనంజయములను పేర్లు గల్గినవి ఉపవాయువులు. ఇవియు పూర్వము చెప్పబడిన పంచప్రాణములయందే అంతర్భావమగుచున్నవి.

తత్ర నాగో వాక్తతిం కరోతి । కూర్మః ఉన్మీలనం కరోతి। నిమీలనం చ। అధరోత్తరోష్ఠయోః సంయోగం విభాగం చ। కృకరః క్షుతం కరోతి। దేవదత్తః విజృంభణం కరోతి। ధనంజయః శరీరస్య ఉచ్ఛూనతాం కరోతి.

నాగ వాయువు వాక్కులను పలికించును. కూర్మవాయువు రెప్పలు తెరుచుట మూయుటలను పెదవులను కలుపుట,విడతీయుటలను చేయును. కృకరవాయువు తుమ్ముపచ్చునట్లు చేయును.దేవదత్త వాయువు ఆవులింతలను, ఒళ్ళువిరుపులను చేయును. ధనంజయ వాయువు శరీరమును ఉబికించును.

ఇతః పరమ్ అన్తఃకరణ చతుష్టయమ్ ఉచ్యతే। మనఃబుద్ధిఃచిత్తం అహంకారః ఇతి తత్ జానీహి। తత్ర మనఃచంద్రేణ అధిష్టితం సత్ కంఠం ఆశ్రిత్య స్థిత్వా సంకల్ప వికల్పౌకరోతి. బుద్ధిః చతుర్ముఖేన అధిష్ఠితా సతీ ముఖమాశ్రిత్య స్థిత్వానిశ్చయం కరోతి. అహంకారః రుద్రేణ అధిష్ఠితః సన్ హృదయం ఆశ్రిత్య అభిమానం కరోతి! చిత్తం క్షేత్రజ్ఞరూపవిష్ణునా అధిష్ఠితం సత్ నాభౌ స్థిత్వా అవధారణం కరోతి. ఏతత్ లింగశరీరమ్.

ఇక అంతఃకరణచతుష్టయము గురించి కూడా చెప్పబడుచున్నది. మనస్సు,బుద్ధి,చిత్తము,అహంకారము అని నాలుగువిధములని తెలియవలెను. వానిలో మనస్సు చంద్రుని చేత అధిష్ఠితమై కంఠమందుండి సంకల్పములను చేయును. బుద్ధి చతుర్ముఖునిచే అధిష్ఠితమై ముఖముఅశ్రయించి నిశ్చయమును కల్గించును. అహంకారము రుద్రునిచే అధిష్ఠితమై హృదయమును ఆశ్రయించి అభిమానము చేయును. చిత్తము క్షేత్రజ్ఞరూపుడగు విష్ణువును అధిష్ఠించి నాభియందుండి అవధారణమును (ఇది ఇంతే, ఇంతకన్నా వేరు కాదు అను నిర్ధారణమును) చేయును. ఇదియే లింగ శరీరము.

తత్రకాచిత్ శ్రుతిః తత్ షోడశాత్మకమ్ వదతి తత్ పక్షే అన్తఃకరణమ్

ఏకమితి జానీహి। పునరన్యా(శ్రుతిః సప్త దశాత్మకమ్ వదతి. తస్మిన్ పక్షె మనో బుద్ధిరితి తత్ ద్వివిధమితి జానీహి। పునరన్యా(శ్రుతిః ఏకోనవింశాత్మకమ్ వదతి। తత్పక్షేఅన్తఃకరణమ్ మనః, బుద్ధిః, అహంకారః చిత్తమ్ ఇతిచతుర్విధమ్ తదితి జానీహి॥ ఏవమ్చతుర్విధమన్తఃకరణం పంచ జ్ఞానేంద్రియాణి, పంచ కర్మేంద్రియాణి, పంచ ప్రాణాశ్చ లింగ శరీరమితి నిర్ణయః।

ఈ లింగ శరీర విషయమున ఒక శ్రుతి దానిని షోడాశాత్మకమని చెప్పుచున్నది. ఆ పక్షమున అన్తః కరణమును ఒకటిగా తెలిసికొనుము. ఇంకొక శ్రుతి సప్తదశాత్మకముగా చెప్పుచున్నది. ఆ పక్షమున మనస్సు, బుద్ధిఅని అన్తఃకరణము రెండుగా విభజింపబడినదని తెలిసికొనుము. మరొక శ్రుతి సూక్ష్మశరీరమును పందొమ్మిది అవయవములు కలదిగా చెప్పుచున్నది. ఆ పక్షమున మనస్సు,బుద్ధి,చిత్తము, అహంకారము అని అంతఃకరణము నాలుగువిధములని తెలిసికొనుము. ఈ విధముగా చతుర్విధాంతః కరణమువంచజ్ఞానేంద్రియవములు,వం చకర్మేంద్రియవములు, పంచప్రాణములు కలసి లింగశరీరమని నిర్ణయము.

ఇదానీమ్ కారణశరీరముచ్యతే అజ్ఞానమేవ కారణశరీరమ్। స్థూలసూక్ష్మశరీరకారణత్వాత్, ఇదం జీవేశ్వరయోఃప్రథమం శరీరమ్ తస్యైవ పశ్చాత్ భావిశరీరకారణత్వమ్ తస్మిన్ అర్థే ప్రమాణం కిమితి చేత్ అజ్ఞానం కారణ శరీరమితి శ్రుతిః వదతి।కార్యేణ కారణమ్ ఊహ్యతే ఇతి యుక్తిః అహమ్ అజ్ఞః ఇతి అనుభవః।

ఇక కారణశరీరము గురించి చెప్పబడుచున్నది. అజ్ఞానమే కారణశరీరము.స్థూల శరీరమునకు కారణమైనందున ఇది జీవేశ్వరులకు ప్రథమశరీరము తరువాత పుట్టబోవులింగస్థూలశరీరములకు కారణమగుట దాని లక్షణము. అజ్ఞానము కారణ శరీరము అని అనుటకు ప్రమాణమేమి అనినచో అజ్ఞానము కారణశరీరమని శ్రుతి చెప్పుచున్నది. కార్యము చేత కారణము ఊహింపబడును అని దీనికి యుక్తి ఉన్నది. నేను అజ్ఞానిని అనెడి అనుభవము కూడా ఉన్నది.

హే స్వామిన్! ఆత్మాకః ఇత్యుక్తే శరీరత్రయవిలక్షణ ఇతి బోధయితుం ప్రథమతః శరీరత్రయలక్షణైః బోధితం కిల, ఏవమేవాత్మాపి లక్షణైః బోధయితవ్యః ఇతి చేత్ శృణు । సర్వత్ర పరిపూర్ణం బ్రహ్మ। తదేవ ప్రత్యగాత్మ స్వరూపమితి సకలోపనిషదోవదన్తి। తస్మాత్ ఆత్మా సచ్చిదానంద స్వరూప ఏ వేతి జానీహి।

హే స్వామిన్! ఆత్మయనగా నేమి? అని చెప్పుట ప్రారంభించి ఆత్మ శరీరత్రయ విలక్షణమైనదని చెప్పుటకై మొదట శరీరత్రయము లక్షణములతో బోధింపబడినది. ఇట్లే ఆత్మకూడ లక్షణములతో బోధింపబడవలెను కదా! అనినచో వినుము అంతటానిండి పరిపూర్ణమై ఉన్నది బ్రహ్మము. అదియే ప్రత్యగాత్మ స్వరూపమని సకల ఉపనిషత్తులు చెప్పుచున్నవి.కావున ఆత్మసచ్చిదానందస్వరూపమని తెలిసికొనుము.

సత్కిమ్, చిత్కిమ్, ఆనందమ్ కిమితి చేత్। బాధరహితమ్ సత్। స్వప్రకాశమ్ చిత్ । స్వానుభూతిః ఏవ ఆనంద ఇతి జానీహి। ఏవమాత్మా సచ్చిదానందస్వరూపః।

సత్ అనగా నేమి? చిత్ అనగానేమి? ఆనందమనగానేమి? అని అనినచో బాధలేనిది (మూడుకాలములందుమార్పు వినాశనము లేనిది) సత్తు, స్వయం ప్రకాశ స్వభావమైనది చిత్తు, స్వానుభూతియే ఆనందము అని తెలిసికొనుము. ఈ విధముగా ఆత్మ సచ్చిదానందస్వరూపము.

అనాత్మాతు అనృత,జడ, దుఃఖ స్వరూపః।.ఆత్మానాత్మనోః అన్యోన్యవైలక్షణ్యం కథం జ్ఞాతవ్యమితిచేత్, యథా పురుష లక్షణం స్త్రియామ్ నాస్తి,స్త్రీ లక్షణమ్ పురుషే నాస్తి,ఏవమేవ సత్ లక్షణమ్ అనృతే నాస్తి। అనృత లక్షణం సతి నాస్తి। యథా ప్రకాశ లక్షణం అంధకారే నాస్తి,అంధకారలక్షణం ప్రకాశే నాస్తి ఏవం చిత్ లక్షణం జడే నాస్తి జడలక్షణం చితినాస్తి।యథా చంద్రికాలక్షణం ఆతపే నాస్తి, ఆతప లక్షణం చంద్రికాయాం నాస్తి, ఏవం ఆనందలక్షణం దుఃఖే నాస్తి। దుఃఖలక్షణం ఆనందే నాస్తి, ఏవం జ్ఞాతవ్యామ్

అనాత్మఅనృత,జడ,దుఃఖాత్మకము ఆత్మ అనాత్మలకు పరస్పర భేదము ఎట్లు తెలియదగును అనినచోఎట్లు పురుష లక్షణము స్త్రీయందును, స్త్రీ లక్షణము పురుషుని యందును ఉండదో అట్లే సత్

లక్షణము అనృతము నందును, అనృత లక్షణము సత్తు యందును ఉండదు. ఎట్లు ప్రకాశలక్షణము అంధకారమునందును, అంధకార లక్షణము ప్రకాశమునందును ఉండదు అట్లే చిత్తులక్షణము జడమునందును, జడలక్షణము చిత్తుయందును ఉండదు. ఎట్లు వెన్నలలక్షణము ఎండయందును, ఎండలక్షణము వెన్నల యందును ఉండదో అట్లే ఆనందలక్షణము దుఃఖమునందు,దుఃఖలక్షణము ఆనందమునందును ఉండదు. ఇట్లుఆత్మానాత్మ భేదమును గ్రహింపవలెను.

సచ్చిదానందానాం అనృత జడదుఃఖానాం చ విస్తరేణ లక్షణాని జ్ఞాతవ్యానీతిచేత్। శృణు వదామః। కాలత్రయేऽపి కేనాపి, అబాధ్యమానమేకరూపం సత్। కాలత్రయేऽపి మిథ్యాభూతమపి సత్యమివ భానమానం విచార్యమాణే బాధ్యమానమసత్। అస్య దృష్టాంతః। మందాంధకారే వర్తమానా రజ్జుఃస్వారోపితసర్పమాల్యనీరంధ్ర జలధారాదివత్అబాధ్యమానా భ్రాంతేః పూర్వకాలే పశ్చాత్ కాలే, భ్రాంతి కాలేచ ఏకరూపా వర్తతే। అధ్యస్త సర్పాది తు కాలత్రయేऽపి స్వయం మిథ్యా భూతం అవిద్యమానమపి విద్యమానమివ ప్రతీయతే। ప్రమాతుః పరమార్థ విచారేణబాధ్యతే। ఏవం భూతరజ్జులక్షణమ్ సర్పాదౌ నాస్తి। అతః అన్యోన్యం 1)శబ్దేన 2)అర్థేన 3)లక్షణేన 4) ప్రతీత్యా 5) వ్యవహారేణ పంచభిః ప్రకారైః వైలక్షణ్యం యథా అనయోరస్తి తథా సల్లక్షణమ్ అసల్లక్షణే దేహాది ప్రపంచే నాస్తి, అసల్లక్షణం చ ప్రత్యగాత్మని నాస్తి। తస్మాత్ అన్యోన్యం శబ్దేన అర్థేన ప్రతీత్యా లక్షణేన వ్యవహారేణచ పంచభిః ప్రకారైః వైలక్షణ్యమస్తి। తస్మాత్ ఏవమ్ విచార్య సతః అనృతస్య చ వైలక్షణ్యం జానీహి।

సచ్చిదానందములకు అనృతజడదుఃఖములకును వివరముగా లక్షణములు తెలిసికొనవలయును. కదా! అనినచో వినుము. చెప్పుచున్నాము. మూడు కాలములయందును ఏ ఇతర ధర్మము చేతను బాధింపబడనిదై ఏకరూపముతోనుండునది సత్తు. మూడుకాలముల యందును వాస్తవముగా లేనిదైనప్పటికిని, ఉన్నట్లు భాసించుచు, విచారణచేసినచో చివరకు లేకుండా పోవునది అసత్తు. దీనికి దృష్టాంతము

మసకచీకటియందు త్రాడు తనయందారోపింపబడిన సర్పము పూలమాల నీటిధారలవలె మార్పుచెందక భ్రాంతికిముందు, భ్రాంతికి తరువాత, భ్రాంతిసమయమునకు ఒకేరూపముగా నుండును. అధ్యస్తము చేసిన (ఆరోపింపబడిన) సర్పాదులు అట్లుకాకత్రికాలములయందును స్వయముగా లేనివేయైనను ఉన్నవానివలె కనబడుచున్నవి. ప్రమాత యొక్క యథార్థపరిశీలనచే బాధింపబడి చివరకు త్రాడేమిగులును. ఈ రజ్జులక్షణము సర్పాదులయందు లేదు. కాగా పరస్పరము శబ్దము ద్వారా,అర్థము ద్వారా లక్షణము ద్వారా తెలియుట ద్వారా శబ్ద ప్రయోగము ద్వారా అను ఈ అయిదు విధములు త్రాడుకును సర్పాదులకును ఎట్లుభేదము ఉన్నదో అట్లేసత్తులక్షణము అసద్రూపమగు దేహాది ప్రపంచమునందును అసత్తు లక్షణము ప్రత్యగాత్మయందును లేదు. అందువలన ఈ సదసత్తులకు పరస్పరము శబ్దఅర్థప్రతీతి లక్షణవ్యవహారములచే అయిదు విధములుగా సదసత్తులకు భేదము విలక్షణత్వము కలదు. కావున ఈ విధముగా విచారణ చేసి సత్తునకును,అనృతమునుకును విలక్షణత్వమును(భేదమును)తెలిసి కొనుము.

ఇతఃపరం చితో జడస్య చ వైలక్షణ్యముచ్యతే। సూర్యాదిప్రకాశ మనపేక్ష్య స్వప్రకాశేనైవ ప్రకాశమానం స్వారోపితస్య జడస్యా-పి ప్రకాశమ్, అత ఏవ సూర్యాది ప్రకాశ పదార్థం మృచ్ఛిలాదిఅప్రకాశ్య పదార్థం చ ప్రకాశయతి యద్వస్తు, తత్‌చిత్। జడలక్షణం కీదృశమితి చేత్। స్వయం అప్రకాశమానం అన్యపదార్థస్య ప్రకాశనే అసమర్థం యత్ తత్ జడమ్।

ఇక చిత్తుకు జడమునకును విలక్షణత్వము(భేదము) చెప్పబడుచున్నది. సూర్యుడు మున్నగు వాని ప్రకాశమును అపేక్షింపకుండా తనప్రకాశముచేతనే ప్రకాశించునదియు తన యందు ఆరోపితమైన జడమును మృత్తు,శిలమున్నగు ప్రకాశములేని పదార్థములనుఏది ప్రకాశింపచేయుచున్నదో అది చిత్తు. జడలక్షణమేమనినచో స్వయముగాప్రకాశము లేక ఏది మరియొకపదార్థమును కూడా ప్రకాశింపచేయుసామర్థ్యము లేనిదో అది జడము.

అత్ర ఉభయదృష్టాంతః। యథా ఆదిత్యః ప్రకాశాన్తరఅనపేక్షం స్వయమేవప్రకాశమానఃసన్‌ప్రకాశసంబంధిఘటపటాదిపదార్థమపి ప్రకాశయతి తథా చిత్-ప్రకాశః। యథా ఘటాదిపదార్థః స్వయం అప్రకాశమానః అన్యపదార్థమపి ప్రకాశయితుం అసమర్థః తథా జడవస్త్వపీతి జానీహి యథా ఆదిత్యస్యఘటాదేశ్చ శబ్దాదిపంచప్రకారైః వైలక్షణ్యం, ఏవమ్ చితో, జడస్య చ వైలక్షణ్యమ్।

ఈ రెండు విషయములకు దృష్టాంతము సూర్యుడు ఇంకొక ప్రకాశమును అపేక్షింపకుండా స్వయముగా ప్రకాశమానుడగుచు తన ప్రకాశమునకు సంబంధించిన ఘటపటాది సమస్త పదార్థములను ఎట్లు ప్రకాశింపచేయునో అట్లే చిత్‌ప్రకాశము స్వప్రకాశము. ఘటాది పదార్థములు స్వయముగాప్రకాశములేనివైయుండి మరియొక పదార్థములను గూడ ప్రకాశింపచేయుటకు ఎట్లు అసమర్థములై ఉండునో అట్లే జడవస్తువు కూడా అప్రకాశము అని తెలిసికొనుము. ఎట్లు సూర్యునికి ఘటాదులకును శబ్దాది. పంచ ప్రకారములతో విలక్షణత్వము (భేదము) ఉండునో అటులనే చిత్తుకును జడమునకును విలక్షణత్వము (భేదము) ఉన్నది.

ఏవం జ్ఞానస్యకిం ఫలమితి చేత్‌। లోకే ప్రకాశ్య పదార్థ నిష్ఠ వికారాః ప్రకాశవస్తు కాల త్రయే ఽపి న స్పృశంతి ఇతి జ్ఞానం ఫలమ్.

ఈ (వైలక్షణ్య) భేదజ్ఞానమునకు ఏమి ఫలము అనినచోలోకమందు ప్రకాశింపబడు పదార్థములయందుండు మార్పులుప్రకాశకవస్తువును ఏ కాలమునందును స్పృశించవు అని తెలియుట ఈ భేద జ్ఞానమునకు ఫలము

తత్ కథమితి చేత్ ఆదిత్యేన ప్రకాశమానఘటాదినిష్ఠచ్ఛిద్రేణహానిః అచ్ఛిద్రేణలాభః, స్పర్శేన త్యాజ్యత్వమ్, అస్పర్శేన గ్రాహ్యత్వమ్,లక్షణేన హర్షః అలక్షణేన విషాదః, సమీచీనతయా అతిశయః, అసమీచీనతయా అనతిశయః, ఇత్యాది వికారగుణాః ప్రకాశకమాదిత్యం న స్పృశంతి, ఏవమ్ ఆత్మప్రకాశ్యమానదేహేంద్రియాది నిష్ఠనామ,రూప,జాతి, వర్ణాశ్రమప్రవృత్తి,నివృత్తి,విధి,నిషేధ షడ్భావవికార, షడూర్మి,షట్కోశ అంధ్యపైత్త్యాది సకలగుణవికారాశ్చ ప్రకాశకమాత్మానం కాలత్రయేఽపి

కించి దపి స్పృష్టుం న-శక్నువంతి ఇతి జ్ఞానం సుకరమితి జానీహి। ఏవమ్ చిత్జడయోః వైలక్షణ్యమ్।

అజ్ఞానమెట్లుండుననినచోసూర్యునిచేప్రకాశింపబడు కుండ మొదలగువానికి రంధ్రముచే హాని కాని, రంధ్రములు లేకుండుట వలన లాభము కాని,స్పర్శ వలన విడువవలసియుండుట కాని అస్పర్శచే గ్రహింపదగుట కాని మంచిలక్షణముచే సంతోషము కాని అలక్షణము లేకుండుటచే బాధ కాని మంచితనముచే గొప్పతనము కాని చెడు తనముచే హీనతగాని ఈ మొదలైన వికారగుణములు ప్రకాశింపచేయు ఆదిత్యునితాకవు. ఇట్లే ఆత్మచేత ప్రకాశింపజేయబడు దేహేంద్రియాదులయందలి నామ,రూప.జాతి,వర్ణ,అశ్రమ,ప్రవృత్తి, నివృత్తి, విధి,నిషేధ షడ్భావవికారములును షడూర్మ్మలును;షట్కోశములు గ్రుడ తనము పైత్యము మున్నగు సకలగుణ వికారములు ప్రకాశింపచేయు ఆత్మను ఏ కాలమునందునూ కొంచెముకూడా స్పృశించజాలవని తెలిసికొనుటయే ఈ భేదజ్ఞాన ఫలమని తెలిసికొనుము. ఈ విధముగా చిత్తు జడములకు విలక్షణత్వము (భేదము)స్పష్టముగా తెలిసినది.

ఇతఃపరం ఆనందస్య దుఃఖస్య చ వైలక్షణ్యం ఉచ్యతే। ఆనంద లక్షణం కిమితి చేత్ నిరుపాధికమ్,నిరతిశయమ్,నిత్యమ్ యత్ సుఖమ్ తదానందః। దుఃఖలక్షణం కిమితి చేత్। ప్రతికూలతయా వేదనీయత్వం ఇతరేచ్ఛానధీనేచ్ఛావిషయభిన్నత్వే సతి ద్వేషవిషయత్వమ్ వా।అతః ఇతర ద్వేషానధీనద్వేషవిషయత్వమ్;

ఇక ఆనందమునకు దుఃఖమునకును గల విలక్షణత్వము (భేదము) చెప్పబడుచున్నది. అనంద లక్షణ మేమి అనినచో నిరుపాధికము నిరతిశయము నిత్యము అయిన ఏ సుఖము శ్రుత్యాదివేద్యమోఅదియే ఆనందము. దుఃఖ లక్షణమేమి అనినచో ప్రతికూలముగా భావింపబడినదగుట ఇతరములఇచ్ఛకు అధీనమైన ఇచ్ఛకు విషయమైన దానికి వేరైద్వేషింపబడనదగుట కాని దుఃఖ లక్షణము( ఒక కోరిక మీద ఆధారపడి కోరబడేది కానిది, వద్దను కొనబడునది దుఃఖమని అర్థము.)తత్తు

త్రివిధమ్। ఆధ్యాత్మికం ఆధిభౌతికం ఆధిదైవికం చేతి తత్ర ఇంద్రియైః దేహఏవ వాత,పిత్త,శ్లేష్మ వైపరీత్యేన జాయమానం వ్యాధ్యాదిదుః ఖమాధ్యాత్మికమ్। భూతైఃభౌతికైః చ సర్పవ్యాఘ్రాదిభిః జాయమానమ్ దుః ఖం ఆధిభౌతికమ్। దేవైఃదైవేనవా జాయమానం అతివృష్టి, అనావృష్టి, విద్యుత్పాతాది దుఃఖం ఆధిదైవికమ్ ఇతి।

ఆ దుఃఖము ఆధ్యాత్మికము, ఆధిభౌతికము, ఆధిదైవికము అని మూడు విధములు అందు ఇంద్రియముల చేత దేహమునందు వాత,పిత్తశ్లేష్మ వైపరీత్యముచే కలుగు వ్యాధులు మున్నగు రూపమున ఉండు దుఃఖము ఆధ్యాత్మికము. భూతములచే భౌతికముల చేత సర్పవ్యాఘ్రాదుల చేతను కలుగు దుఃఖము ఆధి భౌతికము. దేవతలచే గాని దురదృష్టవశమున గాని కలుగు అతివృష్టి,అనావృష్టి,పిడుగుపాటు మొదలగు దుఃఖము ఆధిదైవికము.

ఆనందస్య దుఃఖస్య చ వైలక్షణ్యే కో దృష్టాంత ఇతిచేత్। ఉచ్యతే। యథాఅమృతం, సుఖరూపం, సత్ స్వమనుభవతో జీవానపి సుఖయతి,కాలకూట విషం, స్వయం తాపకం సత్ స్వమనుభవతో జీవానపి పీడయతి।ఏవం తయోః అమృతవిషయోః అన్యోన్యం శబ్దాది పంచప్రకారైః యథావైలక్షణ్యమ్,ఏవమ్ ఆనందలక్షణం తాపత్రయాత్మక దుఃఖేనాస్తి, దుః ఖలక్షణమపి, ఆత్మస్వరూపే ఆనందే నాస్తి। తస్మాత్ శబ్దాది పంచ ప్రకారైః అనయోః వైలక్షణ్యంజానీహి।

ఆనందమునకు దుఃఖమునకును భేదమును గుర్తించుటకు దృష్టాంతము ఏమి? అనినచో చెప్పబడుచున్నది.ఎట్లు అమృతము సుఖరూపమై తనను అనుభవించు జీవులకును సుఖమును ఇచ్చుచునే ఉండునో, కాలకూటవిషము స్వయముగా తపింపచేయునదై తననుఅనుభవించు జీవులను పీడించుచునే యుండునో అమృత,విషములరెంటికి పరస్పరము శబ్దాదిపంచప్రకారములచే విలక్షణత్వము ఎట్లు కలదో,అట్లే ఆనందలక్షణము తాపత్రయాత్మక దుః ఖమునందును దుఃఖలక్షణము ఆత్మస్వరూపఆనందమందును లేదు. కావున ఈ రెంటికిని శబ్దాదిపంచ ప్రకారములచే అన్యోన్యవిలక్షణత్వము

(భేదము) ఉన్నట్లు తెలిసికొనుము.

అత్ర । నిష్కృష్టార్థః (సిద్ధార్థః) కః ఇతి చేత్। రజ్జువత్ సద్రూపః। ఆదిత్యవత్ చిద్రూపః। అమృతవత్ ఆనందరూపః అహం శబ్దార్థం ఆత్మా సర్పవత్ అనృతాత్, ఘటవత్, జడాత్,విషవత్,దుఃఖాత్ భిన్నం దేహేంద్రియాది ప్రపంచాత్ విలక్షణఃఇతియో గురు ముఖాత్ ఆత్మానం జానాతి స ఏవ అసంగః కృతకృత్యః స ఏవముక్తఇతి సకల వేదాన్తనిశ్చయః ఇతిజానీహి।

ఇతి వాసు దేవమననే అష్టమవర్ణకం సమాప్తమ్।

ఇక ఈ విషయమున తేలిన సారాంశము ఏమనినచో త్రాడువలె సద్రూపమును,సూర్యునివలె చిద్రూపమును, అమృతమువలె ఆనందరూపమును అగు "నేను" అను శబ్దమునకుఅర్థమైన ఆత్మ సర్పమువలె ఉండు అసత్యమునుండి కుండవలెఉండు జడము నుండి విషమువలె నుండు దుఃఖము కంటె వేరై దేహేంద్రియాది రూపమగు ప్రపంచమునకు భిన్నమైనది అని ఎవరు గురుముఖముగా తనను తెలిసికొనునో ఆతడే అసంగుడు ఆతడే కృతకృత్యుడు ఆతడే ముక్తుడు అని సమస్త వేదాంతముల నిశ్చయమని తెలిసికొనుము.

ఇట్లు మననమందు ఎనిమిదవవర్ణకము సమాప్తము.

అథనవమ వర్ణకమ్

ఆత్మా శరీరత్రయ విలక్షణః అవస్థాత్రయసాక్షీ పఞ్చకోశవ్యతిరిక్తః సచ్చిదానందలక్షణః ఇత్యాత్మనః ఉక్తేషు చతుర్విధలక్షణేషు శరీరత్రయవిలక్షణత్వమ్ అష్టమవర్ణకే ఉక్తమ్ ఇతఃపరమ్ అవస్థాత్రయసాక్షిత్వమ్ అస్మిన్ నవమవర్ణకే ఉచ్యతే

తొమ్మిదవ వర్ణకము

ఆత్మ శరీరత్రయవిలక్షణమైనది. అవస్థాత్రయమునకు సాక్షియైనది. పంచకోశములకంటె భిన్నమైనది. సచ్చిదానందలక్షణము కలది అని ఆత్మ గురించి చెప్పిన నాలుగులక్షణములలో శరీరత్రయవిలక్షణత్వము ఎనిమిదవవర్ణకమున చెప్పబడినది. ఇపుడు అవస్థాత్రయసాక్షిత్వము అనెడి

లక్షణమును ఈ తొమ్మిదివ వర్ణకమునందు చెప్పబడుచున్నది.

మనఃసత్త్వరజస్తమోగుణాత్మకమ్।తథాపిసత్త్వగుణప్రధానేన సాత్త్వికేనైవ మనసా ఆత్మా జ్ఞాతవ్యః,నచ రాజసేన నాపి తామసేన। తత్ర సత్త్వగుణః సూక్ష్మః।రజోగుణః చంచలః। తమోగుణః స్థూలః।తస్మాత్ ధూమప్రవేశయోగ్యే రంధ్రే బృహత్ స్తంభో యథా న ప్రవిశతి। వాయునా చలితదీపప్రకాశే సూక్ష్మవర్ణోనిర్ణేతుం యథా నశక్యతే। తథైవాత్మని జ్ఞాతవ్యే సతి సూక్ష్మ మనసైవసాత్త్వికేన జ్ఞాతవ్యః అన్యథా స్థూలమనసా చంచలమనసా చ సూక్ష్మస్యాత్మనః స్వరూపం కించిదపి న జ్ఞాయతే। తస్మాదవధానేనశృణు।

మనస్సు సత్త్వరజస్తమోగుణాత్మకమైనది. అయినను సత్త్వ గుణమే ప్రధానముగా గల సాత్త్వికమనస్సు చేతనే ఆత్మ తెలియదగినది. రాజసము చేతకాని తామసము చేతగాని అది తెలియబడదు. అందు సత్త్వగుణము సూక్ష్మము. రజోగుణము చంచలము. తమోగుణము స్థూలము. ధూమప్రవేశయోగ్యమగు చిన్నరంధ్రమున గొప్పస్తంభము ఏవిధముగా ప్రవేశింపదో వాయువుచేత చలించిన దీప ప్రకాశమునందు సూక్ష్మవర్ణము నిర్ణయించుటకు ఏ విధముగా శక్యము కాదో ఆ విధముగనే ఆత్మను తెలిసికొనవలసియుండగా సూక్ష్మమైన మనస్సుచేత లేక సాత్త్విక మనస్సు చేతనే ఆత్మను తెలసికొనవలెను. అట్లు కాకుండా స్థూలమనస్సుచే గాని, చంచల మనస్సుచే గాని సూక్ష్మమైన ఆత్మయొక్క స్వరూపము కొంచెముకూడా తెలిసికొనుటకు వీలు కాదు. కావున ఏకాగ్రతతో వినుము.

ఆత్మనో-వస్థాత్రయసాక్షిత్వం। కథమితిచేత్ శృణు।

ఆత్మకు అవస్థాత్రయ సాక్షిత్వము ఎట్లు అనినచో వినుము.

అవస్థాత్రయంచజాగ్రదవస్థా,స్వప్నావస్థా,సుషుప్త్యవస్థాచేతి।తేషు సకలేంద్రియైః బాహ్యా-ర్థావలంబః జాగ్రదవస్థా।జాగ్రద్ వాసనయాఅన్తః కరణస్యభోక్తృత్వభోగ్యత్వాదిపరిణామఃస్వప్నావస్థా।స్థూలసూక్ష్మజగతః సర్వస్యాపి కారణే అజ్ఞానేలయానంతరం అజ్ఞానమాత్రస్య కేవల సాక్షివేద్యస్య అవస్థానం సుషుప్తిః

అవస్థాత్రయము అనగా జాగ్రత్ స్వప్న సుషుప్తులు అని మూడు

అవస్థలు. అందు సకలేంద్రియములచే బాహ్యవిషయములను అనుభవించుటయే జాగ్రదవస్థ,జాగ్రత్‌వాసన చేత అన్తఃకరణమునకు భోక్తృత్వము (అనుభవించుట) భోగ్యత్వము (అనుభవింపబడుట) మున్నగురూపముతో మార్పుచెందుట స్వప్నావస్థ. స్థూల సూక్ష్మజగత్తుఅంతయు కారణమైన అజ్ఞానమునందు లయించిన తరువాత అజ్ఞానము మాత్రమే కేవల సాక్షికి తెలియబడి ఉండు అవస్థ సుషుప్త్యవస్థ.

ఏవమ్ అవస్థాత్రయ సాక్షిత్వమాత్మనః కథమితిచేత్।ఆత్మని సాక్షి లక్షణస్య విద్యయమానత్వాదితి బ్రూమః।

అవస్థాత్రయ సాక్షిత్వము ఆత్మకు ఎట్లు? అనినచో ఆత్మయందు సాక్షి లక్షణము ఉండుట వలననే అని చెప్పుదుము.

సాక్షిలక్షణం కథమితి చేత్। లోకే ఏకస్యపురుషస్య అన్యదీయావస్థాయా అవస్థావ్యాపారాణామ్ అన్యస్య తస్య చ అవస్థావతః వినాశ రాహిత్యేన సాక్షాత్ ద్రష్టృత్వం సాక్షిత్వం। యథా తూష్ణీమవస్థితస్య సన్యాసినః తత్రాగత పురుష తదవస్థా తద్వ్యాపారాణామ్ నిర్వికారేణ సాక్షాత్ ద్రష్టృత్వం సాక్షిత్వమ్।

సాక్షి లక్షణ మెట్టిది? అనినచో లోకమందు ఒకానొక పురుషుడు అన్యుల పరిస్థితులను ఆ పరిస్థితులలో వారి వ్యాపారములను ఆయా పరిస్థితులు కల ఆ వ్యక్తులను మార్పు (నాశనము) లేకుండా చూడగలుగుటయే సాక్షిత్వము. ఉదాసీనముగా ఉన్న ఒక సన్యాసి తన ఎదుటకు వచ్చిన పురుషుని అతని అవస్థను అతని వ్యాపారములను ఏ వికారము లేకుండా ప్రత్యక్షముగా చూచుచుండునో అట్లు చూచుచుండటయే సాక్షిత్వము.

ఆత్మాపి జీవానాం అవస్థాత్రయం అవస్థా వ్యాపారాంశ్చ అవస్థావతో, జీవాంశ్చ సాక్షాత్ పశ్యన్నపి నిర్వికారేణ అవతిష్ఠతే।

ఆత్మ కూడా జీవుని యొక్క అవస్థాత్రయమును అవస్థావ్యాపారములను ఆయా అవస్థలుగల జీవులను స్వయముగా చూచుచున్నను నిర్వికారముగా ఉండును.

ఇదమేవ సాక్షిత్వం దృష్టాంత పూర్వకమ్ పునరపి కథ్యతే,శృణు।ఏక

మహానగరవత్ జాగ్రదవస్థా। తత్ర ప్రాకారవత్ స్వప్నావస్థా తదంతః ప్రాసాదవత్సుషుప్త్యవస్థా।తత్ర తదభిమాని ప్రభువత్ అవస్థాత్రయాభిమానీ జీవః। యథా స ప్రభుః ప్రాకారాత్ బహిర్వర్తమాన ప్రియాప్రియే అనుభూయ ప్రాకారాంతశ్చ హర్షం విషాదం చ ప్రాప్య తతః ప్రాసాదే ఆగత్య సర్వాన్ వ్యాపారాన్ విహాయ తూష్ణీం స్త్రియా సహ సుఖమనుభవన్ ఆస్తే, ఏవం జీవాత్మాపిస్థూలశరీరఅభిమానీ జాగ్రదవస్థాయాం త్రివిధకరణవ్యాపారయుక్తః సన్ విశ్వోభూత్వా, సూక్ష్మశరీరాభిమానీ స్వప్నావస్థాయాం మనోమయ త్రివిధకరణైఃగుణ దోష వ్యాపారాదియుక్తః సన్, సుషుప్త్యవస్థాయాం త్రివిధకరణ గుణముపసంహృత్య ప్రాజ్ఞోభూత్వానిత్యానందం అనుభవన్ అస్తి।

ఈ సాక్షిత్వవే దృష్టాంతపూర్వకముగా మరల చెప్పబడుచున్నది.వినుము ఒక మహానగరమువంటిది జాగ్రదవస్థ అందు ప్రాకారము వంటిది స్వప్నావస్థ. అందు లోపలి భవనమువంటిది సుషుప్త్యవస్థ. దానిని అభిమానించు ప్రభువు వలె అవస్థాత్రయమును తనవిగాఅనుభవించువాడు జీవుడు. ఎటులనగా? ఆ ప్రభువు ప్రాకారమునకు బయటకి వచ్చి అచటి ప్రియాప్రియములను అనుభవించి ప్రాకారములోపల హర్షవిషాదములనుపొంది తదుపరి భవనములోనికి వచ్చి అన్నివ్యాపారములను విడిచి ఎట్లుఉదాసీనముగా భార్యతో కూడి సుఖమనుభవించునో,అట్లే జీవాత్మకూడా స్థూల శరీరాభిమానియై జాగ్రదవస్థయందు మూడు కరణముల వ్యాపారము కలిగినవాడై తైజసుడుగా ఉండి పిదప కారణ శరీరాభిమానియై సుషుప్త్యవస్థయందు మూడు విధములైన కరణముల గుణములను ఉపసంహరించుకొని ప్రాజ్ఞుడుగా ఉండి నిత్యానందానుభవము కలవాడై యుండును.

ఏవమాత్మా కూటస్థః ఆకాశవత్ అసంగః ఏవ సన్ అవస్థాత్రయేఽపి ప్రత్యక్ చైతన్య సాక్షిరూపేణ వర్తతే ఇతి శ్రుతియుక్త్యనుభవైః జ్ఞాతవ్యమ్। "సాక్షీచేతాకేవలో నిర్గుణశ్చ" ఇతి శ్రుతిః। ఆకాశ దృష్టాంతో యుక్తిః। అనుభవః కః ఇతిచేత్ పూర్వదినస్య అవస్థాత్రయమస్మాభిః ప్రతిదినమ్ స్మర్యతే। స్మరణస్య అనుభవ పూర్వకత్వ నియమాత్ । అస్మాభిః

అవస్థాత్రయసాక్షిత్వరూపమాత్మలక్షణముపాత్తమ్। తేన ప్రతిదినం అవస్థాత్రయం అస్మాభిః అనుభూయతే అనుభవిష్యతేచ। ఏవ మాత్మా జాగ్రదాదీనాం గతానాం అవస్థానాం ఆగామినాం చ క్రమేణ అనుభూయమానత్వాత్ అనుభవితృరూపస్యాత్మనో నిత్యత్వమపి సిద్ధమ్। ఏవమవస్థాత్రయసాక్షిత్వమ్।

అటులనే ఆత్మకూటస్థుడు(దాగలివంటివాడై,మార్పులేనివాడై) ఆకాశము వలె అసంగుడై యుండి కూడ మూడు అవస్థల యందు ప్రత్యక్ చైతన్యసాక్షిరూపముతోడనే వర్తించుచున్నాడని శ్రుతి, యుక్తి, అనుభవములచే తెలియవలెను. దీనికి "సాక్షీచేతా కేవలో నిర్గుణశ్చ" (సాక్షి,చేతనుడు,కేవలుడు,నిర్గుణుడు) అని శ్రుతి,ఆకాశపుపోలిక అని యుక్తియు కలదు ఇక అనుభవము ఎట్టిది అనినచో, రోజులు గడిచిన కొలది అంతకు పూర్వపుదినములు జాగ్రత్స్వప్నసుషుప్తి అవస్థలను మనము ప్రతిదినము స్మరించికొనుచున్నాము.అనుభవముఉండిననే కదా స్మరణము కలుగును. ఇది నియమము. కావున మనకు అవస్థాత్రయమునకు సాక్షియగు ఆత్మ లక్షణము తెలిసినది. ఇట్లే ప్రతిదినము అవస్థాత్రయమును అనుభవించుచున్నాము. అనుభవించగలము కూడా. కావున ఈ ఆత్మజరిగిపోయిన అవస్థలను,జరుగబోవు వాటిని కూడా క్రమముగా అనుభవించుచున్నందు వలన అనుభవించులక్షణముగల ఆత్మకు నిత్యత్వము కూడ సిద్ధించును.ఇట్లు ఆత్మకు అవస్థాత్రయ సాక్షిత్వము నిరూపించబడినది.

నను లోకే అవస్థావత ఏవ పురుషస్య సాక్షిత్వం దృశ్యతే। భవద్భిః కథమన్యస్య అవస్థా సాక్షిత్వముచ్యత ఇతి చేత్। శృణు అయమవస్థా వానన్తః కరణే ప్రతిఫలిత చైతన్యాభాసః మిథ్యాభూతః। స ఏవ జీవ ఇత్యుచ్యతే।తస్య సుషుప్తౌ అన్తః కరణలయేన వినష్టత్వాత్ స కథం సుషుప్తి సాక్షీస్యాత్? తిసృణాంఅపి అవస్థానాం ఏకసాక్షిత్వనియమాత్। బింబభూతస్యాత్మన ఏవ సుషుప్తేః సాక్షిత్వం వక్తవ్యమ్ ఏవంలాఘవేన జాగ్రత్స్వప్నయోరపి సాక్షీ వక్తుంయోగ్యః జీవస్య వికారిత్వాదపి సాక్షిత్వం నయుజ్యతే। ఆత్మనస్తు

నిర్వికారత్వాత్ సాక్షిత్వం యుజ్యతే।

లోకమందు ఈ మూడు అవస్థలు గల పురుషునికి సాక్షిత్వము కనబడుచున్నది. మీరట్లుగాక అన్యునికే అవస్థాత్రయసాక్షిత్వమున్నదని చెప్పుచున్నారు.ఇదెట్లు? అనినచో వినుము.ఈ మూడు అవస్థలు గల వాడు నిజమునకు అంతఃకరణమున ప్రతిబింబించిన చైతన్యఆభాసుడు. మిథ్యాభూతుడు. కాని నిజమైన ఆత్మకాడు ఈ అభాసుడే జీవుడని చెప్పబడుచున్నాడు.సుషుప్తియందుఅంతఃకరణము లయము చెందుటచేత ఈ జీవుడును నశించును కనుక అతడెట్లు సుషుప్తికి సాక్షియగును? మూడు అవస్థలయందున్న ఒక వ్యక్తికే కదా సాక్షిత్వనియమము. కావున బింబభూతమైన ఆత్మయే సుషుప్తికిని సాక్షి అని చెప్పవలయును. జాగ్రత్స్వప్నములకు కూడా అతడే సాక్షి అని సంగ్రహముగా చెప్పవచ్చును. జీవుడు వికారము నొందు వాడు కనుక సాక్షియగుట కుదురదు. ఆత్మ నిర్వికారుడగుట వలన సాక్షిత్వము కుదురును.

జీవః కథం వికారీతిచేత్ తస్యాహం సుఖీ,అహందుఃఖీత్యాదిరూపేణ అంతఃకరణవృత్తి తాదాత్మ్యేన వికారిత్వదర్శనాత్ వికార్యేవ।

జీవుడు ఎట్లు వికారము గలవాడనినచో అతనికి నేను సుఖిని నేను దుఃఖిని అని మొదలైన భావముల చేత అంతఃకరణవృత్తులతో తాదాత్మ్యభావముఉండుటచే వికారిత్వము (మార్పు) కనబడుటవలన జీవుడు వికారియే.

తర్హి జీవవ్యతిరేకేణ అన్యః కోవా ఆత్మాయఃసాక్షీత్యుచ్యతే। తస్య కిం లక్షణమ్, తస్యాస్తిత్వే కిం ప్రమాణమ్? తస్య జ్ఞానే కః ఉపాయః? ఇతిచేత్ శృణు ।నిర్వికారః కూటస్థ ఏవ సాక్షీ। స ఏవాత్మా। స ఆకాశ వత్ సర్వవ్యాపకః సచ్చిదానందరూపః।స ఏవాత్మా।స ఆకాశవత్ సర్వవ్యాపకః సచ్చిదానంద రూపః।స ఏవవాన్తఃకరణేషు జీవరూపేణ స్థితఃసన్ సంసరతి ఏవం పారమార్థికాత్మని వేదాంతాః సర్వే ఽపి ప్రమాణమ్। అవస్థావానయం జీవః చిదాభాసః ఇదానీం జాగర్తి,ఇదానీం స్వప్నం పశ్యతి,ఇదానీం అజ్ఞాన మోహితః సన్ సుషుప్తౌ వర్తతే । ఇదానీం సుఖీ, ఇదానీం, దుఃఖీ ఇదానీం

ఉదాసీన ఆస్తే। ఇత్యస్య జీవస్య అవస్థాభేదం సర్వమపి చిద్రూపం ఇతి యో జానాతి స ఏవ ఆత్మా అవస్థాత్రయ సాక్షీతి జానీహి।

జీవుని కంటె వేరుగా ఉన్న సాక్షి అయిన ఆత్మ ఎవడు? ఎట్టివాడు? అతనికి గల లక్షణమేమి? అతని ఉనికికి ఏమి ప్రమాణము? అతనిని తెలిసికొనుటకు సాధనము ఏమి? అనినచో వినుము. నిర్వికారుడు కూటస్థుడైన వాడే సాక్షి. అతడే ఆత్మ. ఆతడు ఆకాశమువలె సర్వవ్యాపకుడు, సచ్చిదానందరూపుడు. ఆతడే అంతఃకరణమునందు జీవరూపముతో ప్రవేశించి సంసారియగును అని ఇట్టి పారమార్థికఆత్మవిషయమును చెప్పుటకు వేదాంతములన్నియు ప్రమాణములే. అవస్థలు కల ఈ జీవుడు చిదాభాసుడు ఇపుడు జాగ్రత్ దశలోనున్నాడు. ఇపుడు కల గనుచున్నాడు. ఇపుడు అజ్ఞానమోహితుడై గుఱ్ఱు పెట్టినిద్రించుచున్నాడు. ఇపుడు సుఖముగా ఉన్నాడు. ఇప్పుడు దుఃఖముగా ఉన్నాడు. ఇప్పుడు ఉదాసీనుడుగా ఉన్నాడు అనెడి ఈ జీవుని అవస్థాభేదములన్నిటిని చిద్రూపమేఅని ఎవడు తెలిసికొనునో ఆతడే ఆత్మ అవస్థాత్రయసాక్షి అని తెలియవలెను.

తస్యాత్మనః స్వస్య నిర్వికారత్వం కథం జ్ఞాయతే ఇతి చేత్। స్వముఖ సౌందర్యం స్వేన జ్ఞాతుమశక్యమపి దర్పణప్రతిబింబముఖేన యథా జ్ఞాతుం శక్యతే తథా ఆత్మనో నిర్వికారత్వమపి అన్తఃకరణ ప్రతిబింబేన జ్ఞాతుం శక్యతే। దర్పణే ప్రతిబింబితముఖం చ బింబభూతముఖంయథా న జానాతి, తథా అన్తఃకరణం అంతఃకరణ ప్రతిబింబిత జీవశ్చ బింబభూతమాత్మానం న జానాతి।

స్వస్వరూపుడైన ఆత్మకు నిర్వికారత్వము ఎట్లు తెలియును అనినచో తనముఖసౌందర్యము తనకుతెలియకున్నప్పటికిని అద్దమునందలి ప్రతిబింబము ద్వారా ఎట్లు తెలియునో అట్లే ఆత్మయొక్క నిర్వికారత్వము కూడా అంతఃకరణ ప్రతిబింబము ద్వారా తెలియుటకు శక్యమగును. అద్దము, ప్రతిబింబితముఖము ఈ రెండును బింబమైన ముఖమును ఎటుల తెలిసికొనలేవో అట్లే అంతఃకరణము కాని అందు ప్రతిబింబించిన జీవుడుగాని, బింబభూతమైన ఆత్మను తెలిసికొనలేవు.

తర్హి అయమాత్మా కేన జ్ఞాయతే। ఇతి చేత్, న కేనాపి జ్ఞాయతే। జ్ఞాయమానస్య సర్వస్య దృశ్యత్వాత్। ఆత్మనోదృగ్రూపత్వాత్ స్వయం ప్రకాశ ఏవ ఆత్మా, నత్వన్యేన కేనాపి జ్ఞాయతే। తత్ కథమితి చేత్। దృశ్య ఘటో ద్రష్టారం న జానాతి। స ద్రష్టాచ స్వం స్వయమేవ జానాతి। స్వయం ప్రకాశత్వాత్ యథా మృత ఇవ ప్రతీయమానో దశమః పురుషః పశ్చాత్ స్వాత్మానం స్వయమేవ జానాతి। నను వస్తు అనృతమేవ జ్ఞాయతే తథా చాత్మాఽనుభవ స్వరూప ఏవ నత్వన్యేనానుభావ్య ఇతి మదుక్తార్థం స్వయమేవ అనుభవ పురఃసరన్ జానీహి।

అయితే ఈ ఆత్మ ఎవ్వరికి తెలియును? అనినచో ఎవరికిని తెలియదు. తెలియబడునదంతయ్ను దృశ్యము కదా ఆత్మదృగ్రూపుడు (చూచువాడు)కదా కనుక స్వయంప్రకాశుడయిన ఆత్మ ఎవరికిని తెలియబడడు. అది ఎట్లనినచో దృశ్యమగు ఘటము తెలిసికొనలేదు. ఆద్రష్ట తనను స్వయముగా తెలిసికొనును. స్వయం ప్రకాశమైనందున తనను లెక్కించక ఇతరులను లెక్కపెట్టగా తాను మరణించినాను అనెడి దశమన్స్వమ సి=అనువాక్యార్థములో నందేహము కలిగించిన, పదియవపురుషుడు(తాను) తనను స్వయముగా ఉపదేశానంతరము తెలిసికొనుచున్నాడు. పరిశీలించగా తానున్నట్లే కావున ఆత్మ అనుభవ స్వరూపమే కాని మరియొకనిచే అనుభవింపదగిన ది కాదు అని నేను చెప్పిన విషయమును యథార్థమును స్వయముగా అనుభవము ముందు కలుగునట్లుగా తెలిసికొనుము.

ప్రమాణం కిమితి చేత్। ప్రత్యక్షం, అనుమానం, ఉపమానం,శబ్దః ఇతి చత్వారి ప్రవమాణాని. పునః చ అర్థాపత్తిః నంభవః ఐతిహ్యం,అనుపలబ్ధిరితి చ చత్వారి ప్రమాణాని సంతి. పశ్చాత్ ఉక్తానాం చతుర్ణాం పూర్వోక్త చతుర్ష్వేవాన్తర్భావ ఇతి సిద్ధాన్తః। వేదాన్తినః చ కేచిత్ షట్ ప్రమాణాని ఉదాహరంతి। తేషాం లక్షణాన్యతివిస్తృతాని। అస్మాకం యావత్ అవశ్యకం తావన్మాత్ర ముచ్యతే। ।

నిజమునకు ఏది ప్రమాణము అనినచో ప్రత్యక్షము, అనుమానము ఉపమానము, శబ్దము అని నాలుగు ప్రమాణములు ఇంతేకాక అర్థాపత్తి,

సంభవము,ఐతిహ్యాము, అనుపలబ్ధిఅను ఈనాలుగును ప్రమాణములే తరువాత, చెప్పబడిన నాలుగు ప్రమాణములకు ముందు చెప్పిన నాలుగు ప్రమాణములయందు అంతర్భావమని (పై ప్రమాణములలో చేరునవి వేరుకావని) సిద్ధాంతము. వేదాంతులలో కొందరు ఆరు ప్రమాణములను ప్రతిపాదించుచున్నారు. వాటి లక్షణములు చాలా విస్తృతముగానున్నవి. మనకు ఎంతవరకు అవసరమో అంతవరకు చెప్పబడును

ఇంద్రియేణ జన్యం జ్ఞానం ప్రత్యక్ష ప్రమాణం। ధూమాది లింగేన జాయమానమనుమానమ్ సాదృశ్యేన జాయమానం ఉపమానమ్। ఆప్త వాక్యమ్ శబ్దః।

నేత్రాది ఇంద్రియములచేత తెలియబడు ప్రమాణము ప్రత్యక్షప్రమాణము. ధూమాది చిహ్నము (పొగ మొదలగు హేతువు) చే తెలియబడునది. అనుమానప్రమాణము. పోలికచే తెలియబడునది ఉపమాన ప్రమాణము ఆప్తవాక్యమే శబ్ద ప్రమాణము.

ఆత్మనః ఇంద్రియ అగోచరత్వాత్ న తత్ర ప్రత్యక్షం ప్రమాణమ్। నిరంశత్వాత్ తత్ర ఆత్మని న అనుమానం ప్రవర్తతే। అద్వితీయత్వాత్ న ఉపమానమ్। తస్మాత్ ఆత్మని శబ్ద ప్రమాణమ్। శబ్దస్యాప్తోక్తత్వాత్। ఆప్తశ్చయథార్థవక్తా। ఈశ్వరస్య యథార్థవక్తృత్వాత్। తదుక్తా శ్రుతిరేవశబ్దః, తస్మాత్ శ్రుతిరేవ ఆత్మని ప్రమాణమ్ ।

ఆత్మ ఇంద్రియములకు గోచరమైనది కానందున ఆత్మ పట్ల ప్రత్యక్షము ప్రమాణము కాదు. నిరంశమైనందున (దానిగుర్తులు వేరుగా లేనందున) ఆత్మను నిరూపించుటకు అనుమాన ప్రమాణము ఉపకరించదు. అద్వితీయమైనందున(సాటి వస్తువు లేనందున) ఉపమాన ప్రమాణము కుదురదు. కావున శబ్దమే ప్రమాణము. శబ్దమనగా ఆప్తుని వాక్యము కనుక ఆప్తుడు యథార్థ వక్త. ఈశ్వరుడు యథార్థ వక్త కనుక ఈశ్వరుని వాక్యమగు శ్రుతియే శబ్దప్రమాణము కావున శ్రుతియే ఆత్మ విషయమున ప్రమాణము.

పూర్వోక్త సాక్షిరూప సన్యాసినం తేన దృష్టపురుషతదవస్థా తత్ వ్యాపారగుణదోషా యథా న స్పృశంతి, ఏవమాత్మానం దృశ్యమాన

అహంకారతదవస్థాతత్వ్యాపారగుణదోషాః న స్పృశంతి। ఏవం యో భాగ్యశాలీ పురుషః సాక్షిమాత్రమాత్మానం అహంకారాదిభిః అస్పృష్టం చైతన్యమాత్రం శ్రుతిభిః జానాతి స ఏవ జీవన్ముక్తః। తథైవ శ్రుతిరపి వదతి।

పూర్వము చెప్పబడిన సాక్షిరూప సన్న్యాసికి అతనిచే చూడబడిన పురుషుని అవస్థలు, వ్యాపారములు,గుణదోషములు ఎట్లు అంటవో అట్లే ఆత్మకు, చూడబడు అహంకార రూపుడగు జీవుని అవస్థలు వ్యాపారములు గుణదోషములు అంటవు. ఈ విధముగా ఏ అదృష్టవంతుడైన పురుషుడు సాక్షిమాత్రమగు తన్ను అహంకారాదులచేత తాకబడని చైతన్యమాత్రముగ శ్రుతుల ద్వారా తెలిసికొనునో ఆతడే జీవన్ముక్తుడు. శ్రుతి కూడా అట్లే చెప్పుచున్నది.

హేపుత్ర! తత్ త్వమపి వేదాన్త శాస్త్రమ్ ఆత్మని ప్రమాణమితి విశ్వస్య తదుక్త ప్రకారేణ అవస్థాత్రయ సాక్షిణమాత్మానం జానీహి।

ఇతి మననే నవమ వర్ణకం సమాప్తమ్.

నాయనా! కావున నీవు కూడా వేదాంత శాస్త్రమును ఆత్మ విషయమున ప్రమాణమని నమ్మి అందు చెప్పిన విధముగా అవస్థా త్రయమునకు సాక్షిగా ఆత్మగా నిన్ను నీవు తెలిసి కొనుము.

ఇట్లు మనన మందు తొమ్మిదవ ప్రకరణము సమాప్తము.

.. .. ..

## అథ దశమ వర్ణకమ్

ఇదానీం దశమ వర్ణకే పంచకోశ వ్యతిరిక్తత్వం ఉచ్యతే। అన్నమయ, ప్రాణమయ, మనోమయ,విజ్ఞానమయ, ఆనంద మయాః పంచకోశాః। అన్నవికారశుక్లశోణితజన్యంషడ్భావవికార సహితం అన్నేనైవ వర్ధమానమిదం స్థూలశరీరం అన్నమయకోశః। కర్మేంద్రియైః సహ ప్రాణమయకోశః। జ్ఞానేంద్రియైః సహ మనోమయకోశః।తైః సహ బుద్ధిః విజ్ఞానమయకోశః। ప్రియ,మోద,ప్రమోదవృత్తిభిఃసహజ్ఞానం ఆనందమయకోశః ఇష్టవస్తుదర్శన సంతోషఃప్రియం తద్వస్తులాభేసతితోషోమోదః,తదను భవసంతోషఃప్రమోదః ఏవం పంచకోశాః.యథా ఖడ్గమ్ కోశః శివలింగమ్ సంపుటః, ఆమ్రఫలమ్ త్వక్,పురుషమ్ కంచుకః, ఏతాన్యేతే యథా ఆచ్ఛాదయన్తి ఏవం పంచకోశా

అపి ఆత్మానమాచ్ఛాదయన్తి। అతఃకోశ ఇతి ఏషాం సంజ్ఞా।

పదవ వర్ణకము

ఇక ఈ పదవ వర్ణకమనందు ఆత్మకు పంచకోశ వ్యతిరిక్తత్వము గూర్చి (ఆత్మ పంచకోశములనుండి వేరగుట గురించి) చెప్పబడుచున్నది. అన్నమయ,ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ,ఆనంద మయములు అని ఐదు కోశములు. అన్నవికారములగు శుక్ల శోణితములవలన పుట్టిషడ్భావవికారసహితమై అన్నముచేతనే వృద్ధిపొందు స్థూల శరీరము అన్నమయకోశము. ఇదియే కర్మేంద్రియములతో కూడి ప్రాణమయకోశము,జ్ఞానేంద్రియములతో కూడిన మనస్సే మనోమయ కోశము, జ్ఞానేంద్రియములతో కూడిన మనస్సేమనోమయ కోశము, జ్ఞానేంద్రియములతో కూడిన బుద్ధియే విజ్ఞానమయ కోశము, ప్రియమోదప్రమోదవృత్తులతోకూడిన జ్ఞానము ఆనందమయకోశము। ఇష్టవస్తువును దర్శించినపుడు కలుగు సంతోషము ప్రియము, ఆవస్తువును పొందునపుడు కలుగు సంతోషము మోదము. అది అనుభవించునపుడు కలుగుసంతోషము ప్రమోదము. ఈవిధముగా ఐదుకోశములు. ఖడ్గమును ఒర,శివలింగమును సంపుటము,మామిడి పండును చర్మము,పురుషుని చొక్కా ఎట్లు కప్పునో అట్లే ఈ పంచకోశములు కూడా ఆత్మను కప్పుచుండును. కావున వీనికి కోశములని పేరు.

నను ఖడ్గాదీనాం తత్ కోశాదీనాం చ సత్తాభిన్నా। పంచకోశానాం ఆత్మభిన్నసత్తాకత్వాభావాత్। కోశాదిభ్యోవైషమ్యాత్ కథం ఆచ్ఛాదకత్వమితి చేత్ ఉచ్యతే। ఆదిత్యకిరణపరిణామవిశేషత్వాత్ మేఘస్యఆదిత్య సత్తయైవ సత్తా। తథాపి మేఘః ఆదిత్యం యథా ఆచ్ఛాదయతి । అగ్నిమ్ ఉపజీవ్య వర్తమానస్య ధూమస్యాపి అగ్నేః సత్తయైవ సత్తా। తథాపి సధూమోఽగ్నిం ఆచ్ఛాదయతి ఏవ మాత్మ సత్తయాసత్తావన్తోఽపికోశా ఆత్మానం ఆచ్ఛాదయన్తి ఇత్యేవమాత్మనః పంచకోశ వ్యతిరిక్తత్వం ఉచ్యతే। ఖడ్గాదికం తత్ కోశాదికంచ ఏకత్వేన ఖడ్గాదిరూపేణ వ్యవహ్రియమాణమపి తత్ ఖడ్గాదికమ్ కోశాదిభిన్నమ్।తద్వత్ పంచకోశాభిన్నత్వేన వ్యవహ్రియమాణః అపి ఆత్మాతేభ్యో వ్యతిరిక్త ఏవ।

ఖడ్గాదులకును వాని ఒర మున్నగు వానికిని వేరువేరు ఉనికికలదు. పంచకోశములకు ఆత్మకంటె భిన్నముగా ఉనికి ఉన్నట్లు కనబడుటలేదు కదా! కోశములు మున్నగు వానిసామ్యము లేకుండుటవలన పంచకోశములు ఆత్మను అచ్ఛాదించుట ఎట్లు కుదురును అనినచో? చెప్పబడుచున్నది. సూర్యకిరణ పరిణామ విశేషమే యగు మేఘమునకు సూర్యుని ఉనికివలననే ఉనికి ఉన్నను ఆ మేఘము సూర్యుని ఎట్లు కప్పుచున్నదో అగ్నిని ఆధారముగా చేసికొని పుట్టిన పొగకు అగ్నిఉనికిని బట్టియే ఉనికి ఉన్నను ఆ పొగ అగ్నిని ఎట్లుకప్పుచున్నదో అట్లే ఆత్మ ఉనికిని బట్టి ఏర్పడిన ఈ పంచకోశములు కూడా ఆత్మను కప్పుచున్నవి. (తెలియనీయకున్నవి.) ఇట్లు ఆత్మకు పంచ కోశ వ్యతిరిక్తత్వము చెప్పబడును. ఖడ్గాదికము, ఒర మొదలైనవి ఒకటిగానే ఖడ్గాదిరూపముగానే వ్యవహరింపబడినను ఆ ఖడ్గాదికములు కోశములకంటె ఎట్లు భిన్నములో అట్లే పంచకోశములు ఆత్మకు వేరుగాఉండి భిన్నముగా వ్యవహరింపబడుచున్నను. ఆత్మ వాటి కంటె వేరుగానే ఉండును.

నను ఆత్మనః కోశానాం చ ఏకత్వేన వ్యవహ్రియమాణత్వాత్ పరస్పరసంబంధో అస్తీతి వక్తవ్యమ్। ఆత్మనో న కేనాపి సంబంధః, స నిరంజనః ఇతి కథముచ్యత ఇతిచేత్। శృణు। సంబంధః అనేక ప్రకారః। తర్కసిద్ధాంతే సమవాయః సంయోగ ఇతి ద్విప్రకారః।

ఆత్మకు కోశములకు అభేదము (వేరుకానితనము, ఏకత్వము అభిన్నత్వము) వ్యవహరింపబడుచున్నందున పరస్పర సంబంధమున్నది. అని చెప్పవలెను. ఆత్మకు దేనితోను సంబంధము లేదు. అదినిరంజనము అని ఎట్లు చెప్పబడుచున్నది? అనినచో సంబంధము అనేక ప్రకారములుగా ఉన్నది. తర్క సిద్ధాంతమందు సమవాయ సంబంధము, సంయోగ సంబంధము అని సంబంధము రెండు విధములు.

అవయవఅవయవినోః గుణగుణినోఃక్రియాక్రియావతోఃజాతి వ్యక్త్యోః విశేషనిత్యద్రవ్యయోశ్చ సంబంధః సమవాయః ఆత్మనఃపంచ కోశాదీనాంచ అవయవఅవయవ్యాదిషు అపరిగణనాత్ న సమవాయః। తర్హి భేరీ దండవత్ సంయోగః అస్త్వితి చేత్। ఆత్మనో ద్రవ్యత్వ అనంగీకారాత్ సోఽపి న సంభవతి

అవయవములకు, అవయవులకు,గుణములకు,గుణులకు క్రియకు,క్రియకలదానికి,జాతి,వ్యక్తులకు విశేష,, నిత్యద్రవ్యములకు ఉండు సంబంధము సమవాయసంబంధము. ఆత్మకు పంచకోశములకును అవయవ అవయవి మొదలైన భావ పరిగణనము లేనందువలన వానికి సమవాయసంబంధము కుదురదు. భేరీదండములకు వలె వానికి సంయోగసంబంధము ఉండవచ్చును కదా అన్నచో ఆత్మకు ద్రవ్యత్వము అంగీకరింపబడనందున వానికి సంయోగసంబంధమని కూడా చెప్పరాదు.

తర్హి ఆత్మనః కోశాదీనాంచ కః సంబంధః ఇతిచేత్। రజ్జుసర్పయోః ,శుక్తికారజతయోః, స్థాణుపురుషయోః,ఆకాశవర్ణయోః ఇవ అధ్యాస సంబంధః ఏవ। అయం అధ్యాసః ఏకతరాధ్యాసః అన్యోన్యాధ్యాసఃవాఇతి చేత్। అహంకారస్య ఆత్మనశ్చ మిలిత్వా ఏకప్రత్యయవిషయత్వాత్ అన్యోన్యఅధ్యాస ఏవ।

మరి ఆత్మకు కోశములకు ఏమి సంబంధము అనినచో రజ్జుసర్పములకు, శుక్తికా రజతములకు, స్థాణుపురుషులకు, ఆకాశ వర్ణములకు, కనబడు అధ్యాస సంబంధమే. ఈ అధ్యాసము ఏకత్వ అధ్యాసమా, అన్యోన్య అధ్యాసమా అనినచో అహంకారమునకు ఆత్మకు కలిసి ఒకే జ్ఞానవిషయత్వముఉండుట వలన అన్యోన్యఅధ్యాసమే ( ఒకదానిని చూచి ఇంకొకటిగా అనుకొనుటయే).

ఆత్మనశ్చ అన్నమయ కోశస్యచ అన్యోన్యాధ్యాసః కథమితి చేత్। ఉచ్యతే। అహం మనుష్యః, అహందేవః, అహం స్త్రీ, అహం పురుషః, అహం జాతః, అహం వర్తే, అహం వృద్ధింగతః, అహం పరిణతః, అహంజీర్ణఃఇతః పరంమరిష్యామితీచ అహంబాలః అహంకుమారఃఅహం యువా,అహం వృద్ధః, అహం బ్రాహ్మణః, అహం గృహస్థః, అహంవానప్రస్థః అహం సన్యాసీ, అహం రామః,అహం కృష్ణః, అహం శంకరః, అహం దీక్షితః, అహం శాస్త్రీ, అహం యోగీ,అహం భోగీతిచ ఆత్మనః అన్నమయ కోశవికారధర్మాన్ ఆత్మని అధ్యస్యతి। ఆత్మనిష్ఠసచ్చిదానందాన్ అన్నమయకోశ శరీరే మమ శరీరమస్తి। భాతి ప్రియమితి అధ్యస్యతి ఏవం అన్నమయకోశస్య ఆత్మనశ్చ అన్యోన్యాధ్యాసః

ఆత్మకు అన్నమయ కోశమునకు అన్యోన్యాధ్యాస ఎట్లుఅనినచో చెప్పబడుచున్నది. నేను మనుష్యుడను, నేను దేవతను, నేను స్త్రీని,నేను పురుషుడను, నేను పుట్టిన వాడను, నేను పెరుగుచున్నవాడను, నేనువృద్ధిని పొందుచున్నవాడను, నేను పరిణమించువాడను, నేను శిథిలమగుచున్నాను. తరువాత నేను చచ్చిపోగలను. నేను బాలుడను,నేను కుమారుడను, నేను యువకుడను, నేను వృద్ధుడను, నేను బ్రాహ్మణుడను, నేను క్షత్రియుడను, నేను వైశ్యుడను, నేను శూద్రుడను, నేను బ్రహ్మచారిని, నేను గృహస్థుడను, నేను వానప్రస్థుడను, నేను సన్న్యాసిని, నేను వానప్రస్థుడును, నేను సన్న్యాసిని, నేను రాముడను, నేను కృష్ణుడను, నేను శంకరుడను, నేను దీక్షితుడను, నేను శాస్త్రిని,నేను యుద్ధము చేయువాడను, నేను భోగము కలవాడను అని అన్నమయకోశధర్మములను ఆత్మయందు జీవుడు ఆరోపించుచున్నాడు. ఆత్మ నిష్ఠమైన సచ్చిదానందములను అన్నమయ కోశమందు (శరీరమునందు) ఇది నా శరీరము,ఉన్నది, ప్రకాశించుచున్నది. ప్రియముగా ఉన్నది అని జీవుడు అధ్యాస (చేయుచున్నాడు) చేసికొనుచున్నాడు. ఈ విధముగా అన్నమయ కోశమునకు ఆత్మకు అన్యోన్య అధ్యాస.

అథ ప్రాణమయ కోశస్య ఆత్మనశ్చ అన్యోన్యాధ్యాసః కథమితి చేత్। అహం క్షుధాయుక్తః, అహం పిపాసావాన్,అహం బలవాన్, అహం వీర్యవాక్,అహం క్రియావాన్, అహం వక్తా,అహం గన్తా,దాతా, విసర్జయితా ఆనందయితా మూకః, పంగుః, విహస్తః,షండః,ఇత్యాది ప్రాణమయ కోశవికారానేవ ఆత్మన్యధ్యస్యతి ఆత్మనః సచ్చిదానందాన్ మమ ప్రాణః అస్తి భాతి ప్రియమితి ప్రాణమయ కోశేచ అధ్యస్యతి। ఏవం ప్రాణమయ కోశస్య ఆత్మనశ్చ అన్యోన్యాధ్యాసః।

ఇక ప్రాణమయ కోశమునకు అన్యోన్యాధ్యాస ఎట్లు అనినచో నేను ఆకలిగొన్నవాడను,నేను దప్పికగలవాడను, నేను బలవంతుడను,నేను పరాక్రమవంతుడను,నేను పనులు చేయుచున్నవాడను, నేను మాట్లాడుచున్నవాడను, నేను నడచుచున్నవాడను, నేను ఇచ్చువాడను, నేను విసర్జించువాడను, నేను ఆనందము అనుభవించువాడను,నేను

మూగవాడను,నేను కుంటివాడను, చేతులు లేనివాడను, నపుంసకుడను ఈ మొదలైన ప్రాణమయ కోశవికారములను ఆత్మయందు జీవుడు ఆరోపించుచున్నాడు. ఆత్మయొక్క సచ్చిదానంములను నాప్రాణము ఉన్నది ప్రకాశించుచున్నది. ప్రియమ్మైనది అని ప్రాణమయకోశమందు అరోపించుచున్నాడు. ఈ విధముగా ప్రాణమయకోశమునకు ఆత్మకు అన్యోన్యాధ్యాస

అథ మనోమయ కోశస్య ఆత్మనశ్చ అన్యోన్యాధ్యాసః ఉచ్యతే। అహం సంకల్పవాన్, అహంవికల్పవాన్,శోకవాన్,మోహవాన్, కామీ,లోభీ,స్ప్రష్టా, ద్రష్టా,రసయితా,ఘ్రాతా,బధిరః,అంధ ఇత్యాది మనోమయకోశవికారాన్ ఆత్మన్యధ్యస్యతి। ఆత్మధర్మాన్ సచ్చిదానం దాంశ్చ మమ మనః సమ్యక్ అస్తి, భాతి,ప్రియమితి మనోమయకోశే అధ్యస్యతి ఏవం మనోమయ కోశస్య ఆత్మనశ్చ అన్యోన్యాధ్యాసః

ఇపుడు మనోమయకోశమునకు ఆత్మకు అన్యోన్యాధ్యాస చెప్ప బడుచున్నది. నేను సంకల్పము చేయుచున్నాను. నేను వికల్పము చేయుచున్నాను. నేను శోకవంతుడను, నేను మోహము కలవాడను, కోరిక కలవాడను, లోభిని,తాకుచున్నవాడను, చూచుచున్నవాడను, రుచి చూచుచున్నవాడను,వాననచూచుచున్నవాడను. చెవిటివాడను, గ్రుడ్డివాడను, మొదలైన మనోమయ కోశవికారములను ఆత్మయందు జీవుడుఅధ్యాసచేయును.అట్లేఆత్మధర్మములైన సచ్చిదానందములను, నామనస్సుఅనిమనస్సునందారోపించును.బాగాయున్నది ప్రకాశించుచున్నది. ప్రియముగా ఉన్నది,అనువిధముగా మనోమయ కోశమునకు ఆత్మకుఅన్యోన్యాధ్యాస.

అథవిజ్ఞానమయకోశస్య ఆత్మనశ్చ అన్యోన్యాధ్యాస ఉచ్యతే। అహం కర్తా, బుద్ధిమాన్, ఊహాపోహ చతురః ఏక సంథాగ్రాహీ, లోకాన్తర గామీ, రాగీ, ద్వేషీ ,శ్రోత్రియః, పండితః, విరక్తో,భక్తిమాన్, ఉపాసకః, జ్ఞానీ, ఇత్యాది విజ్ఞానమయకోశవికారాన్ ఆత్మన్యధ్యస్యతి।ఆత్మలక్షణ సచ్చిదానందాన్ మమ బుద్ధిరస్తి భాతి, ప్రియమితి విజ్ఞానమయకోశే చ అధ్యస్యతి। ఏవం విజ్ఞానమయ కోశస్య ఆత్మనశ్చ అన్యోన్యాధ్యాసః।

ఇక విజ్ఞానమయకోశమునకు ఆత్మకు అన్యోన్యాధ్యాస చెప్పబడుచున్నది. నేను కర్తను, బుద్ధిమంతుడను, ఊహాపోహ చతురుడను,ఏకసంథాగ్రాహిని, లోకాంతరగామిని, రాగిని, ద్వేషిని, శ్రోత్రియుడను, పండితుడను, విరక్తుడను, భక్తుడను, ఉపాసకుడను, జ్ఞానిని, ఈ మొదలైన విజ్ఞానమయకోశవికారములను ఆత్మయందు జీవుడు అధ్యాస చేయుచున్నాడు. ఆత్మ లక్షణమైన సచ్చిదానందములను నాకు బుద్ధియున్నది, ప్రకాశించుచున్నది. ప్రియముగా ఉన్నది అని విజ్ఞానమయకోశమునందు ఆరోపించుచున్నాడు. ఈవిధముగా విజ్ఞానమయ కోశమునకు ఆత్మకు గల అన్యోన్యాధ్యాస.

అథ ఆనందమయకోశస్య ఆత్మనశ్చ అన్యోన్యాధ్యాస ఉచ్యతే। అహం భోక్తా, సుఖీ,సంతుష్టః, సాత్త్వికః, రాజసః తామసః,, మూఢః, దుష్టః , శూన్యః, మోహితః, అవివేకీ, భ్రాన్తః, ఇత్యాది ఆనందమయ కోశవికారాన్ ఆత్మన్యధ్యస్యతి ఆత్మనః సచ్చిదానందాంశ్చ మమ జ్ఞానమస్తి, భాతి,ప్రియమితి, ఆనందమయకోశే అధ్యస్యతి ఏవం ఆనందమయ కోశస్య ఆత్మనశ్చ అన్యోన్యాధ్యాసః సంబంధః।

ఇట్లే ఆనందమయ కోశమునకు, ఆత్మకు గల అన్యోన్యాధ్యాస చెప్పబడుచున్నది. నేను భోక్తను, సుఖిని, సంతుష్టుడను, సాత్త్వికుడను, రాజసుడను, తామసుడను, మూఢుడను, దుష్టుడను, శూన్యుడను, మోహితుడను,అవివేకిని, భ్రాంతుడను ఈమొదలైన ఆనందమయ వికారములను ఆత్మయందు జీవుడారోపించుకొనును. ఆత్మయందు గల సచ్చిదానంద లక్షణములను నాకు జ్ఞానము ఉన్నది. ప్రకాశించుచున్నది. ప్రియముగా ఉన్నది యని చెప్పుటద్వారా ఆనందమయకోశమునందు ఆరోపణ చేయును ఈ విధముగా ఆనందమయకోశమునకు ఆత్మకు అన్యోన్యాధ్యాసయే సంబంధము.

అయమధ్యాసః కేనభవతీతి చేత్। అయమాత్మా ఏతే పఞ్చకోశాః ఇతి సమ్యక్ వివేకజ్ఞానాభావాత్ అవివేకేన భవతి। తర్హి కోశానామాత్మనశ్చ వివేకః కథమితిచేత్ ఉచ్యతే। లోకే పుత్ర,మిత్ర,కలత్ర, గృహ,ధన,ధాన్యాదివత్ ఇదం మమ శరీరం, అయం మమ ప్రాణః ఇదం మమ మనః, ఇయంమమ

బుద్ధిః, ఇదం మమ అజ్ఞానం,ఇతి ఇదంమమేతి బుద్ధివిషయత్వాత్ శరీరాదిరూప పఞ్చకోశాః ఆత్మా న భవంతి। కిన్తు పశ్వాదివత్ అనాత్మైవేతి, పఞ్చకోశాశ్చాత్మనః పృథక్ పృథక్ ఇతి యుక్తిః। శరీర రహితః ఆత్మేతి ప్రతిపాదికాః"అశరీరమ్" ఇత్యాది శ్రుతయశ్చసన్తి। పశ్వాదీనాం క్షయవృద్ధి వికారాః తత్స్వామినం ద్రష్టారం యథా న స్పృశంతి, ఏవం శరీరాదిపఞ్చకోశవికారాః ద్రష్టారమాత్మానం మాం కదాపి న స్పృశన్తీత్యనుభవః ।

ఈ అధ్యాస దేని వలన వచ్చుచున్నది అనినచో ఇది ఆత్మ, ఇవి పంచకోశములు అని సరియైన వివేకజ్ఞానము లేకపోవుటవలన అవివేకము చేతనే ఈ అధ్యాస కలుగుచున్నది. పంచకోశములకు ఆత్మకు గల పరస్పరభేదవివేకము ఎట్లు కలుగును అనినచో చెప్పబడును. లోకములోపుత్ర,మిత్ర,కళత్ర,గృహ,ధన,ధాన్యాదులవలె ఇది నా శరీరము, ఇది నాప్రాణము, ఇది నామనస్సు, ఇది నా బుద్ధి, ఇది నా అజ్ఞానము అని ఇది నాది అను బుద్ధి విషయములగుటవలన శరీరాదిపంచకోశములు ఆత్మ కావు. పశువులు మున్నగు వాని వలె ఆత్మకానివే తనకన్న వేరైనవే పంచకోశములు వేరువేరుగా ఉన్నవి అని యుక్తి,శరీరరహితమైనది ఆత్మయని ప్రతిపాదించు అశరీరం మొదలైన శ్రుతులు ప్రమాణములుగా నున్నవి. క్షయవృద్ధి వికారములు యజమానుని ద్రష్టను ఏవిధముగా అంటవో ఆ విధముగానే శరీరాదిపంచకోశవికారములు ద్రష్టయగు ఆత్మఅగు నన్ను ఏఒకప్పుడును అంటవు అనునది అనుభవము.

హే స్వామిన్! భవద్భిః ఉక్తపశ్వాది దృష్టాన్తస్య బాహ్యత్వాత్ జ్ఞాతుం యోగ్యస్యదార్ష్టాంతికస్యఆన్తరత్వాత్ మమ బుద్ధిం నారోహతి। కిఞ్చపఞ్చకోశాః పశ్వాదివత్ పృథక్ నావభాసన్తే.కిన్తు తప్తాయః పిండవత్ ఆత్మన్యేకతయా ఆభాసంతే। ఏవం దృష్టాంతదార్ష్టాంతికయోః బహువైషమ్యమస్తి। కథం తేషామాత్మనఃసకాశాత్ పృథక్త్వేన జ్ఞాతవ్యమితిచేత్ శృణు। బాహ్యదృష్టిః నేత్రం। అంతర్దృష్టిః బుద్ధిః। బాహ్యదృష్ట్యాజ్ఞాతుమశక్యాఅపి పదార్థాఃఅంతర్దృష్ట్యాజ్ఞాతుం శక్యంతే। బాహ్యవీణాతంత్ర్యాః తత్స్వరాణాం, తప్తజలాదగ్నేః, పుష్పాత్ గంధస్య చ పృథక్త్వేన స్థూలదృష్ట్యా జ్ఞాతుం అశక్యత్వే ఽపి

సూక్ష్మశ్రోత్రాది జ్ఞానేంద్రియైః బుద్ధిమతా పురుషేణ పృథక్త్వేన ఇమావీణాతంత్ర్యః ఇమేస్వరాః,ఇదం జలం, అయం అగ్నిః, ఇదం పుష్పం అయంగంధః ఇతి వీణాదిభ్యః పృథక్త్వేన స్వరాదీనాం జ్ఞానం సుకరం ఏవమేవ క్షీర జలయోః విభజనమన్యేషాం దుష్కరమపి హంసానాం సుకరం। ఏతదుభయం యథా తథా ఆత్మనః సకాశాత్ పఞ్చకోశానాం పృథక్కరణం స్థూలబుద్ధీనాం దుష్కరమపి సూక్ష్మబుద్ధీనామ్ సుకరమ్।

స్వామీ మీచే చెప్పబడిన పశ్వాది దృష్టాంతము బాహ్యము, తెలియదగిన ప్రస్తుతాంశము దార్ష్టాంతికము ఆంతరము కనుక నా బుద్ధికి ఈ విషయము అవగాహనమగుట లేదు. అంతేకాక పంచకోశములు పశ్వాదులవలె వేరుగా భాసించుట లేదు. కాని కాలిన ఇనుపగుండు అగ్ని ఒకటనిఅనిపించినట్లు ఆత్మయందు ఏకత్వముగా భాసించుచున్నది. ఈ విధముగ దృష్టాంత దార్ష్టాంతికములకు చాలా వైషమ్యము కలదు. వాటిని ఆత్మకంటె వేరుగా ఉన్నట్లు తెలిసికొనుటకు ఎట్లు వీలగును? అనినచో వినుము. బాహ్యదృష్టి నేత్రము. అంతర్ దృష్టి బుద్ధి.బాహ్యదృష్టికి తెలిసికొనుటకు సాధ్యముకానప్పటికి కొన్ని పదార్థములు అంతర్ దృష్టిచే తెలిసికొనుటకు వీలగును. బాహ్యమున గల వీణ తీగెలకు, వాటియందలి మ్రోగుతున్న స్వరములకు, వేడినీటికిని అందలి అగ్నికిని, పుష్పాదులకు వానియందలి గంధాదులకును స్థూల దృష్టిచేభేదము తెలిసికొనుటకు అశక్యమైనప్పటికిని సూక్ష్మశ్రోత్రాది జ్ఞానేంద్రియములచే బుద్ధిమంతులైన పురుషుల చేత వేరుగా ఇవి వీణతీగెలు, ఇవి స్వరములు, ఇది నీరు ఇది అగ్ని, ఇది పుష్పము ఇది గంధము అని, వీణాదులకంటె వేరుగా స్వరాదులను తెలిసికొనుట సులభము కదా. పాలను నీటిని వేరుచేయుట ఇతరులకు దుష్కరమైనను హంసలకు సులభము కదా. ఈ ఉభయములు ఎట్లో అట్లే ఆత్మనుండి పంచకోశములను వేరుగాచేయుట స్థూల బుద్ధి గలవారికి దుష్కరమైనప్పటికిని సూక్ష్మ బుద్ధి కలవారికి సులభము.

హే పుత్ర! సిద్ధాంతవచనమ్ శృణు। ఏతావత్ పర్యన్తం కాలవాసనా యుక్తానాం యః ప్రపంచవ్యవహారః, తమంగీకృత్య పంచకోశా ఇతి తద్వి వివేక ఇతి ఏవమాది ఉక్తమ్ పరమార్థే విచార్యమాణే ఆత్మని పంచకోశా న

సన్తి। కథమితి చేత్ యథా రజ్జ్వాం సర్పః,శుక్తికాయామ్ రజతమ్, స్థాణౌపురుషః , ఆకాశే నీలమ్,ఇతి ఏతేషామ్ భ్రాంత్యా ప్రతీతిమాత్రమేవ। నస్వరూపేణ అవస్థానమ్, కాలత్రయేఽపి ఆరోపితానామ్ సర్పాదీనాం న వాస్తవతా। తథా ఆత్మని పఞ్చకోశాః అపి ఆరోపితా ఏవ న వాస్తవాః। లోకే యదారోపితమ్ తదసదేవ। యథా ద్విచంద్రాదికమ్। తథాపఞ్చకోశా అపి ఆత్మన్యారోపితత్వాత్ మిథ్యాభూతా ఏవ।

ఓ కుమార! సిద్ధాంతవచనమును వినుము. ఇంతవరకు కాలవాసనగలవారల యొక్క ఏ పంచకోశ వ్యవహారము కలదో దానిని అంగీకరించివంచకోశములని, ఆత్మ, అని వానివివేకము మున్నగుఅంశములుచెప్పబడినవి. పరమార్థముగా విచారించినట్లయినచో ఆత్మయందు పంచకోశములు లేవు. ఎటులనగా తాడుయందు పాము, ముత్యపుచిప్పయందు వెండి, స్థాణువునందు పురుషుడు, ఆకాశమందు నీలిమ, ఈ మొదలైనవి భ్రాంతి చేత కేవలము తెలియబడుచున్నవే కాని నిజమునకు లేవు కదా! కనుక ముక్కాలములందు ఆరోపితములైన సర్పాదులు వాస్తవికములు కావు. అట్లే ఆత్మయందు పంచకోశములు కూడా ఆరోపితములే కాని యథార్థములు కావు. లోకమందు ఏదేది ఆరోపితమో అది లేనట్టిదే అగును. ఇద్దరు చంద్రులుండుట కేవలమారోపితమైనట్లు పంచకోశములు కూడా ఆత్మయందు ఆరోపితమైనందువలన లేనివే అగును.

నను ఆరోపితసర్పాదయః అధిష్ఠానజ్ఞానే సతి తత్ క్షణే ఏవ న ప్రతీయన్తే।పఞ్చకోశాస్తు ఆత్మజ్ఞానేసత్యపి ప్రతీయన్తే ఏవ । న నశ్యన్తి।తేషాం కథమారోపితత్వమితి చేత్। శృణు ।లోకే ప్రాతిభాసికం సత్, వ్యావహారికంసత్, పారమార్థికం సదితిచ, త్రివిధమ్ అస్తి। ఈశ్వరసృష్టిః జీవసృష్టిరితిద్వివిధాసృష్టిః । ఏవం సతి అధ్యాసరూపమ్ శుక్తికారజతాది సర్వమ్ జీవసృష్టిః। ఇదం ప్రాతిభాసికమ్ సత్ అస్యా జీవసృష్టేః అధిష్ఠానభూతమాకాశాదికం సర్వం వ్యావహారికం సత్। తత్సర్వం ఈశ్వరసృష్టిః। తస్యాః ఈశ్వర సృష్టేరపి అధిష్ఠానభూతం యత్ బ్రహ్మ తత్ పారమార్థికం సత్ తదేవ నిత్యం। వ్యావహారికం సత్। తత్సర్వం ఈశ్వర సృష్టిః। తస్యాః ఈశ్వరసృష్టేరపి అధిష్ఠానభూతం యత్ బ్రహ్మ తత్ పారమార్థికం సత్ తదేవ నిత్యం।

వ్యావహారికం సత్ వ్యవహారక్షయపర్యన్తమ్ తిష్ఠతి। ప్రాతిభాసికం వ్యావహారికంచ అధ్యస్తత్వేన సమానే అపి సత్తయా న సమానే। కించ వ్యావహారికమపి ప్రాతిభాసికవత్ అధిష్ఠానన్యాయేన సద్యోనశ్యేద్యది ఆత్మజ్ఞానినో అపి జీవన్ముక్తా న స్యుః। జ్ఞానోపదేశ గురుశిష్య పరంపరాచాపి న స్యాత్। జ్ఞానినాం వ్యవహారాభావాత్, అజ్ఞానినాం చోపదేష్టుమశక్యత్వాత్। తస్మాద్యథామృది అధ్యస్తఃపృథుబుధ్నోదరాకారో ఘటో యావత్ కులాలవ్యాపారక్షయం తిష్ఠతి। ఏవమాత్మన్యధ్యస్తాః పఞ్చకోశాఃమిథ్యేతి జ్ఞాతా అపియావత్ ప్రారబ్ధక్షయం దగ్ధపటవత్ ప్రతీయన్తే ఇతి జానీహి।

ఆరోపించిన సర్పాదులు అధిష్ఠానజ్ఞానము కలిగిన వెంటనే కనబడుట లేదు. పంచకోశములైతే ఆత్మజ్ఞానము కలిగినప్పటికి కనిపించుచున్నవి. కాని నశించుట లేదు. వాటిని ఎటుల ఆరోపితములని చెప్పవచ్చును అని అనినచో వినుము. లోకమందు ప్రాతిభాసిక సత్యము, వ్యావహారిక సత్యము, పారమార్థిక సత్యము అని మూడు సత్యములున్నవి. ఈశ్వరసృష్టి,జీవసృష్టి అని రెండు విధములైన సృష్టి కలదు. ఇవిఇట్లుండ అధ్యాసరూపమైన శుక్తికారజతాదులన్నియు జీవసృష్టి ఇది ప్రాతిభాసిక సత్యము. ఈ జీవసృష్టికి అధిష్ఠానభూతమైన ఆకాశాది పదార్థములన్నియు వ్యావహారికసత్యములు. ఇదంతయు ఈశ్వరసృష్టి. ఆ ఈశ్వరసృష్టికి కూడా అధిష్ఠానమేదో అదిపరబ్రహ్మము. అదే పారమార్థికసత్యము. అదే నిత్యమైనది.వ్యావహారికసత్యమువ్యవహారము నశించునంత వరకుఉండునదిప్రాతిభాసికమువ్యావహారి కముఅధ్యారోపము సమానమైనప్పటికిని ఉనికిలో మాత్రము సమానములు కావు. మరేమనగా వ్యావహారికము కూడా ప్రాతిభాసికమువలె అధిష్ఠానన్యాయము. చేత వెంటనే నశించినచో ఆత్మజ్ఞానులు జీవన్ముక్తులే లేకుండెదరు. జ్ఞానోపదేశము గురుశిష్య పరంపర కూడా లేకుండా పోవును. జ్ఞానులకు వ్యవహారము ఉండదు. అజ్ఞానులకు ఉపదేశము పొందుటకును వీలు ఉండదు. కనుక మట్టియందు అధ్యస్తమైన పెద్ద పొట్ట సన్నని మూతి క్రింది మట్టు కలిగిన కుండ కుమ్మరివాని వ్యాపారము నశించు వరకు ఎట్లుండునో అట్లే ఆత్మయందు ఆరోపించబడిన పంచకోశములు కూడా మిథ్యయని

తెలియబడినప్పటికిని ప్రారబ్ధక్షయమగువరకు కాలిన వస్త్రమువలె ప్రతీతములగుచుండునని తెలిసికొనుము.

కిం బహునా సిద్ధాంతస్తు ఏవమ్। మృద్యారోపితే ఘటనామరూపేబాధితే సతి మృత్‌మాత్రమ్ యథా సత్యతయా అవశిష్యతే। ఏవమాత్మన్యారోపితేషు పంచకోశేషు ఆత్మజ్ఞానేన బాధితేషు సత్సుసచ్చిదానంద స్వరూప ఆత్మా ఏక ఏవ సత్యతయా అవశిష్యతే। ఇతి ఏవమ్ యో జానాతి స ఏవాత్మ జ్ఞానీ,స ఏవ బ్రహ్మజ్ఞానీ, తస్యైవ విదేహముక్తిఃఫలిష్యతీతి సర్వా ఉపనిషదః ఘుష్యన్తి।ఇతి మననే దశమ వర్ణకం సమాప్తమ్.

వేయేల సిద్ధాంతమిది. మట్టియందు ఆరోపితమైన ఘటనామ రూపములు బాధింప బడినప్పటికి మట్టి మాత్రము ఎటులు సత్యముగా మిగిలి ఉండునో అటులనే ఆత్మయందు ఆరోపితమైన పంచకోశములు ఆత్మజ్ఞానముచేత బాధింపబడినప్పటికి సచ్చిదానందస్వరూపమగు ఆత్మమాత్రము సత్యముగానే మిగిలి ఉండును. ఆత్మయందు ఆరోపితములైన పంచకోశములు ఆత్మజ్ఞానము వలన బాధింపబడగా పరమాత్మ ఒక్కటే మిగిలి ఉండును అని ఎవరు తెలిసికొందురో అతడే ఆత్మజ్ఞాని అతడే బ్రహ్మజ్ఞాని, అతనికే విదేహముక్తి ఫలించునని సమస్తమైన ఉపనిషత్తులు ఘోషించుచున్నవి.ఇట్లు మననమునందు దశమ వర్ణకము.

అథ ఏకాదశ వర్ణకమ్

అథ ఇదానీం అస్మిన్ ఏకాదశ వర్ణకే ఆత్మనః సచ్చిదానందరూపత్వం చతుర్థం లక్షణం ఉచ్యతే ఆత్మనఃసద్రూపం కిం చిద్రూపం కిం ఆనంద రూపం కిం ఇతిచేత్ శృణు! కాలత్రయే ఽపి అబాధ్యమానత్వేసతి ఏకరూపత్వం సతో లక్షణం. ఇదం లక్షణం ఆత్మని అస్తి. అత్రప్రమాణం కిమితి చేత్ అస్య ప్రపంచస్య సృష్టేః పూర్వం సదేవ ఆసీత్ "ఇతి,ఆత్మన ఆకాశః సంభూతః". ఇత్యాది వేదాంతశాస్త్రం ప్రమాణం,సర్వజనానాం అనుభవశ్చ.

ఇక ఈఏకాదశ వర్ణకమున ఆత్మకు సచ్చిదానందరూపత్వము

అను నాల్గవ లక్షణము చెప్పబడుచున్నది. ఆత్మకు సద్రూపమేమి చిద్రూప మేమి ఆనంద రూపమేమి అని అనినచో వినుము. మూడు కాలముల యందు బాధింపబడకుండ (మార్పుచెందకుండా) ఏకరూపమై ఉండుట సత్తైనవస్తువు యొక్క లక్షణము. ఈ లక్షణము ఆత్మయందే కలదు. దీనికి ప్రమాణమేమి అనినచో ఈ ప్రపంచమునకు (సృష్టికి) ముందు,సత్తే ఉండినది, దీనికి " ఆత్మనుండి ఆకాశము పుట్టినది" అను మొదలైన వేదాంతశాస్త్రమే ప్రమాణము. సర్వజనుల అనుభవము ప్రమాణము.

సర్వజనానాం అనుభవః కీదృశః ఇతిచేత్ ఆఢ్యో దరిద్రః, కర్మీ,భక్తః , ముముక్షుః ఇతి సర్వే జనాః। తేషామనుభవః కీదృశ ఇతిచేత్ అహం పూర్వ జన్మని సత్పాత్రేషుయత్కించిత్ దత్తవాన్ తేన అస్మిన్ జన్మని ఐశ్వర్య మనుభవామి ఇతి ఆఢ్యస్య అనుభవః.అహం పూర్వ జన్మనిసత్పాత్రేషు కిమపి నదత్తవాన్ తేన అస్మిన్ జన్మని దారిద్ర్యమనుభవామి అస్మిన్ జన్మని మయాసత్కర్మాణి అనుష్ఠీయంతే తేన భావిజన్మని స్వర్గే దేవత్వ మాయాస్యతి ఇతి కర్మిణః అనుభవః, పూర్వజన్మని అహం భగవంతంఉపాసితవాన్ తద్వాసనయా అస్మిన్నపి జన్మని భగవతి భక్తిః ఆసీత్అనేన భావిజన్మని సాలోక్యాది ముక్తిం వైకుంఠాదిలోకే అనుభవిష్యామి ఇతి భక్తస్య అనుభవః । పూర్వజన్మసు ఈశ్వరార్పణరూపేణ మయా కర్మాణి కృతాని తేన అస్మిన్ జన్మని సాధన చతుష్టయం సద్గురులాభః శ్రవణాదికం ఆత్మజ్ఞానం చ లబ్ధమ్ ఇతః పరం మమ జన్మ నాస్తి అహం కృతకృత్యః ఇతి ముముక్షోఃఅనుభవః ఏవం సర్వేషాం జనానాం కాలత్రయేऽపి అహమస్మీతి అనుభవస్య దర్శనాత్ ఆత్మనిఅధ్యస్తస్య దేహస్యైవ నాశః ఆత్మనః తు నకదాచిదపి నాశః ఇతి జానీహి తస్మాత్ ఆత్మనః కాలత్రయేऽపి అబాధ్యమానత్వే సతి ఏకరూపస్య విద్యమానత్వాత్ ఆత్మనః సద్రూపత్వమస్తి.

సమస్తజనుల అనుభవమెట్టిదనినచో ధనవంతుడు దరిద్రుడు కర్మిష్ఠి భక్తుడు ముముక్షువు అనువారి అనుభవము ఏ ప్రకారముగ ఉన్నదనినచో నేను పూర్వజన్మమున సత్పాత్రుల (యోగ్యుల)నుద్ధేశించి ఏదియో సమర్పించి ఉంటిని. ఆకారణముగా ఈ జన్మమున ఐశ్వర్యము అనుభవించుచున్నాను. ఈ జన్మమునకూడ ఏదైనను సమర్పించినచో

రాబోవు జన్మయందుకూడా ఐశ్వర్యము అనుభవించెదనని ధనవంతుని అనుభవము. నేను సత్పాత్రునుద్దేశించి ఏమియు అర్పించుకొనలేదు. అకారణముగా ఈ జన్మమున దారిద్ర్యము అనుభవించుచున్నాను. ఈ జన్మమున కూడా ఏమియు ఈయబడనిచో రాబోవుజన్మమున కూడా దారిద్ర్యము అనుభవించెదను అని దరిద్రుని అనుభవము. పూర్వజన్మమున సత్కర్మలననుష్ఠించితిని. ఆసంస్కారముచే ఈజన్మమున స్వర్గమున దేవత్వమును పొందుదును అని కర్మిష్ఠుని అనుభవము. పూర్వజన్మమందుభగవంతుని ఉపాసించితిని ఆ సంస్కారముచే ఇప్పుడు కూడా నాకు భగవద్ భక్తి కొంత కలిగినది. దీని కారణముగా నేను రాబోవు జన్మమునందు సాలోక్యాదిముక్తిని వైకుంఠాదిలోకమున అనుభవింతును అని భక్తుని అనుభవము. పూర్వజన్మమున ఈశ్వరార్పణముగా నేను కర్మలనొనర్చితిని. అందుచే ఈ జన్మమున నాకు వివేకాదులగు నాలుగు సాధనలు సద్గురులాభము మహావాక్య శ్రవణాదికము ఆత్మజ్ఞానము లభించినవి. ఇకపైన నాకు జన్మలేదు. నేను కృతకృత్యుడను. అని ముముక్షువుయొక్క అనుభవము. ఈ విధముగా సమస్త జనులకును మూడుకాలములలో తానుఉన్నాను అను అనుభవము కలుగుచున్నది. కనుక ఆత్మయందు ఆరోపింపబడిన ఈ దేహమునకే నాశము. ఆత్మకు ఎప్పుడును నాశము లేదని తెలిసికొనుము. కావున ఆత్మకు మూడు కాలములయందును బాధింపబడక నశించక యుండుట ఏకరూపముగానుండుట సిద్ధించినది. కాన ఆత్మకు సద్రూపత్వము కలదు.

హేస్వామిన్! అనుభవేన ఆత్మనః సద్రూపత్వముక్తంనయుక్త్యా ఇతిచేత్, యుక్త్యా విచార్యమాణేఆత్మనః సద్రూపత్వం భవతి కథమితిచేత్ శృణు వయమస్మిన్ లోకే విద్యమానాః వా నవా ఇతి విచార్యమాణే విద్యమానా ఏవ ఇతిజానీహి. సర్వేషాం అహం ఇహ అస్మి ఇతి అనుభవాత్ ఏవం విద్యమానాః వయంశరీరిణోవా అశరీరిణోవా ఇతిచేత్ శరీరిణ ఏవ న అశరీరిణః శరీరస్య దర్శనాత్ ఇదం శరీరం కథం ఆగతం ఇతి విచార్యమాణే కర్మణా ఇతి నిశ్చయః తత్ కర్మ అస్మదీయం వా అన్యదీయం

వా ఇతిచేత్ అస్మదీయమేవేతి వక్తవ్యమ్ అన్యకర్మణా అన్యస్య స్వర్గఫల అననుభవాత్ అన్యథా అన్య కర్మణా అన్యః స్వర్గాది ఫలం ప్రాప్నుయాత్ బ్రాహ్మసమాధినా అస్మాకం సర్వేషాం విదేహముక్తిః స్యాత్.తస్మాత్ అస్మదీయ కర్మణైవ అస్మాకం శరీరమ్ ఇతి వక్తవ్యం తదేతత్ శరీర ఆరంభకం కర్మ అస్మిన్ జన్మని కృతం వా పూర్వజన్మని కృతం వా ఇతి విచార్యమాణే పూర్వజన్మనికృతమిత్యేవ వక్తవ్యమ్ ఏతజ్జన్మకృతస్యకర్మణః ఏతచ్ఛరీరం ప్రతి పూర్వభావిత్వ అభావేన అకారణత్వాత్ పూర్వ జన్మని కరణ కాలేవయం విద్యమానావా నవా ఇతి విచార్యమాణే విద్యమానా ఏవ అవిద్యమానైః కర్మకర్తుమశక్యత్వాత్ తదానీం అస్మాకం శరీరమస్తి వానవేతిచేత్ అస్త్యేవ శరీరాభావే కర్మకర్తుమశక్యత్వాత్ తచ్ఛరీరమపి తత్పూర్వజన్మ కృతకర్మణా వా నవా ఇతిచేత్ తత్పూర్వజన్మకృత కర్మణైవ ఇతి వక్తవ్యమ్ ఏవం పునః పునః విచార్యమాణే కర్మణః శరీరస్యచ ప్రవాహరూపేణ అనాదిత్వం సిద్ధం ఏవం భూతకాలే వర్తమానకాలే ఆత్మనః సత్త్వం యుక్త్యా సాధ్యతే అస్మాభిః జన్మాంతరేషు శ్రవణమననాది కృత్వా కర్మణ ఏవ ముఖ్యబుద్ధ్యా అనుష్ఠితత్వాత్ ఏతత్ జన్మ శరీరంచ ఆగతమ్. అస్మిన్ జన్మని క్రియమాణం కర్మాపి ఇతః పరం జన్మదదాతి.తస్మిన్నపి క్రియమాణం కర్మతతః పరంజన్మదదాతి ఏవంపునఃపునఃవిచార్యమాణే కర్మప్రవాహస్య శరీరప్రవాహస్యచ భవిష్యత్కాలే అంతో నాస్తీతి జ్ఞాయతే తత్త్వ జ్ఞానేన కర్మణి క్షీణేసతి శరీరమపి నాయాతి తదుభయ సంబంధీ ఆత్మా తు యావత్ బ్రహ్మజ్ఞానం శరీరస్య సృష్టి ప్రలయౌఅనుభవన్ శరీరస్య సుఖదుఃఖ ఇచ్ఛాః అనుభవన్ అధః స్థావర పర్యంత ం ఊర్ధ్వం బ్రహ్మలోక పర్యంతం పరిభ్రమన్తిష్ఠత్యేవ న నశ్యతి। తత్త్వజ్ఞానే సతి అవిద్యాకామకర్మాదినాశాత్ దుఃఖహేతోః అభావాత్ స్వస్వరూపమానందమనుభవన్ విదేహముక్తౌ సుఖమేవ తిష్ఠతి ఏవం భవిష్యత్ కాలేఽపి ఆత్మనః నకదాపి అసత్త్వం కింతు సదా సత్త్వమేవ ఇతియుక్త్యా సిధ్యతి

ఓ స్వామీ ! అనుభవముచే ఆత్మకు సద్రూపముండుటగూర్చి చెప్పబడినది.కాని సద్రూపముయుక్తితో చెప్పబడలేదు కదా అన్నచో

,యుక్తితో విచారణ చేయగా ఆత్మకు సద్రూపత్వమే ఉన్నట్లు తెలియును. అదెట్లన్నచో వినుము. మనము ఈ లోకమున ఉన్నామా లేమా అని ఆలోచించగా ఉన్నాము అనే కదా అనవలెను! గ్రహింపుము ఈ విధముగా ఉన్న మనము శరీరముకలవారలమా శరీరములేనివారలమా అనినచో శరీరముకలవారలమేకదా. శరీరము లేనివారము కాదు. శరీరము కన్పించుచున్నది కదా.ఇక ఈ శరీరము దేనిచే వచ్చినదని విచారణచేయగా కర్మచేతనేయని సమాధానము. ఆ కర్మమనదా ఇతరులదా అనినచో మనదే అని అనవలెను. ఒకరి కర్మచేత మరియొకరికి స్వర్గఫలమురాదుకదా. అది కాదన్నచో అన్యుల కర్మచే ఇతరుడు స్వర్గాదిఫలమును పొందవలసి వచ్చును.బ్రాహ్మణునిచే చేయబడినయెాగనమాధిచేశూద్రుండు కూడాస్వర్గఫలముపొందవలసి వచ్చును. పూర్వము శుకమహాముని పొందిన బ్రహ్మసమాధిచే మనకందరికిని విదేహముక్తి కలుగవలసి వచ్చును. అట్లుఎచ్చటాకన్పించుటలేదుకావున మన కర్మచేతనే మనకు శరీరము వచ్చినదని అనవలెను. అట్టి ఈ శరీరమునకు కారణమైన కర్మ ఈ జన్మమున చేయబడినదా పూర్వజన్మమున చేయబడినదా అని విచారించినచో పూర్వజన్మమున చేయబడినదే అని చెప్పవలయును. ఈ జన్మమున చేసిన కర్మఈశరీరమునకు పూర్వము ఉండదు కనుక ఈశరీరము కారణము కాదు కావున, పూర్వజన్మమున కర్మచేయుకాలమున కూడ మనము ఉండవలెను. అట్లు మనమున్నామా లేమా అని విచారించినచో పూర్వజన్మమున కూడా మనము ఉండియే ఉన్నాము. లేకపోయినచో కర్మచేయుటకు వీలుకాదు కదా అని సమాధానము. ఇక పూర్వజన్మమున మనకు అప్పుడు శరీరము ఉండినదా లేదా అనినచో ఉండినదే అని, అనవలెను. శరీరము లేనిచో కర్మచేయుటకు వీలుకాదు. ఆశరీరము కూడా దానికి పూర్వజన్మలో చేసిన కర్మవలననా కాదా అని విచారించినచో దానికి పూర్వజన్మలో చేసిన కర్మకారణము ఆశరీరము కూడా దానికి పూర్వజన్మలో చేసిన కర్మకారణము ఇట్లుకర్మకును శరీరమునకును ప్రవాహరూపము సిద్ధించి అనాదిత్వము వచ్చును. అనాదియైన ఈశరీరకర్మల ఉభయముల

స్థితిని బట్టి ఆత్మకు ఆకాశమునకు వలె సాక్షాత్తుగా ముఖ్యముగా స్వస్వరూపముతోఅనాదిత్వము ఏర్పడును.ఈవిధముగా భూతకాలమున ఆత్మయొక్క ఉనికిని గూర్చి యుక్తిచేతను సాధింతుము. మనము జన్మాంతరములలో శ్రవణమననాదులను కర్మలచే ముఖ్యకర్తవ్యములను బుద్ధితో అనుష్ఠించినందువలన మనకు ఈ జన్మ ఈశరీరము వచ్చినవి. ఈజన్మమున చేయబడిన కర్మ కూడా తరువాత ఇంకొక జన్మను ఇచ్చును. ఆ జన్మయందు చేయబడిన కర్మకూడా దానితరువాతి జన్మనిచ్చును. ఈ విధముగా మరల మరల విచారణ చేయగా కర్మప్రవాహమునకును శరీరప్రవాహమునకును భవిష్యత్కాలమున కూడా అంతములేనట్లు తెలియును. తత్త్వ జ్ఞానముచే కర్మక్షీణించగా శరీరమురాదు. కర్మ శరీరముల ఉభయములకు సంబధించిన ఆత్మమాత్రము బ్రహ్మజ్ఞానము కల్గునంతవరకు శరీరమునకు గల సుఖదుఃఖఇచ్ఛలను అనుభవించుచు క్రింది స్థావర జన్మవరకును పైని బ్రహ్మలోక పర్యంతమును తిరుగుచునే ఉండును. కాని ఆత్మ నశించదు. తత్త్వజ్ఞానము కల్గినచో అవిద్య, కామము, కర్మమున్నగునవి నశించగా దుఃఖహేతువు లేకుండుట వలన స్వస్వరూపానందమనుభవించుచు విదేహముక్తికలిగి సుఖముగ నుండుదుము. ఈ విధముగా భవిష్య త్కాలమున కూడా ఆత్మకు ఎప్పుడైననూ లేకపోవుట అనునది లేదు. కనుక ఈవిధముగా ఎల్లప్పుడు సద్రూపముగా ఉండుట యుక్తిచేత కూడా సిద్ధించుచున్నది.

ఏవం కాలత్రయేఽపి ఆత్మనో విద్యమానత్వాత్ అబాధితత్వేన పరమార్థత ఏవ ఏకరూపత్వాత్సత్త్వం సిద్ధమ్ ఏవమేవ శ్రుతియుక్తి అనుభవైః అనేక ప్రలయేషు అనేక ప్రపంచేషు వినష్టేషుఅపి స్వయం అనష్టః సన్నేవ వర్తతే ఆత్మా। అతః సృష్టి స్థితి సంహారాః ప్రపంచస్యైవనత్వాత్మనః ఇతి కాలత్రయేఽపి అబాధితత్వాత్ ఏకరూపత్వాత్ చ ఆత్మా సద్రూప ఇతి జానీహి.

ఈ విధముగా మూడు కాలములందునూ ఆత్మ ఉన్నది కనుక బాధింప బడకుండుటచే (నశించ కుండుటచే) పరమార్థముగా అది

ఏకరూపమగుట వలన ఆత్మకు సత్త్వ లక్షణముసిద్ధించినది. ఇట్లేశ్రుతి యుక్తి అనుభవములచే అనేక ప్రళయములును అనేక ప్రపంచములును గడచిపోయినను ఆత్మ స్వయముగా నశించకుండా సద్రూపము పొందియేయున్నది. కనుక సృష్టిస్థితిసంహారములు ప్రపంచమునకేగాని ఆత్మకుకాదనికాలత్రయమునందునుబాధింపబడక (నశించక) ఏకరూపముగా ఉండుటవలన ఆత్మసద్రూపమేఅని తెలిసికొనుము.

ఆత్మనః చిద్రూపత్వే ప్రమాణమ్ కిమితిచేత్ శృణు సూర్యాది సాధనాంతరఅనపేక్షం స్వయం ప్రకాశమానం సత్ స్వస్మిన్ ఆరోపిత సకలజడపదార్థానాం అవభానకం చిద్రూపమ్ ఏతత్‌చిద్రూప లక్షణమాత్మన్యస్తి కథమితిచేత్, ఆత్మా గాఢాంధకారేఽపి ఇతర అనపేక్షమేవ స్వయం ప్రకాశతే స్వస్మిన్నారోపితశరీరబాల్యయౌవనవార్ధకావస్థాః అవస్థావ్యాపారాంశ్చ ఇతరానపేక్షం సమ్యక్ జానాతి అతః ఆత్మనః చిద్రూపత్వమ్ సిద్ధమ్

ఆత్మ చిద్రూపమనుటకు ప్రమాణము ఏమి? అని అనినచో వినుము.సూర్యుడు మొదలైన సాధనాంతరములను అపేక్షించకుండా స్వయముగా ప్రకాశించుచు తనయందు ఆరోపితమైన సకలజడ పదార్థములను భాసింపజేయునది చిద్రూపము. ఈ చిద్రూప లక్షణము ఆత్మయందే కలదు. ఎటులన? ఆత్మ గాఢాంధకారములో కూడా దేనిని అపేక్షించకుండగనే స్వయముగా ప్రకాశించుచున్నది. తనయందు ఆరోపితములైన శరీరముయొక్క బాల్య,యౌవన,వార్ధకాది అవస్థలను, ఆయాఅవస్థల వ్యాపారములను ఇతర అపేక్ష లేకుండా బాగా తెలిసికొనును. అందువలన ఆత్మకు చిద్రూపత్వము సిద్ధించినది.

నను అస్మాకమ్ సర్వజ్ఞత్వ అభావాత్ సర్వపదార్థఅవభాసకత్వం కథమితిచేత్,ప్రపంచః ఆన్తరో బాహ్యాఇతి ద్వివిధః ఏతత్‌ప్రపంచ ద్వయమపి అస్మాభిఃప్రకాశ్యతే న వయమ్ తేన కదాపి ప్రకాశ్యాః తత్‌కథమితిచేత్ ఉచ్యతే బాహ్యప్రపంచో నామ పృథివ్యప్ తేజో,వాయ్వాకాశాఇతి,శబ్ద,స్పర్శ రూప, రస, గంధా ఇతి పంచీకృత భూతానీతి,బ్రహ్మాండఇతిచతుర్దశభువనానీతి,

చతుర్విధస్థూల శరీరాణీతిచ వివిధనామగుణకర్మవికారశక్త్యాశ్రయః. ఏతం బాహ్యప్రపంచం. మహత్తరం భేదేన బహుధావిభజ్యప్రమాణైః వయమేవ జానీమః న త్వస్మానయమ్ జానాతీతి అన్తర్ముఖతయా విచార్యమాణే అస్మాకం బాహ్యప్రపంచం మహత్తరభేదేన బహుధా విభజ్య ప్రమాణైః వయమేవ జానీమః న త్వస్మానయమ్ జానాతీతి అన్తర్ముఖతయా విచార్యమాణే అస్మాకం బాహ్యప్రపంచఅవభాసకత్వం సిద్ధమ్.

మనకు సర్వజ్ఞత్వము లేదు సర్వపదార్థములను ప్రకాశింప చేయుటఅను లక్షణముఉన్నదని ఎట్లు చెప్పవచ్చునన్నచో ప్రపంచము,లోపలిది బయటది అని రెండు విధములుగా ఉన్నది. ఈ రెండు ప్రపంచములును మనచేతనే ప్రకాశింవజేయంబడుచున్నవి.మనము వానిచే ఏఒకవ్వాడును ప్రకాశింపచేయంబడము.ఎటులనినచెప్పబడును. (గ్రహింపుము) బాహ్యప్రపంచమనగా భూమి, నీరు, తేజస్సు, వాయువు, ఆకాశములు, శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు పంచీకృత భూతములు, బ్రహ్మాండము, చతుర్దశ భువనములు, నాలుగువిధములైన స్థూలశరీరములు, వివిధములైన నామ, గుణ, కర్మ, వికార, శక్తులకుఆశ్రయము. ఈ బాహ్యప్రపంచమును మహత్తరమైన భేదములతో అనేకవిధములుగా విభజించి ప్రమాణములచేత, మనమే తెలిసికొనగలుగుచున్నాము. కాని మనను ఈప్రంపచము తెలిసికొనుటలేదని అంతర్ముఖముగా విచారణ చేయగా మనకు బాహ్యప్రపంచ అవభాసకత్వము (బాహ్యప్రపంచమును తెలిసికొనుట అను విషయము) స్పష్టమగును.

అథాన్తరప్రపంచఅవభాసకత్వమస్మాకం కథమితిచేత్ శృణు అంతరప్రపంచః అన్నమయాదిజీవన్ముక్తిపర్యంతైఃప్రకారైఃబహుభిన్నఃస ఆన్తరప్రపంచః,అయమన్నమయః,అయంప్రాణమయః, అయం మనోమయః అయం విజ్ఞానమయః, అయమానందమయః, ఇత్యేవమేవ పంచకోశా ఇతి, ఇదం స్థూలశరీరం, ఇదం సూక్ష్మశరీరం, ఇదం కారణశరీరం, ఏతత్ శరీర త్రయమితి, ఇవే షడ్భావవికారాః ఇవే షట్కోశాః, ఇమేషడూర్మయఃఇదం మాంద్యమ్,ఇదం పటుత్వం, అయం రాగః, అయం

ద్వేషః, ఇదం త్రివిధకరణం ఇదం అన్తఃకరణం, ఇదం జాగ్రత్,అయమ్ స్వప్నః,ఇయం సుషుప్తిః ఏవమవస్థాత్రయమితి చ ఇదం జ్ఞానేంద్రియ పంచకం, ఇయం బుద్ధిః ఇదం చిత్తమ్, అయం అహంకారః, అయం సంకల్పః, అయం నిశ్చయః, ఇదం అవధారణం, అయం అభిమానీ,అయం విశ్వః, అయమ్ తైజసః, అయం ప్రాజ్ఞః,ఇత్యేవం అవస్థావన్తః, అయం ప్రాతిభాసికః, అయం వ్యావహారికః, అయం పారమార్థికః, ఇదం సాత్త్వికమ్, ఇదం రాజసం, ఇదం తామసం,ఇదం సుఖం, ఇదం దుఃఖం, ఇదం జ్ఞానం.ఇదం అజ్ఞానం,ఇదం ప్రియం,ఇదం సాధన చతుష్టయం, ఇదం మైత్ర్యాది చతుష్టయం, అయం అష్టాంగయోగః,ఇదంశ్రవణం, ఇదం మననం,ఇదం నిదిధ్యాసనం, అయం సమాధిరితి, ఇదం ప్రమాణం, ఇదం ప్రమేయం, అయం ప్రమాతా, ఇదంతాపత్రయం, ఇయం ఆధిః,ఇయం వ్యాధిః, ఇదమారోగ్యం, ఇయం భక్తిః ఇదం మందమ్, ఇదం తీవ్రం,ఇదంసగుణోపాసనం, ఇదమారోగ్యం, ఇయం భక్తిఃఇదం నిర్గుణోపాసనం, అయం మనోనాశః అయం వాసనాక్షయః, ఇయం విదేహముక్తిః, ఇయంజీవన్ముక్తిః, ఇత్యేవమాది వివిధనామ రూప, గుణ, వికార శక్త్యా శ్రయభూతాన్తర ప్రపంచః సర్వోఽపి ఏవమేవ పృథక్ విభజ్య అస్మాభిః జ్ఞాయతే. స ఆన్తర ప్రపంచస్తు అస్మాన్న జానాతి సమ్యక్ విచార్యమాణే యతః ఆన్తర ప్రపంచః అస్మాభిఃజ్ఞాయతే,అతః ఆత్మనః చిల్లక్షణ సద్భావాత్ఆత్మా చిద్రూపః

ఇక అంతర ప్రపంచఅవభాసకత్వము మనకు ఎటులనినచో వినుము. అంతరప్రపంచము అన్నమయాది జీవన్ముక్తి పర్యంతము అనేక ప్రకారములుగాఉన్నది. ఇది అన్నమయము, ఇది ప్రాణమయము,ఇది మనోమయము,ఇది విజ్ఞానమయము, ఇది ఆనందమయము ఇవి పంచకోశములు. ఇది స్థూల శరీరము, ఇది సూక్ష్మశరీరము, ఇది కారణ శరీరము ఇవి మూడు శరీరములు. ఇవి షడ్భావవికారములు. ఇవి షడూర్మ్ములు, ఇది మాంద్యము, ఇది పటుత్వము, ఇది రాగము, ఇది ద్వేషము, ఇది త్రివిధకరణము, ఇది అంతఃకరణము. ఇది జాగ్రద్దశ, ఇది

స్వప్నము, ఇది సుషుప్తి, ఇది అవస్థాత్రయము, ఇది జ్ఞానేంద్రియపంచకము, ఇది కర్మేంద్రియపంచకము, ఇవిపంచ ప్రాణములు, ఇది మనస్సు,ఇది బుద్ధి, ఇది చిత్తము, ఇది అహంకారము, ఇది సంకల్పము, ఇది నిశ్చయము, ఇది ఇంతకంటె వేరుకాదు (అవధారణము), ఇది అభిమానము, వీడు విశ్వుడు, వీడు తైజసుడు, వీడు ప్రాతిభాసికుడు వీడు ప్రాజ్ఞుడు, వీరు అవస్థావంతులు.

ప్రాతిభాసికుడు వీడు వ్యావహారికుడు వీడు పారమార్థికుడు, ఇది జ్ఞానము, ఇది అజ్ఞానము, ఇది ప్రియము, ఇది అప్రియము, ఇది ఉపేక్ష, ఇది సాధన చతుష్టయము, ఇదిమైత్ర్యాది చతుష్టయము,ఇది అష్టాంగయోగము, ఇది శ్రవణము, ఇది మననము, ఇది నిదిధ్యాసనము, ఇది సమాధి, ఇది ప్రమాణము, ఇది ప్రమేయము, ఈయన ప్రమాత, ఇది తాపత్రయము, ఇది దిగులు,ఇది వ్యాధి, ఇది ఆరోగ్యము, ఇది భక్తి ఇది మందము, ఇది తీవ్రము, ఇది సగుణోపాసన, ఇది నిర్గుణోపాసన, ఇది మనోనాశము, ఇది వాసనా క్షయము, ఇది విదేహముక్తి, ఇది జీవన్ముక్తి, ఈమొదలైన అనేకవిధ నామరూప గుణవికారశక్తులకు ఆశ్రయంమైన అంతరప్రపంచమంతయు ఈవిధముగా వేరువేరుగా విభజించబడి ఆత్మచేతతెలియబడుచున్నది. ఆ అంతర ప్రపంచము మనను తెలిసికొనుటలేదు అని బాగా విచారించినట్లైనచో అంతర ప్రపంచము మనచేతనే తెలియబడుచున్నది. కనుక ఆత్మకు చిల్లక్షణము (జ్ఞానలక్షణము) ఉన్నట్లు తెలియుచున్నది . కనుక ఆత్మ చిద్రూపము.

హేస్వామిన్! ఆత్మాచిద్రూపః కేనాపి న జ్ఞాయత ఇతిభవద్భిః ఉక్తంఖలు మనసా సకలం జ్ఞాయతే ఆత్మా తేనైవ జ్ఞాయతామితిచేత్ శృణు మనః ఉత్పత్తివినాశవత్ సంకల్పరూపం పరిచ్ఛిన్నంఘటవత్ భూతకార్యమ్ కామాదివికారకలుషీకృతం స్మృతివిస్మృతిమత్,ఏవం భూతం మనః జడమితిజ్ఞాతవ్యమ్ తస్యమనసఃప్రకాశ ఏవనాస్తి తదపిమనః చిత్తైవ జ్ఞాయతే తాదృశం జడం మనః స్వప్రకాశకచిదాత్మానం కథమ్ జానీయాత్ ? న జానీయాదిత్యవేహి

ఓస్వామీ ! ఆత్మచిద్రూపమని ఎవని చేత తెలియబడనిదని మీచేతచెప్పబడినది మనస్సు చేతనే సకలము తెలియబడుచున్నది. గదాఆత్మకూడామనస్సు చేతనే తెలియబడవచ్చును గదా అనినచో వినుము.మనస్సు ఉత్పత్తివినాశములు కలది, సంకల్పరూపమైనది. పరిచ్ఛిన్నము, కుండవలె భూతకార్యము. కామాది వికారములచే కలుషీకృతము.స్మృతి, విస్మృతులు కలది. ఇట్టి ఈ మనస్సు జడము అని తెలియవలెను. అమనస్సునకు ప్రకాశమే (జ్ఞానమే) లేదు. అది చిచ్ఛక్తి వలననే ప్రకాశించునని తెలియవలెను.అటువంటి జడమైన మనస్సు స్వయం ప్రకాశక చిదాత్మను ఎట్లు తెలిసి కొనును? తెలిసికొనలేదనియే చెప్పవలెను అని తెలిసికొనుము.

తర్హి " మనసైవాను ద్రష్టవ్యః" ఇతి శాస్త్రస్య కిం తాత్పర్యమితి చేత్, శృణు అగ్నినా తప్తస్య స్వర్ణస్య ప్రకాశో జాయత ఇతి వ్యవహారే అగ్నినా స్వర్ణే అవిద్యమానః ప్రకాశః స్వయం ప్రకాశతేవా. కిన్తు అగ్నితాపేన మలే నిరస్తే సతి పూర్వసిద్ధ స్వర్ణప్రకాశః స్వయం ప్రకాశతే, న తు నూతన ప్రకాశః సంపాద్యతే. నూతనతయా సంపాద్యతే ఇతిచేత్, పాకే క్షిప్తే ఘటేఽపి అగ్నిః ప్రకాశం సంపాదయేత్, తథానదృశ్యతే అయమర్థోయథా తథామనశ్చ ఆత్మాకారేణ పరిణమమానం ఆత్మప్రతిబింబసహితం సత్ ఆత్మావరకం మిథ్యాభూతమనాదిఅజ్ఞానం బాధతే.నిరస్తే అజ్ఞానే స్వాత్మా స్వయమేవ భాసతే ఇతి మనసైవానుద్రష్టవ్యః ఇతి శాస్త్రస్య తాత్పర్యమ్

"మనసైవానుద్రష్టవ్యః" మనసు చేతనే గ్రహించవలెను అని చెప్పిన శాస్త్రమునకు తాత్పర్యము ఏమి అని అనినచో వినుము అగ్నిచేత తపించిన బంగారమునకు ప్రకాశము కలుగుచున్నది అని వ్యవహారము కలదు అనగా అగ్నిచేత స్వర్ణమున లేని ప్రకాశముస్వయముగా ప్రకాశించదు. కాని అగ్నితాపము చేత దానిమలము (దోషము)తొలగగా పూర్వముఉన్న బంగారము కాంతితో ప్రకాశించును. కాని బంగారమునకు నూతనముగా ప్రకాశమురాదు. క్రొత్త కాంతి వచ్చుచున్నచో అగ్నియందుంచిన పచ్చికుండయందును అగ్ని కొత్తకాంతిని కలిగింపవలసివచ్చును. అట్లొచ్చటను కనిపించుటలేదు. ఈవిషయమెట్లో అటులనే మనస్సు కూడా

ఆత్మాకారముగా పరిణమించుచున్నదై ఆత్మప్రతిబింబముతో కూడి ఆత్మను ఆవరించి యున్న మిథ్యాభూతఅనాది అజ్ఞానమును తొలిగించును. ఆ అజ్ఞానము తొలగగా ఆత్మ మిక్కిలి కాంతితో స్వయంముగా ప్రకాశించుచున్నట్లు స్పష్టముగ తెలియును.ఇదే మనసైవానుద్రష్టవ్యఃఅను శాస్త్రమునకు తాత్పర్యము.

మనశ్చాత్మనైవ జ్ఞాయతే నత్వాత్మామనసా జ్ఞాయతే ఏతద్వా కథమితి చేత్ శృణు దీపేన అంధకార వినాశస్థలే స్థాలీచ తైలమ్చ వర్తిశ్చ ఏతత్ త్రయమపి అంధకారం వినాశయితుం నశక్నోతి తథాపి తద్వర్తి సంబంధ్యగ్నిః దీపనామధేయఃసన్నంధకారంబాధతేఏవమేవ ప్రకృతే స్థాలీ రూప శరీరే కర్మరూపతైలేన ఉత్థాపిత వర్తిరూపమనసి అగ్ని రూపాత్మా ఆరుహ్యా తదభేదేన అవస్థితః సన్ జీవానామపి తత్తద్విషయావరకాజ్ఞాన రూపాంధకారం నిరస్య దీపోఘటపటాది బాహ్యాన్తర పదార్థాన్ ప్రకాశయతి తస్మాత్ హేపుత్ర! దీపప్రకాశో యథాస్వభాసా స్వయమేవ ప్రకాశితః సన్ స్వసంబంధి పదార్థానపి ప్రకాశయతి ఏవమేవాన్తః కరణమారూహ్యా స్వ స్వచైతన్యే నైవప్రకాశమానః ఆత్మాపి స్వసంబంధిపదార్థాన్ బాహ్యాభ్యన్తరాంశ్చ ప్రకాశయతి। అతః ఆత్మనః చిద్రూపత్వం సిద్ధమ్.

మనస్సే ఆత్మవలన తెలియబడుచున్నది. కాని ఆత్మమనస్సు చేత తెలియబడుటలేదు అనిఎట్లు చెప్పవచ్చును? అనినచో వినుము. దీపముచే అంధకారము తొలగును దీపానికి సంబంధించిన ప్రమిద,నూనె, వత్తి,ఈ మూడు అంధకారమును వినాశము చేయుటకు శక్తి కలవి కావు. కాని ఆవత్తికి సంబంధించి ఉన్న అగ్ని దీపము అను పేరు కలదై,అంధకారమును నశింపజేయుచున్నది. ప్రకృతమున ప్రమిదయను శరీరమునకర్మయను నూనెచే,ప్రేరితమై వత్తియను మనస్సునందు అగ్ని అను ఆత్మ అభేదభావముతోనుండి జీవులకుగల ఆయా విషయావరకమైన అజ్ఞానమును చీకటిని తొలగించి దీపము ఘటాపటాది పదార్థములను తెలియంవఅచినట్లు ఆత్మయేం బాహ్యాంతరపదార్థములను ప్రకాశింపజేయుచున్నది. కావున నాయనా! దీపప్రకాశము ఏవిధముగా తన ప్రకాశములచే తాను స్వయముగా ప్రకాశింపబడి తనకు సంబంధించిన

పదార్థములను కూడా ప్రకాశింపచేయునో అదేవిధముగా అంతఃకరణమును ఆశ్రయించి తన చిద్రూపము చేతనే ప్రకాశించుచున్న ఆత్మకూడా తనకు సంబంధించిన పదార్థములను బాహ్యాభ్యంతరవస్తువులను ప్రకాశింపచేయుచున్నది. అందువలన ఆత్మకు చిద్రూపత్వము ఉన్నట్లుస్పష్టమైనది.

అథానందరూపత్వముచ్యతే నిత్యమ్, నిరుపాధికమ్ నిరతిశయమ్, యత్ సుఖం స ఆనందః। స ఏవాత్మనఃస్వరూపమ్ అత ఏవ స్రక్చందనవనితాది విషయేభ్యోజాతమనిత్యం సోపాధికం అతిశయం యుక్తం యత్సుఖం తదాత్మస్వరూపానందో నభవతి తస్మాత్ పూర్వోక్తానంద ఏవాత్మనః స్వరూపం తత్ కథమితి చేత్ సుషుప్త్యానందే తత్సుఖ లక్షణస్య విద్యమానత్వాత్ తమానందమేవేతి జానీహి

ఇక ఆత్మకు ఆనందరూపమున్నట్లు చెప్పబడుచున్నది. నిత్య, నిరుపాధిక,నిరతిశయమైన సుఖమే ఆనందము. అదియే ఆత్మయొక్క స్వరూపము. కావున పూవులు.చందనము,వనితలు,మొదలగు భోగవస్తువుల వలన కలుగు ఆనందము అనిత్యము, సోపాధికము, అతిశయముతో కూడిన ఏ సుఖమైతో కలదో అది ఆత్మ స్వరూపమైన ఆనందము కాదు. కావున పూర్వము చెప్పబడిన ఆనందమే ఆత్మ యొక్క స్వరూపము. అది ఎటులన్నచో సుషుప్తిలో గల ఆనందమున ఆ లక్షణమంతయు ఉన్నది. కావున ఆ ఆనందమే నేను అని తన స్వరూపమని తెలిసికొనుము.

నను సుషుప్తౌ దుఃఖనివృత్తిరేవ దృశ్యతే భవదుక్తానందో నానుభూయతే తస్మాత్ కథం తత్ర సుషుప్తావానంద లక్షణవిచార ఇతిచేత్ శృణు। లోకే సుషుప్తేరుత్థితఃపురుషః అహమేతావన్తం కాలం సుఖమస్వాప్సమితి సుషుప్తావాత్మనః సుఖసద్భావ మేవ వదతి అతఃసుషుప్తౌ అపి స్వానుభవేన ఆనందోఅస్తి

సుషుప్తి యందు దుఃఖ నివృత్తియే కనబడుచున్నది. కాని మీరు చెప్పిన ఆనందము ఉన్నట్లు తెలియుటలేదు కదా సుషుప్తిలో ఆనందలక్షణము ఎట్లు పొసగును అని అడిగినచో వినుము లోకమందు

సుషుప్తినుండిలేచిన పురుషుడు నేను ఇంతవరకు సుఖముగా పడుకొంటిని అని అనుకొనుటవలన సుషుప్తిలో ఆత్మకు సుఖము ఉన్నట్లు చెప్పు చున్నది కావున సుషుప్తియందు అందరికిని అనుభవ పూర్వకముగా ఆనందమే కలదు.

తర్హి భవదుక్తం నిత్యత్వం నిరుపాధికత్వం, నిరతిశయత్వమితి లక్షణత్రయం సుషుప్త్యానందే అస్తి వక్తవ్యమితి చేత్ శృణు ప్రథమతో నిరుపాధికత్వముచ్యతేऽసక్చందనాదివిషయాః ఉపాధయః.తైః జాయమానమ్ సుఖమౌపాధికమ్ తేషు ఉపాధిషు సుషుప్తౌ న కోఽపి, దృశ్యతే సుఖన్తుసర్వైః అనుభూయతే అతః సుషుప్తౌ నిరుపాధికః ఆనందో అస్తీత్యవగమ్యతామ్

మీరు చెప్పిన నిత్యత్వము నిరుపాధికత్వము నిరతిశయత్వము అనుమూడు లక్షణములు సుషుప్తియందుగల ఆనందములో ఉన్నచో చెప్పవలెను కదా అన్నచో, వినుము. మొదట నిరుపాధికత్వము చెప్పబడుచున్నది. పూలు, గంధము మొదలైన విషయములే ఉపాధులు. ఈ ఉపాధులయందు సుషుప్తిలో ఏదియు కనబడుటలేదు. సుఖమైతే అందరికి అనుభవమున ఉన్నది. కనుక సుషుప్తియందు నిరుపాధికమైన ఆనందము ఉన్నదని తెలిసికొనవలయును.

తస్య నిరతిశయత్వం కథమితిచేత్ శృణు। మనుష్యానంద మారభ్య హిరణ్యగర్భానందపర్యంతా ఏకాదశానందాః। తే శతగుణోత్తరాః అతః తేషాంఆనందానాం సాతిశయత్వం బ్రహ్మానందస్య సర్వోత్తరస్య నిరవధికత్వాత్ స్వాధికానందాభావాత్ నిరతిశయత్వం సబ్రహ్మానంద ఏవ సుషుప్త్యానందః అతః తస్య నిరతిశయత్వం సిద్ధమ్ సర్వేఽపి పురుషాః సుఖమేవ అనుభవన్తి అనుభవసమయే మోహినీం సౌందర్యవతీం స్త్రియమపి ప్రబోధయన్తీం ప్రహరన్తి . తదానీం నకిమపీచ్ఛన్తి. పునరుత్థాపితా అపి తమేవ ఆనందం స్మృత్వా అనుభవితుం పునః శయనం కుర్వన్తి అతస్తస్య సుషుప్త్యానందస్య నిరతిశయత్వమే వే త్యవేహి.

ఆ సుషుప్త్యానందమునకు 'నిరతిశయత్వము ఎట్లు? అనినచో వినుము. మనుష్యానందము మొదలు చతర్ముఖబ్రహ్మవరకు కలుగు

ఆనందములు పదకొండుఆనందములు కలవు. ఆఆనందములు ఒక దాని కంటె మరొకటి నూరు రెట్లు ఎక్కువ ఆనందము ఉండును. కావున ఇవి ఒకదాని కంటె మరొకటి మించిన ఆనందములు అతిశయములు కలవి. బ్రహ్మానందమైతే అన్నిటికంటె మించినది నిరవధికమైనది. దానికంటె మించిన ఆనందము లేదు. కావున ఆ ఆనందమునకు నిరతిశయత్వమున్నది. ఆ బ్రహ్మానందమే సుషుప్తిలోని ఆనందము. కావున సుషుప్త్యానందమునకు నిరతిశయత్వము సిద్ధించినది. స్త్రీ పురుషులందరును సుషుప్తి సుఖమే సుఖమని విషయజన్య సుఖము సుఖముకాదని పురుష స్త్రీ పుత్రాది సుఖమును విడిచి మృదుశయ్యాది సాధనములను ప్రయత్నముతో సంపాదించుకొని సుషుప్తి సుఖమునే అనుభవించుచుందురు. అనుభవ సమయములో మోహింపజేయు సౌందర్యవతి యగుస్త్రీని భార్యను కూడా మరచి ప్రహరించెదరు.అపుడు దేనిని కోరరు. లేపబడినను ఆ ఆనందమును స్మరించుకొనుచు దానినే అనుభవించుటకు తిరిగి నిద్రించుచుందురు. కావున ఆ సుషుప్తి ఆనందమునకు నిరతిశయత్వము కలదు అని తెలిసికొనుము.

నిత్యత్వంకథమితి చేత్జాగ్రత్స్వప్నయోః సుఖస్య అనేకరూపేణ అనేకైఃవిషయైఃపృథక్అనుభూయమానత్వాత్ తస్యపరిచ్ఛిన్నత్వేన అనిత్యత్వమస్తి సుషుప్తిసుఖం తు ఏకరూపం, పూర్ణం, జన్యం , చ ,న భవతి అతో నిత్యమ్తథాసతి జాగ్రత్స్వప్నయోరనుభవితవ్యం, తథా నానుభూయతే ఇతిచేత్, జాగ్రత్, స్వప్నయోరపి తత్ సుఖం అస్త్యేవ। కిన్తువృత్తివిశేషైరావృతం, సత్ నానుభూయతే కారణభూతమానందం కార్యరూపఅన్తఃకరణ వృత్తయః కథమావృణ్వంతీతి చేత్ ఆదిత్యం మేఘవత్, అగ్నింధూమవత్, రజ్జుంసర్పవత్, బ్రహ్మానందమపి అన్తఃకరణవృత్తయః, కార్యభూతా అపి ఆవృణ్వన్తి యథా అగ్న్యాదిత్యౌ భస్మ హిమాభ్యాం బాలమూఢ దృష్ట్యా ఆవృతత్వేన ప్రతీయమానావపి వివేకదృష్ట్యా అనావృతౌ తథా బ్రహ్మానందరూపసుషుప్త్యానందశ్చ జాగ్రత్, స్వప్నయోః ఆవృత ఇవబహిర్ముఖానామేవ భాతి. న వివేకినామన్తర్ముఖానామ్. తేషాం తు బ్రహ్మానందః స్వరూపభూతత్వాత్ కాలత్రయే ఽ పి ఏకరూపః సన్ ప్రతీయతే.

అతో(బ్రహ్మానందాభిన్నసుషుప్తి ఆనందస్యాపినిత్యత్వమ్ సిద్ధమ్

ఇక నిత్యత్వము ఎట్లనినచో జాగ్రత్ స్వప్నములందుగల సుఖము అనేకఆకృతులు అనేకవిషయములతో వేరువేరుగా అనుభవింపబడుచున్నది కనుక అది పరిచ్ఛిన్నము కనుకనే దానికి అనిత్యత్వము సుషుప్తి సుఖము మాత్రము ఏకరూపమై, సర్వత్ర పూర్ణమై భాసించుచున్నది. అది పుట్టుట లేదు కనుక నిత్యము. మఱిజాగ్రత్ స్వప్నములలో అది కనిపించవలయును కదా కనిపించుటలేదు అన్నచో జాగ్రత్ స్వప్నములలో కూడా ఆ సుఖము ఉన్నది. కాని వృత్తి విశేషములచేత ఆవరింపబడినందువలన ఆసుషుప్తి ఆనందము అనుభవములోనికి వచ్చుట లేదు. కారణభూతమైన ఈ ఆనందమును కార్యరూపమైన అంతఃకరణవృత్తులు ఎట్లు ఆవరించగలవు? అన్నచో సూర్యుని మేఘము ఆవరించినట్లు అగ్నిని పొగ ఆవరించినట్లు అంతఃకరణవృత్తులు కార్యభూతములైనను ఆత్మను ఆవరించును. అగ్నినిభస్మము, సూర్యుని మంచు ఆవరించినట్లు బాలురైన, మూఢ బుద్ధులైన వారికి వారి దృష్టితో ఆవరింపబడనట్లు అనిపించినను వివేక దృష్టితో అవి ఆవరింపబడలేదు. అట్లే బ్రహ్మానందరూపసుషుప్తి ఆనందముకూడా జాగ్రత్ స్వప్నములయందు వృత్తులచో ఆవృతమై నట్లు బహిర్ముఖులకు అనిపించును కాని వివేకులైన వారికి అంతర్ముఖులైన వారికి అట్లనిపించదు. వారికి ఆ బ్రహ్మానందము స్వరూప భూతమగుటవలనమూడుకాలములయందును ఏకరూపముగ ఉన్నట్లు ప్రకాశించును., కావున బ్రహ్మానందము కంటె భిన్నము కాని సుషుప్తి ఆనందమునకు కూడా నిత్యత్వము సిద్ధమైనది.

ఏవం నిరుపాధిక, నిరతిశయ, నిత్యం, బ్రహ్మానంద త్రివిధ లక్షణానామస్మాన్వపి అనుభూయమానత్వాత్ అస్మాకం ఆనందరూపత్వమస్తి। ఏవమ్ సచ్చిదానందలక్షణస్య అస్మాసు శ్రుతియుక్తి, అనుభవసిద్ధత్వాత్. అస్మాకమాత్మనః సచ్చిదానందబ్రహ్మత్వమ్ సిద్ధమిత్యవేహి వయం సచ్చిదానందరూపా ఇతి అనుభవః కథమాయాతీతిచేత్షడ్విధలింగైః వేదాన్తశాస్త్రతాత్పర్యావధారణ రూపపూర్వక

ఉపనిషద్వాక్యశ్రవణం గురుముఖాత్ శృత్వా శ్రవణానుసారేణ మననం, మననానుసారేణ నిదిధ్యాసనంకృత్వా పశ్చాత్బహుకాలంస్థితవత: సచ్చిదానందబ్రహ్మైవాహమితి జ్ఞానం జాయతే, ఇదం పరోక్షజ్ఞానమ్

ఈ ప్రకారముగా నిరుపాధిక,నిరతిశయ, నిత్య, బ్రహ్మానందము యొక్క మూడు లక్షణములును మనయందే ఉన్నట్లు అనుభవముల ద్వారా ఆ సచ్చిదానంద లక్షణములు మనకు ఉన్నట్లు తెలిసినది కనుక మన ఆత్మకు కూడా సచ్చిదానంద బ్రహ్మత్వము స్పష్టముగ తేలినదని తెలిసికొనుము. మనము సచ్చిదానంద రూపులమని ఎట్లు అనుభవమునకు వచ్చును అన్నచో పూర్వము చెప్పిన షడ్విధ లింగముల చేతను వేదాంత శాస్త్రతాత్పర్యమును అవధారణ చేసికొనుట అను శ్రవణమును గురుముఖముగా చేసి శ్రవణానుసారము మననమును, మననము ననుసరించి నిదిధ్యాసనమును చేసిన తరువాత చాలా కాలము అట్లే ఉండి పోయినచో నేను సచ్చిదానంద బ్రహ్మమును అనుజ్ఞానము కలుగును. ఇదియే పరోక్షజ్ఞానము.

ఇదమేవ పరోక్షజ్ఞానంప్రాప్య అహం కర్తా, మమేదం కర్మ, అహం ఏతజ్జాతి:,ఏతత్వర్ణ:,ఏతదాశ్రమ:,ఇత్యభిమానంసర్వం విహాయ బ్రహ్మైవాహమస్మీత్యనుభవం తత్ర ప్రయత్నంతత్ర కర్తృత్వం చ విహాయ తూష్ణీం సుషుప్తావివ జలేలవణవత్ బ్రహ్మణి విలీనఅన్త:కరణస్య నిర్విశేషంస్థితవతోఽస్య మహాత్మనోనిర్విశేషంయత్జ్ఞానమ్ స్వయమేవ స్ఫురతి స ఏవ అపరోక్షానుభవ:.

ఈ పరోక్షజ్ఞానమును పొంది నేను కర్తను, ఇది నా కర్మ. నేను ఈజాతివాడను, ఈ వర్ణము వాడను, ఈ ఆశ్రమము వాడను అను మొదలైన అభిమానము అంతయు విడిచి పెట్టి బ్రహ్మమునే నేను నేనే ఆబ్రహ్మమును అను అనుభవమును పొందుటకు, దానికై నిరంతర ప్రయత్నము బ్రహ్మభావము యెడల తనకు గల కర్తృత్వమును కూడ విడిచి పెట్టి ఊరకుండి నిద్రయందువలె, జలమందు ఉప్పుకరిగినట్లు బ్రహ్మమందు అంత:కరణములయింపగా విశేషరహితుడై ఉన్నమహాత్మునికి

కలుగు నిర్విశేషమైన ఏజ్ఞానము స్వయముగా స్ఫురించునో, అదియే అపరోక్షానుభవము.

అయమేతాదృశానుభవో యదాజాయతేతదా అయమ్ పురుషః, స్వానుభవరూపః తదానందరూపః భవతి తస్యానందవైభవమ్ స ఏవ జానాతి నాన్యః। తథా తదానందప్రతిపాదక వేదాంతోఽపి నజానాతి। నవక్తుమపి శక్నోతి తదానందమనుభవన్స పురుషోఽపి తమానందం కేవలమనుభవతి. సుషుప్త్యానందమివ నాన్యస్మైవక్తుం శక్నోతిమనసాపి స్మర్తుం నశక్నోతి హే పుత్ర! తస్మాత్ తవ స్వానుభూతిం త్వమేవానుభవితుం శక్తః। యః ఈశ్వరః కృపయా గురురూపేణ ఆగత్య త్వాంబోధితవాన్ స గురురూప ఈశ్వరోఽపి ఇదమిత్థమితి వక్తుం నశక్నోతి హేపుత్ర! త్వమేవం స్వానుభవం జానన్నపి అజానన్నివ ఆనందరూపేణ తిష్ఠ

ఇతి మననే ఏకాదశ వర్ణకం సమాప్తమ్.

ఇటువంటి అనుభవము ఎప్పుడు కల్గునో అప్పుడు ఈ పురుషుడు స్వానుభవ రూపుడై బ్రహ్మానందరూపుడగును. ఆతనిఆనందవైభవము ఆతనికే తెలియును. అది ఇంకొకనికి తెలియబడునది కాదు. అటులే ఆ ఆనందమును ప్రతిపాదించు వేదాంతశాస్త్రము కూడా దానిని తెలిసికొన జాలదు చెప్పను లేదు. అప్పుడు ఆ ఆనందమును అనుభవించుచున్న పురుషుడు కూడా కేవలము ఆనందమును అనుభవించును. సుషుప్తి ఆనందము వలె ఆ ఆనందమును మరియొకనికి చెప్పలేడు. మనస్సుతో స్మరించలేడు. కావున కుమారా! నీ స్వానుభూతిని నీవే అనుభవించగలవు. ఏ ఈశ్వరుడు దయతో గురురూపముగా వచ్చి నీకు తత్త్వమును తెలుపునో ఆ గురురూప ఈశ్వరుడు కూడా ఇదమిత్థమని ఈ స్వానుభవము చెప్పలేడు. కావున కుమారా! నీవు ఈ అనుభవమును తెలిసికొనినను తెలియని వానివలె ఆనందరూపముగానుండుము.ఇట్లు మననమునందు ఏకాదశవర్ణకము సమాప్తము.

## 12వ వర్ణకము

అస్మిన్ ద్వాదశ వర్ణకే ఆత్మనో అఖండార్థరహస్యమపి కృపయా గురుః

ఉపదిశతి।

ఈ పన్నెండవ వర్ణకము నందు ఆత్మ యొక్క అఖండార్థ రహస్యమునుకూడా దయతో గురువు ఉపదేశించుచున్నాడు.

శిష్య ఉవాచ హే స్వామిన్! భవద్భిః ఏకాదశ వర్ణకేషు ఉపదిష్టైః అర్థైః దేహాది పంచకోశేషు మమాహమితి ఆత్మబుద్ధిః గలితా। బుద్ధిప్రకాశకం సచ్చిదానంద స్వరూపం యద్బ్రహ్మ తదేవాహమితి ఆత్మజ్ఞానమ్ సిద్ధమ్। సర్వేసంశయాః నష్టాః।

శిష్యుడిట్లడిగినాడు:-

స్వామీ! మీచేత పదకొండు వర్ణకములందు ఉపదేశించిన విషయముల ద్వారా దేహాదిపంచకోశములందు నాది నేను అనెడి దేహాత్మబుద్ధి పోయినది. బుద్ధిని ప్రకాశింపజేయుసచ్చిదానంద స్వరూపమగు ఏ బ్రహ్మము కలదో అదియే నేను అనెడి ఆత్మజ్ఞానము కూడా కల్గినది. సంశయములన్నియు నష్టములైనవి.

తథాపి పునరేకః సంశయో వర్తతే। స కః ఇతి చేత్శృణు। అయమాత్మా సద్రూప ఇతి, చిద్రూప ఇతి, ఆనందరూప ఇతి ఉక్తం కిల। ఏవం త్రివిధరూప ప్రతిపాదకాని త్రీణ్యపి పదాని త్రివిధ భేదభిన్నార్థం ప్రతిపాదయన్తి। కింతు అభిన్నార్థకానీవ మమ ప్రతిభాంతి తస్మాత్ ఏతస్య సచ్చిదానందపదత్రయస్య భిన్నార్థవత్ ప్రతీయమానస్య అఖండార్థత్వం కథం సిద్ధ్యేత్। ఇతి శిష్య వచః శ్రుత్వా గురురుపదిశతి।

కాని మరల ఒక సంశయము కల్గుచున్నది. అది ఏమనినచో వినుడు. ఈ ఆత్మ సద్రూపమని, చిద్రూపమని, ఆనందరూపమని నిశ్చయముగా తమరు చెప్పియుంటిరి కదా ఈమూడు లక్షణములను ప్రతిపాదించు ఈ పదములు మూడురకముల భిన్నార్థములను తెలుపుచున్నవి. కావున ఈ సచ్చిదానందములమూటికిని భిన్నార్థములు ఉండగా అఖండార్థత్వమెట్లు సిద్ధించును? అని ఇట్లు పల్కిన శిష్యునియొక్క వచనమును విని గురువు ఉపదేశించుచున్నాడు.

హే పుత్ర ! అఖండార్థః కః? ఇతిచేత్ దేశ పరిచ్ఛేదః, కాలపరిచ్ఛేదః

, వస్తుపరిచ్ఛేదః ఇతి త్రివిధ పరిచ్ఛేదరహితతయా అపరిచ్ఛిన్నః అర్థః అఖండః ఇతి జానీహి!

కుమారా! అఖండార్థము ఎట్లు కుదురుననినచో వినుము. దేశపరిచ్ఛేదము,కాలపరిచ్ఛేదము, వస్తుపరిచ్ఛేదము అని మూడు పరిచ్ఛేదములు కలవు. ఈ పరిచ్ఛేదములు లేనిది అపరిచ్ఛిన్నము. అఖండమైన పదార్థమని తెలిసికొనుము.

తర్హి అఖండార్థస్య ఏతాని త్రీణి లక్షణాని కిమర్థానీతి చేత్ శృణు। ఆకాశస్యాపి వ్యాపకత్వేన దేశపరిచ్ఛేదరహితత్వాత్ తత్రాతి వ్యాప్తివారణాయ కాలపరిచ్ఛేదరహితత్వం ఉపాత్తమ్। ఆకాశస్య ఉత్పత్తివినాశవత్త్వేన కాల పరిచ్ఛేదః అస్తీతి న తత్రాతివ్యాప్తిః। దేశకాలపరిచ్ఛేద రహితత్వమాత్రోపాదానే కాలేఅతివ్యాప్తిః కాలస్య దేశపరిచ్ఛేదో నాస్తి। సర్వత్ర వ్యాప్య స్థితత్వాత్। కాలపరిచ్ఛేదోఽపి నాస్తి। స్వస్యస్వేనైవ పరిచ్ఛేత్తుం అశక్యత్వాత్। అత ఉక్తమ్ వస్తు పరిచ్ఛేదరహిత ఇతి। కాలస్య స్వభిన్నవస్తు సద్భావాత్ వస్తుపరిచ్ఛేదః అస్తి। ఇతి ఆత్మనః ఏతత్ త్రివిధ పరిచ్ఛేద రాహిత్యమస్తి। అతః త్రీణి లక్షణాన్యుక్తానీతి। తైఃజ్ఞేయః

మరి ఈ అఖండార్థమునుకు ఈ మూడు లక్షణములు ఎందులకు అనినచో వినుము. ఆకాశము కూడా సర్వవ్యాపకమై యున్నందున దేశ పరిచ్ఛేద రహితమైనది. కనుక అచట అతివ్యాప్తి అను దోషమును పోగొట్టుటకు కాలపరిచ్ఛేదరహితత్వమను లక్షణము చెప్పబడినది. ఆకాశమునకు ఉత్పత్తి వినాశములు ఉన్నందున కాలపరిచ్ఛేదము కలదు. కాలపరిచ్ఛేద రహితత్వ లక్షణము ఆకాశమున లేదు. కావున అతివ్యాప్తి లేదు. దేశకాల పరిచ్ఛేద రహితత్వము మాత్రము చెప్పినచో కాలమున అతివ్యాప్తి దోషము వచ్చును. కాలమునకు దేశపరిచ్ఛిన్నత లేదు.కాలమంతటా నిండియున్నది. ఇకకాల పరిచ్ఛేదము కూడా లేదు. తనకు తనతోపరిచ్ఛిన్నత్వము కుదురదు కావున వస్తుపరిచ్ఛేద రహితమనియు లక్షణముగా చెప్పబడినది. కాలమునకు దానికంటె వేరైన వస్తువుఉన్నందు వలన వస్తుపరిచ్ఛిన్నత్వముకలదు. ఆత్మ కు ఈమూడు

విధముల పరిచ్ఛేదములు లేవు. కావున మూడు లక్షణములు చెప్పబడినవి. వారిచే ఆత్మ తెలిసికొనదగినది.

నను భవద్భిః ఉక్తం అఖండార్థలక్షణమాత్మని ప్రదర్శయితవ్యమ్। ఆత్మన ఏవాఖండార్థత్వాత్ తదాత్మని న దృశ్యతే।కథమితి చేత్ ఉచ్యతే। సర్వేషాం అస్మిన్ దేశే తిష్ఠామి,తస్మిన్ దేశే న తిష్ఠామీత్యనుభవేన దేశ పరిచ్ఛేద రాహిత్యం నాస్తి ।అస్మిన్ వర్షే జాతఃఇతః పరం దశమే వర్షే మరిష్యామీత్యనుభవేన ఆత్మనః కాల పరిచ్ఛేద రాహిత్యం నాస్తి , అహం బ్రాహ్మణః నాహం క్షత్రియః ఇత్యనుభవాత్ ఆత్మనః వస్తు పరిచ్ఛేదరాహిత్యమపి నాస్తి.

మీచే చెప్పబడిన అఖండార్థలక్షణము ఆత్మయందుఉన్నట్లు చూపవలెను కదా! ఆత్మయందీ అఖండార్థముఉన్నట్లు తెలియుట లేదు. ఎటులనినచో చెప్పబడును. ఎవరికైనను నేనీ దేశములో ఉన్నాను. ఆదేశములో లేను. అను అనుభవముండుటచేత దేశపరిచ్ఛేద రహితత్వము (అంతట ఉండుట) లేదు. నేను ఈ సంవత్సరమునందు పుట్టితిని. ఇక పదిసంవత్సరాల ఉండి పిదప మరణింతును. అను అనుభవము ఉండుటచే ఆత్మకు కాలపరిచ్ఛేదరాహిత్యము (అన్ని కాలములలో ) ఉండుట లేదు. నేను బ్రాహ్మణుడను, క్షత్రియుడను కాదు, అను అనుభవముండుటచే ఆత్మయందు వస్తుపరిచ్ఛేదరాహిత్యము లేదు.

భవద్భిఃత్రివిధ పరిచ్ఛేద శూన్య ఆత్మేతి కథముక్తమితిచేత్ శృణు।

మీచేత త్రివిధపరిచ్ఛేద రహితమైనది (అన్నిచోట్ల,అన్నికాలాలలో, అన్ని వస్తువులైనది) ఆత్మ అని ఎటుల చెప్పబడినదనినచో వినుము.

తవ పూర్వమేకాదశవర్ణకే ఆత్మానాత్మలక్షణకథనావసరే ఆత్మా పరిపూర్ణః, అనాత్మా పరిచ్ఛిన్నః, దృశ్యం సర్వమధ్యస్తమితి ఉపదిష్టం ఖలు। తథాపి ఇదానీం ఆత్మలక్షణం ప్రతి శపథం కరోషి। తస్మాత్త్వం శిష్యోవా ప్రతివాదీవా ఇతి సందేహః? శిష్యశ్చేత్ కృపయా పునరపి అనుగ్రహం కుర్మః ।ప్రతివాదీచేత్ క్షమయా తూష్ణీంభవిష్యామఃఅథవా కోపే నశపిష్యామఃభవతః కోపో వాదిని ఫలిష్యతి వా ఇతిచేత్ । శిష్యే ఉపదేశార్థం క్రియమాణోఽనుగ్రహః ఫలిష్యతి చేత్, వాదిని నిగ్రహోఽపి ఫలిష్యతి। లోకే

నిగ్రహానుగ్రహసామర్థ్య సహితస్య మహారాజస్య బ్రహ్మజ్ఞానినశ్చ తత్త్వతో భేదో నాస్తీతి జానీహి!

నీకు ఇదివరలో పదకొండవవర్ణకమున ఆత్మానాత్మ లక్షణము చెప్పు సమయమున ఆత్మ పరిపూర్ణమనియు అనాత్మ పరిచ్ఛిన్నమనియు దృశ్యమంతయ అధ్యస్తమని (ఆరోపితమని) ఉపదేశింపబడినది కదా! అయినను ఆత్మ లక్షణమును గూర్చి ఇప్పుడు ఆక్షేపము చేయుచున్నావు. కనుక నీవు శిష్యుడవా? ప్రతివాదివా? అని సందేహము కల్గుచున్నది. శిష్యుడవైనచో తిరిగి దయతో అనుగ్రహించగలము. ప్రతివాదివైనచో ఓర్పుతో ఉదాసీనత వహించగలము. లేదా కోపముతో శపించగలము. మీ కోపము వాదిపట్ల ఫలించునా అనినచో శిష్యునివిషయముచూపిన అనుగ్రహమువలె నిగ్రహము అటులనే ఫలించును. లోకమందు నిగ్రహ, అనుగ్రహ సామర్థ్యవంతుడైన మహారాజునకును బ్రహ్మజ్ఞానికిని తత్త్వతః (వాస్తవముగా) భేదము లేదని తెలిసికొనుము.

తర్హి హే స్వామిన్ ! సద్గురోఃకృపాపాత్ర భూతశిష్య ఏవాహమ్। మమ ఏకః సందేహోజాతః। తస్మాత్ ఏవం పృష్టవాన్ న తు తర్కేణేతి వదసి చేత్ శృణు।

ఓ స్వామీ ! సద్గురుకృపకు పాత్రుడనైన శిష్యుడనే. నాకు ఒక సందేహము కల్గినది.కావున అడిగితిని వాదబుద్ధితో మాత్రము కాదు అని అనినచో వినుము.

ఇదమ్ దేశకాల వస్తు పరిచ్ఛేద త్రయం స్వభావతో దేహస్య ఏవ। నతు పూర్ణప్రత్యగాత్మనః పరిచ్ఛేదత్రయమస్తి, ప్రత్యగాత్మస్వరూపపరి పూర్ణబ్రహ్మణః నాస్తీతి కథం జ్ఞాతవ్యమితి చేత్ శృణు ।ఘటః సన్, పటః సన్ కుడ్యం సత్, కుసూలం సత్ ఇతి పృథ్వీసతీ, ఆపః,సత్యః తేజః సత్, వాయుః సన్,ఆకాశః సన్ ఇతి చ భూత భౌతిక ప్రపంచేసద్రూపేణ అనుభూయమానత్వాత్ఆత్మనో విభుత్వమ్। ఏవం సర్వవ్యాపకస్యాత్మనో దేశపరిచ్ఛేదో నాస్తి। ఆత్మనః పూర్వోక్తప్రకారయుక్త్యా అనాదిత్వేన నిత్యత్వాత్ భూతభవిష్యత్కాలపరిచ్ఛేదో నాస్తి। వస్తు పరిచ్ఛేద రాహిత్యమాత్మనః కథమితి

చేత్ శృణు। ఆత్మనః సర్వాత్మకత్వాత్ వస్తు పరిచ్ఛేదో నాస్తి।

ఈ దేశ కాల వస్తు పరిచ్ఛేదములు మూడు స్వభావసిద్ధముగా దేహమునకే గాని పూర్ణమైన ప్రత్యగాత్మకు లేవు. ఈ మూడు పరిచ్ఛేదములను ప్రత్యగాత్మస్వరూప బ్రహ్మకు లేవు. అదెట్లు తెలిసికొనవలయునన్నచో వినుము. ఘటము ఉన్నది. పటము ఉన్నది. గోడ ఉన్నది, మూకుడు ఉన్నది, భూమి ఉన్నది, నీరు ఉన్నది, అగ్ని ఉన్నది, వాయువు ఉన్నది, ఆకాశము ఉన్నది, అని భూత భౌతిక ప్రపంచమున ఆత్మయే సర్వత్ర సద్రూపముగా(ఉన్నదిగా) తెలియబడుచున్నది. కావున ఆత్మకు సర్వవ్యాపకత్వము కలదు. సర్వవ్యాపకమైన ఆత్మకు ఈవిధముగా దేశపరిచ్ఛిన్నత్వము లేదని తెలిసినది. పూర్వము చెప్పబడిన యుక్తి ప్రకారము అనాదియై నిత్యమైనది. కనుక ఆత్మకు భూత భవిష్యత్ కాల పరిచ్ఛిన్నత్వము లేదు. వస్తు పరిచ్ఛేద రాహిత్యము ఆత్మకు ఎట్లనినచో వినుము. ఆత్మ సర్వస్వరూపమైనది. కనుక వస్తు పరిచ్ఛిన్నత్వము కూడా దానికి లేదు.

వస్తూనికానీతిచేత్సజాతీయభేదభిన్న,విజాతీయభేదభిన్న, స్వగతభేదభిన్నాని వస్తూని। తాని వా కథమితి చేత్। వృక్షస్య వృక్షాంతరాత్ సజాతీయభేదః। వృక్షస్య శిలాదేః విజాతీయ భేదః। వృక్షస్య పత్రపుష్పఫలాదేః స్వగతభేదః। అస్య త్రివిధస్యాపి భేదస్య ఆత్మని అభావాత్ ఆత్మా భేదశూన్యః ।అత ఏవ ఆత్మనో వస్తుపరిచ్ఛేదో నాస్తీతి జానీహి।

వస్తువులు ఎన్ని విధములనినచో సజాతీయభేదభిన్నములు, (సమాన ధర్మమున్నను వేరైనవి) విజాతీయభేదభిన్నములు (విరుద్ధ ధర్మము గల వానినుండి వేరైనవి) స్వగతభేదభిన్నములు (తనలోనిభేదరూప అవయవములుకానివి) అనునవి వస్తువులు. అనగా ఏమి అనినచో వృక్షమునకు మరియొకవృక్షమునకు జాతి ఒకటైనను ఒక వృక్షము మరియొక వృక్షము కాదు. వానికి భేదము కలదు. ఇది సజాతీయ భేదము. వృక్షమునకు,రాయి మున్నగు వానికి ఒక జాతి లేదు కావున అవి ఒకటికావు. ఇది విజాతీయభేదము. వృక్షమునకు పత్ర,పుష్పఫలములను దాని అవయవములకు ఐక్యము లేదు. ఇది స్వగతభేదము. ఈమూడు

విధములైన భేదములు కూడా ఆత్మయందు లేనందువలన ఆత్మ అన్నివస్తువులైనది. కనుక ఆత్మకు వస్తుపరిచ్ఛేదము లేదని తెలిసికొనుము.

న ఆత్మనః సజాతీయ విజాతీయ స్వగతభేదా న సన్తీతి వక్తుం శక్యతే। కథమితిచేత్। ఏకమేవ చైతన్యం,బ్రహ్మచైతన్యం, ఈశ్వరచైతన్యం, కూటస్థ చైతన్యం,జీవ చైతన్యమితి భిన్న భిన్నం వర్తతే। అతః సజాతీయ భేదోఽస్తి। ఆత్మస్వరూపం బ్రహ్మేతి, అనాత్మ స్వరూపం ప్రపంచః ఇతి ఉభయోః భేదస్య వర్తమానత్వాత్ విజాతీయ భేదఃఅస్తి బ్రహ్మణఃస్వరూపాణి సచ్చిదానందాః ఇతిభేదస్య వర్తమానత్వాత్ స్వగతభేదోఽస్తి। ఏవం భేదత్రయే స్థితే ।ఆత్మనో భేదత్రయం నాస్తీతి కథమితి చేత్। శృణు।

కాని ఆత్మకు సజాతీయ విజాతీయ స్వగత భేదములు లేవని చెప్పుట కుదురదు. ఎటులనినచో ఒకే ఒక చైతన్యము బ్రహ్మచైతన్యము, ఈశ్వరచైతన్యము, కూటస్థచైతన్యము జీవచైతన్యము అని వేరుగా చెప్పబడుచున్నది. అందుచే సజాతీయభేదము ఉన్నది. ఆత్మస్వరూపము బ్రహ్మయని, అనాత్మస్వరూపము. ప్రపంచమనియు రెంటికి భేదమున్నది కనుక విజాతీయభేదముకలదు. బ్రహ్మమునకు సచ్చిదానందములనునవి స్వరూపములని చెప్పబడుచున్నందున స్వగతభేదము కూడా కలదు. ఈ విధముగా మూడు లేవని చెప్పుట ఎట్లు కుదురును అని అనినచో వినుము.

ఆకాశ ఏక ఏవ । ఉపాధి భేదేన మహాకాశ ఇతి, మఠాకాశ ఇతి, ఘటాకాశ ఇతి ఘటజల ప్రతిబింబాకాశ ఇతి చ భేదేన యథా ప్రతీయతే, తథా మాయోపాధినా ఏకమేవ చైతన్యం బ్రహ్మేతి, ఈశ్వర ఇతి చ అవిద్యోపాధినా కూటస్థ ఇతి, జీవ ఇతి చ కేవలం ప్రతీయతే॥ ఏవం విచార్యమాణే ఆత్మనఃసజాతీయ భేదో నాస్తి।

ఆకాశము ఒక్కటియే ఉపాధి భేదము చేత మహాకాశమని, మఠాకాశమని, ఘటాకాశమని, ఘటజల ప్రతిబింబాకాశమని భిన్నముగా (వేరుగా) ఉన్నట్లు చెప్పబడుచున్నది. అటులనే మాయోపాధి చేత ఒకే ఒక చైతన్యము బ్రహ్మము అని, ఈశ్వరుడని, అవిద్యోపాధిచేత కూటస్థుడని, జీవుడని,కేవలము చెప్పబడుచున్నది. కాని తత్త్వవిచారణ చేసినచో ఆత్మకు సజాతీయభేదము లేదనియే తేలును.

ఆత్మనః విజాతీయ భేదోఽపి నాస్తి। కథమితి చేత్ శృణు । రజ్జుం వినాసర్పో యథానాస్తి, ఆకాశం వినా యథామాలిన్యంనాస్తి తథా ఆత్మానం వినాఅనాత్మాపినాస్తి అధిష్ఠానం వినాఆరోపితం సర్వం మిథ్యైవ। మిథ్యా నామ వంధ్యాపుత్ర, శశ విషాణాదివత్ కాలత్రయే-పి అవిద్యమానత్వమ్। అనాత్మనః పరమార్థతః అవిద్యమానత్వాత్ ఆత్మనో విజాతీయభేదో నాస్తి।

ఆత్మకు విజాతీయభేదము కూడా లేదు. ఎటులనినచో వినుము. రజ్జువు లేకుండా సర్పము ఎటుల ఉండదో, ఆకాశము లేకుండా ఎటుల మాలిన్యము ఉండదో అటులనే ఆత్మ లేకుండా అనాత్మ కూడా ఉండదు. అధిష్ఠానము లేకుండా ఆరోపింపబడునదంతయుమిథ్యయే. మిథ్య అనగా వంధ్యాపుత్రునివలె, కుందేటి కొమ్మువలె మూడు కాలముల యందుఎపుడును లేకుండుట. ఆవిధముగా అనాత్మ పరమార్థముగా ఎప్పుడును లేనందు వలన ఆత్మకు విజాతీయ భేదము లేదు.

స్వగత భేదః కథం నాస్తి ఇతిచేత్ శృణు। ఆత్మా సాక్షీ కూటస్థః పారమార్థికః, ప్రాజ్ఞః, బ్రహ్మ,సత్‌చిత్ ఆనందః నిత్యఃఏకః,పూర్ణః, ఇత్యాది వివిధ వాక్య నామాని చ ఏకస్మిన్ నిర్విశేషాత్మ స్వరూపప్రకాశనే తాత్పర్యవన్తి నతు స్వరూపభేదే। ఆత్మనో నిర్విశేషత్వాత్, నిరంశత్వాత్ చ । తస్మాత్ స్వగతభేదో నాస్తీత్యేవం జానీహి।

ఇక ఆత్మకు స్వగతభేదము ఎటుల లేదు. అనినచో వినుము. ఆత్మసాక్షి, కూటస్థుడు, పారిమార్థికుడు, ప్రాజ్ఞుడు, బ్రహ్మము,సత్తు,చిత్తు, ఆనందము,నిత్యము-ఏకము పూర్ణము, అను మొదలైన వివిధ వాక్యములు పేర్లు ఒకేఒక నిర్విశేషమైన ఆత్మస్వరూపమును తెలుపుటకు ఉద్దేశింపబడినవి కాని, స్వరూపభేదమునుఉద్దేశించినవి కావు. వస్తుతః ఆత్మ నిర్విశేషము, నిరంశము, ఏవిశేషములేనిది . ఏభాగములు లేనిది. కనుక ఆత్మకు స్వగతభేదము కూడా లేదని తెలియును.

నను సచ్చిదానందపదానాంభిన్నార్థత్వాత్ హస్తకరపాణివత్ పర్యాయత్వాభావాత్ తైః ప్రతిపాద్యమానస్యాత్మనః స్వగతభేదే భవితవ్యమితి చేత్। లోహితోష్ణ ప్రకాశో దీప ఇత్యత్ర యథా దీపస్య స్వగత భేదోనాస్తి,

ఏవం సచ్చిదానంద ఆత్మేత్యత్రాపి స్వగత భేదో నాస్తి।

సచ్చిదానందపదములకు భిన్నార్థముఉన్నది కదా! హస్తము కరము, పాణి అను శబ్దములవలె అవి పర్యాయపదములు కావు కదా! అట్టి శబ్దములతో ప్రతిపాదింపబడిన ఆత్మకు స్వగత భేదము ఉండవలయును కదా అన్నచో ఎరుపుతనము,వేడి, వెలుగు గలది దీపమనిన చోట దీపమునకు స్వగతభేదము ఎట్లు లేదో అట్లే సచ్చిదానందమైనది ఆత్మ అనినప్పుడు కూడా ఆత్మకు స్వగత భేదము లేదు.

తర్హి పత్ర,పుష్ప,ఫలరూపో వృక్ష ఇత్యత్రాపి స్వగత భేదో న స్యాదితి చేత్-న. తత్ర వృక్షస్యసర్వవ్యాపి పత్రాది రూపం నోచ్యతే? ఏక స్మిన్ ప్రదేశే పత్రరూపః ఏకస్మిన్ ప్రదేశే పుష్పరూపః ఏకస్మిన్ ప్రదేశే ఫలరూపః। ఇత్యుచ్యతే। అతః తత్ర స్వగత భేదో ఽస్తి సచ్చిదానందరూప ఆత్మేత్యత్ర సర్వాంశేనాపి ఆత్మనః సచ్చిదానందరూపత్వస్య ప్రతిపాద్యమానత్వాత్, లోహితోష్ణప్రకాశో దీప ఇతి సర్వాంశేనాపి లోహితోష్ణప్రకాశత్వేన ప్రతిపాద్యమానస్య దీపస్యేవ స్వగతభేదో నాస్తి।

మరి పత్ర, పుష్ప, ఫలరూపములతో ఉన్న వృక్షమునకు కూడా స్వగత భేదము లేదని చెప్పవలసివచ్చును కదా అనినచో కాదు. అట్లు చెప్పరాదు. అచ్చట వృక్షమునకు సర్వవ్యాపియగు, పత్రాది రూపత్వము లేదు. వృక్షము ఒక ప్రదేశమునందు పత్రరూపముగను మరి యొక ప్రదేశమందు పుష్పరూపముగను. వేరొక ప్రదేశమందు ఫలరూపముగ ను ఉన్నది. అందుచే అచ్చట స్వగత భేదము కలదు. సచ్చిదానందరూపమైనది ఆత్మ అని అన్నచోట అన్నిభాగములయందును అంతటా సచ్చిదానందరూపమే ఆత్మకు ప్రతిపాదింపబడుచున్నది. ఎరుపు, వేడి, ప్రకాశము గలది దీపము అనినపుడు సర్వాంశములయందు కూడా ఎరుపు.వేడి,ప్రకాశమున్నట్లు ఆత్మకు కూడా స్వగత భేదము లేదు.

ఏవం చేత్ శ్రుతిః "ఆత్మాసద్రూపః, చిద్రూపః,ఆనందరూపః," ఇతి పునః కిమర్థం ఉపదిశతి। ఏకేనైవోపదేశేన ఆత్మానం జ్ఞాతుమ్ శక్యత్వాదితి చేత్ శృణు। శ్రుతేః తాత్పర్యం బ్రవీమి। కిమితి చేత్ ఆత్మనిష్ఠ సత్త్వం, జగతి,

చిత్త్వం జడేషు బుద్ధ్యాదిషు, ఆనందత్వం పుత్ర భార్యాదిషు, ఏవంజగన్నిష్ఠం, అసత్త్వం, బుద్ధ్యాదినిష్ఠం జడత్వం, పుత్రభార్యాదినిష్ఠందుఃఖత్వం చ సచ్చిదానందే ఆత్మని చ పరస్పరం వైపరీత్యేన అవిద్యయా ఆరోపితమ్। అతః సర్వే జగత్ సత్యం బుద్ధ్యాదయః చేతనాః పుత్ర భార్యాదయః, ఆనందరూపాః, అహం నశ్వరః, అహం జడః, అహం దుఃఖీతి చ పరిభ్రమన్తి। ఏతత్ భ్రాన్తి నివృత్తయే మాతృభూతా శ్రుతిః జీవాన్ ప్రత్యుపదిశతి। కథమితి చేత్- హే జీవాః యూయం సచ్చిదానందరూపాః, ఏవేతి బోధనార్థమ్ ఆత్మా సద్రూపో, నానృతరూపః, చిద్ రూపో, న జడరూపః, ఆనందరూపో , న దుఃఖరూపః, ఇతి తత్తత్ భ్రాన్తి నివృత్త్యర్థం బోధయతీతి జానీహి। అతః శ్రుతిః ఆత్మనః సచ్చిదానందరూపేణ భేదం న బోధయతి!

ఆత్మస్వగత భేదము లేనిదైనచో శ్రుతి ఆత్మ సద్రూపమని, చిద్రూపమని, ఆనందరూపమని మాటిమాటికేల ఉపదేశించుచున్నది? ఒకసారి చెప్పిన తెలియును కదా! అనినచో వినుము. శ్రుతి అభిప్రాయమునే చెప్పుచున్నాను. అదేమనగా ఆత్మయందలి సత్త్వము జగత్తునందును, చిత్త్వము జడమైన బుద్ధ్యాదులందును ఆనందత్వము పుత్ర భార్యాదులయందు ఆరోపింపబడినది. ఇట్లే జగన్నిష్ఠ అసత్త్యము బుద్ధ్యాదులందలి జడత్వము పుత్ర భార్యాదులందలి దుఃఖత్వము సచ్చిదానందమైన ఆత్మయందును పరస్పరము విరుద్ధముగా అవిద్యచే ఆరోపింపబడినది. కనుకనే సర్వులు జగత్తు సత్యమనియు, బుద్ధ్యాదులు చేతనములనియు పుత్రభార్యాదులు ఆనందరూపులనియు నేను నశించువాడను, నేను జడుడను, నేను దుఃఖిని, అనియు పరిభ్రమించుచున్నారు. ఈ భ్రాంతినివృత్తికొరకే తల్లియైన శ్రుతి జీవులనుఉద్దేశించి తిరిగి తిరిగి ఉపదేశించుచున్నది. ఎటులనినచో ఓ జీవులారా ! మీరు సచ్చిదానందస్వరూపులే అని బోధించుటకై ఆత్మ సద్రూపమేకాని, అనృతరూపము కాదు. చిద్రూపమే కాని జడము కాదు. ఆనందరూపమేకాని దుఃఖరూపము కాదని ఆయాభ్రాంతిని పోగొట్టుటకై మరల మరల బోధించుచున్నదని తెలియుము. కావున శ్రుతిమాత ఆత్మకు సచ్చిదానందములన్నవి అనినంతనే భేదమును బోధించుటలేదు అని

తెలిసికొనుము.

లోకే కేచన వాదినః ఆత్మనః సత్త్వం ధర్మః, చిత్త్వం, సుఖం చ గుణః అతః ఆత్మా సచ్చిదానందస్వరూపో న భవతీతికథయన్తి తన్నివారణార్థమపి శ్రుతిః ఆత్మాసచ్చిదానందస్వరూప ఇతి వదతీతి అవగన్తవ్యం భవద్భిః। శ్రుతేః తాత్పర్యమేవేతి కథం జ్ఞాతవ్యమితి చేత్ సర్వాసామపి శ్రుతీనామ్ ఉపక్రమోపసంహారాది షడ్విధలింగైః అఖండార్థే తాత్పర్యస్యావధారణాదితి మన్తవ్యమ్ । హే స్వామిన్। ఏవం శ్రుత్యైవాఖండార్థః సాధితః, యుక్త్యాపి కృపయా సాధనీయః ఇతి చేత్ శృణు సత్ కిం స్వయమేవ ప్రకాశతే అన్యేనవా। ఆద్యే సదేవ చిత్స్యాత్। అన్యేన చేత్ సతః ప్రకాశకం తదన్యవస్తు సద్విలక్షణం వా సదన్తరం వా। సద్విలక్షణత్వే సతి శశవిషాణాదివత్ అసత్త్వేన తస్యసత్ ప్రకాశకత్వం న సంభవతి । సదన్తరమితి పక్షే తత్ సదన్తరం స్వయం ప్రకాశతేవా అన్యేన ప్రకాశతే వా ఇతి వికల్పే ఆద్య పక్షే స్వత ఏవస్వయం ప్రకాశకత్వే చిత్త్వమ్ స్యాత్ । అన్యేన ప్రకాశకేన ప్రకాశత ఇతి పక్షే పునరపి వికల్పఃపూర్వవదాయాతి। ఏవం వికల్పే క్రియమాణే ఆత్మాశ్రయదోషః, అన్యోన్యా శ్రయదోషఃచక్రకాశ్రయ దోషః, అనవస్థాదోషః ఇతి బహవోదోషా ఆపతేరన్। తస్మాత్ సత్ స్వత ఏవ ప్రకాశతే। సతః స్వయం ప్రకాశత్వే సదేవ చిత్। చిదేవ సత్ ।ఉభయమపి ఏకమేవ । సదన్తరమస్తీతి వేదేషు కుత్రాపినదృశ్యతే। అతఃసత్ స్వయమేవ ప్రకాశతే ఇతి నిశ్చయః అతః సదేవ చిదితి సిద్ధమ్।

లోకమున కొంతమంది ప్రతివాదులు ఆత్మకు సత్త్వము -ధర్మమని, చిత్త్వముసుఖము గుణములని అందువలన ఆత్మ సచ్చిదానందస్వరూపము కాదని అనుచున్నారు. వారి అభిప్రాయమును ఖండించుటకు వేదమాత ఆత్మ సచ్చిదానందస్వరూపమని చెప్పుచున్నదని మీరు గ్రహించవలయును. శ్రుతిభావము ఇదియే అని ఎట్లు తెలియుననినచోసమస్త శ్రుతులకు ఉపక్రమోపసంహారాది షడ్విధ లింగములచే అఖండార్థమొక్కటేయని తాత్పర్యము నిర్ణయింపబడుట వలననే అని తెలియవలెను.

స్వామీ! ఈ విధముగా శ్రుతిచేతనే అఖండార్థమును మీరు సాధించినారు. యుక్తి ద్వారా కూడా ఈ విషయమును సాధింపవలయును.

దయతో సెలవిందు అనినచో సరియేవినుము.సత్తైన ఆత్మస్వయముగా ప్రకాశించుచున్నదా మరి అన్యము చేతనా? స్వయముగానే అన్నచో సద్రూపమే చిద్రూపమగును. మరి ఒక దాని చేత ప్రకాశించుచున్నదన్నచో సత్తును ప్రకాశింపజేయు ఆ అన్య వస్తువు సత్తు కంటె వేరా? మరొక సత్తా సత్తు కంటే వేరైనది అన్నచో అది కుందేటి కొమ్ముమవలె అసత్తగును. అప్పుడు అదిసత్తును ప్రకాశింపజేయకుండవలసియుండును. మరియొక సత్తే సత్తును ప్రకాశింపజేయునను పక్షమున ఆ రెండవ సత్తు స్వయముగా ప్రకాశించునా? లేక మరొక దాని చేత ప్రకాశింపబడునా? అని వికల్పము వచ్చును. అందు మొదటి పక్షమందు సత్తే స్వయముగా ప్రకాశించుచున్నది. కనుక అదేచిత్తు కావలసివచ్చును. మరియొకదాని చేత ప్రకాశించున్నదన్నపక్షమున మరల పూర్వమువలె అది ఎట్టిది అని వికల్పము వచ్చును. ఈవిధముగా మరల మరల వికల్పము చేయబడగా ఆత్మాశ్రయందోషము అన్యోన్యాశ్రయందోషము అనవస్థా దోషముచక్రకాశ్రయదోషము మున్నగుబహుదోషములు కల్గును. కావున సత్తు స్వయముగానే ప్రకాశించునని కనుకనే సత్తే చిత్తని,చిత్తే సత్తని, రెండును ఒకటేనని తేలును. సత్తు కంటె వేరుగా మరియొక సత్తు ఉన్నది అని వేదములయందు ఎక్కడను కనబడుట లేదు. కావున సత్తు స్వయముగానే ప్రకాశించుచున్నది అన్నది నిశ్చయము. అందువలన సత్తే చిత్తు అని సిద్ధమైనది.

తస్యస్వయంప్రకాశమానస్యసతః ఆనందత్వమ్ కథమితిచేత్ ఉచ్యతే। సతః అద్వైతత్వాదానందత్వమ్ । ఆనందఃపూర్ణ ఏవం తిష్ఠతి న అల్పే పూర్ణత్వమ్। అతో ౽ అద్వైతస్యైవ పూర్ణత్వం నద్వైతస్య। కథం సత్ అద్వైతమితి చేత్।హేపుత్ర! సతః సద్వితీయత్వం సదన్తరేణవా సద్విలక్షణేన వా । నాద్యఃసదన్తరస్య శాస్త్రేణ యుక్త్యా అనుభవేన చ అసిద్ధత్వాత్ । న ద్వితీయః సద్విలక్షణస్య శశవిషాణవత్ స్వరూపాభావేన తేన సద్వితీయత్వ స్యవక్తుం అశక్యత్వాత్! తస్మాత్ వికల్పద్వయాత్ అన్యోవికల్పో నాస్తి। అతః ఏకస్యసతో ద్వితీయాభావాత్ అద్వైతత్వం సిద్ధమ్। తేన పూర్ణత్వం సిద్ధమ్। తేన స్వప్రకాశః । సదేవ ఆనందః।

స్వయం ప్రకాశమైన సత్తు ఆనందము ఎట్లైనది అన్నచో చెప్పబడుచున్నది. సత్తు ఎప్పుడును అద్వైతమేయగును. కనుక ఆనందము ఎప్పుడును పూర్ణముగనే ఉండును. అల్పమందు పూర్ణత్వముండదు. కనుక అద్వైతమునకే పూర్ణత్వము గాని ద్వైతమునకు లేదు. సత్తు అద్వైతమెట్లైనదన్నచో కుమారా ! వినుము. సత్తు సద్వితీయము ఎట్లగును? మరియొక సత్తు చేతనా? సత్తుకాని అసత్తు చేతనా? మొదటిది కుదరదు. రెండవసత్తు ఉన్నట్లు శాస్త్రముచే గాని యుక్తిచే గాని అనుభవముచే గాని సిద్ధించదు. సత్తు కంటే వేరైన అసత్తు చేత అని అను రెండవ పక్షమున్నూ కుదురదు. కుందేటికొమ్మువంటి అసత్తునకు స్వరూపమే లేదు. కనుక సద్వితీయత్వము కంటే వేరే ఏవికల్పము ఉండదు. కావున ఒకే ఒక వస్తువునకు ( సద్వస్తువునకు) రెండవది లేనందున అద్వైతము సిద్ధమైనది. అందుచేతనే దానికి పూర్ణత్వమును సిద్ధించినది కావున స్వయం ప్రకాశమైన సత్పదార్థమే ఆనందము.

ఏవం యుక్త్యాపి సచ్చిదానందపదానామఖండార్థత్వంసాధ్యతే।
ఈ విధముగా యుక్తి చేత కూడా సచ్చిదానంద పదములకు అఖండార్థత్వము సాధింపబడుచున్నది.

అఖండార్థత్వం ఏకాదశ వర్ణకేఽ ఉపృక్తమ్ । తథాపి పునరుచ్యతే దార్ఢ్యార్థం శృణు । సర్వేషాం సుషుప్తావేవ సుఖం భాతి। తత్సుఖం జాగ్రత్, స్వప్నయోరివ న నానా । కిన్తు ఏకరూపం నిర్బాధమ్ తస్మాత్ తత్సుఖమద్వైతమేవ। తస్యామవస్థాయాం సూర్యాది ఆలోకానపేక్షంసుషుప్త్యానందస్య ప్రకాశమానత్వాత్ చ తస్య చిత్త్వమ్ । తస్య సుషుప్త్యానందస్య స్వయంప్రకాశకత్వే కిం ప్రమాణమితి చేత్- అనుభవ ఏవ । సుషుప్తౌ స్థితస్య తస్య ఏతావన్తం కాలం సుఖమస్వాప్సమితి స్మరణం భవతి, స్మరణస్యానుభవ పూర్వకత్వనియమాత్। సుషుప్తిసుఖస్యానుభవో వక్తవ్యః।తదానీమనుభవ కారణస్య ఇంద్రియాదేరభావాత్. స్వానుభవః సుషుప్త్యానందస్య స్వయం ప్రకాశకత్వాత్ ఏవ ఇతి జానీహి!

అఖండార్థత్వము పదకొండవవర్ణకములోనే పూర్వము చెప్పబడినది. అయినను దృఢత్వమునకై తిరిగి చెప్పబడుచున్నది. వినుము. అందరికి

సుషుప్తియందే సుఖముఉన్నట్లు తెలియుచున్నది. ఆ సుఖము జాగ్రత్, స్వప్నములలోని సుఖమువలె అనేక ప్రకారములుగా లేదు. కాని ఒకే ఒక రూపముగా దేనిచేత బాధింపబడకుండ ఉన్నది. కావున ఆ సుఖము అద్వైతమే. సుషుప్తియందు సూర్యాదిప్రకాశకములు అవసరము లేకుండగనే ఆనందము తెలియుచున్నది. కనుక ఆ ఆనందమే చిత్తు। సుషుప్తిలోని ఆనందము స్వయంప్రకాశమని చెప్పుటకు ఏమి ప్రమాణము అనినచో అనుభవమే ప్రమాణము సుషుప్తియందు ఉండి లేచిన వానికి నేను ఇంత కాలము సుఖముగా ఉంటిని అని గుర్తుకు వచ్చును. ఈ గుర్తు అనుభవముఉండిననే సంభవించును. కాని మరొక విధముగా కాదు. కావున సుషుప్తి సుఖము అనుభవమేఅనవలయును. అపుడు అనుభవకారణములగు ఇంద్రియములు మున్నగునవి లేవు. కనుక అచ్చటి సుషుప్తిలోని ఆనందము స్వయంప్రకాశమగుటవలననే అని తెలియుము.

నను సుషుప్తావనుభవేనసుఖంచ ప్రకాశతే అజ్ఞానం చ ప్రకాశతే। తయోః మధ్యే సుఖం వా అజ్ఞానం వా స్వప్రకాశవస్త్వితి విచార్యమాణే సుఖమేవ స్వయం ప్రకాశమితి వక్తవ్యమ్। న అజ్ఞానమ్, తస్యా వరణ రూపత్వేన ప్రకాశాభావాత్ అతః సుషుప్తావాత్మరూపం సుఖమేవ స్వప్రకాశం సత్ స్వస్మిన్ ఆరోపితం అజ్ఞానమపి ప్రకాశయతి । అతః తత్సుఖం స్వప్రకాశమేవ, ఇతి అనుభవేనాపి సచ్చిదానంద సదానామఖండార్థత్వం సిద్ధమ్ । సుషుప్తిలో అనుభవము ద్వారా సుఖముఉన్నట్లు అజ్ఞానము ఉన్నట్లు అజ్ఞానము కూడా ఉన్నట్లు తెలియుచున్నది కదా! ఈ రెండింటిలో సుఖమా ? అజ్ఞానమా? ఏది స్వయం ప్రకాశము? అని విచారణ చేసినచో సుఖమే స్వయంప్రకాశకమని చెప్పవలెను. అజ్ఞానము కాదు. అది ఆవరణ రూపమగుటచే స్వయముగా ప్రకాశించదు.కావున సుషుప్తియందు ఆత్మరూపముగా సుఖమే స్వయం ప్రకాశమానమై తనయందు ఆరోపితమైన అజ్ఞానమును కూడా ప్రకాశింపజేయును. కావున ఆ సుఖము స్వయం ప్రకాశమే అని అనుభవము ద్వారా కూడా సచ్చిదానంద పదములకు అఖండార్థత్వము సిద్ధించినది.

ఏవం శ్రుతియుక్త్యనుభవైః ఆత్మనఃస్వగతభేదోనాస్తి। ఏవం స జాతీయ, విజాతీయ, స్వగత భేదానామభావాత్ వస్తు పరిచ్ఛేదో నాస్తి।ఏవం దేశ కాల వస్తు పరిచ్ఛేదాభావేన ఆత్మాపరిపూర్ణ ఇతిసిద్ధమ్ అనేన అఖండైకరసత్వం సిద్ధమ్।

ఈవిధముగా శ్రుతి, యుక్తి అనుభవములచే ఆత్మకు స్వగత భేదము కూడా లేదని తేలినది. ఇట్లే సజాతీయ విజాతీయ స్వగతభేదములు లేనందున వస్తు పరిచ్ఛేదము కూడా లేదని తెలిసినది. దేశ కాలవస్తు పరిచ్ఛేదము లేనందున ఆత్మ పరిపూర్ణమని అందుచే ఆత్మకు అఖండైక రసత్వమున్నదనియు సిద్ధించినది.

హేపుత్ర! ఏవం పరిపూర్ణానందాత్మనో దుఃఖమాగన్తుకం। తత్ దుఃఖం శరీరేణ, శరీరం కర్మణా, కర్మ రాగాదినా, రాగాదిః అభిమానేన, అభిమానః అవివేకేన, అవివేకః అజ్ఞానేన చ భవతి ఇతి జ్ఞాత్వా తదజ్ఞానం జ్ఞానేన బాధితవ్యమితి, జ్ఞానం చ విచారేణ భవతీతి చ ఆత్మా సత్యజ్ఞానానంద స్వరూప ఇతి, దేహాదిప్రపంచః అనృత,జడ, దుఃఖ రూప ఇతి సఃప్రపంచః అధ్యారోప ఇతి చ ఏవం విచార్య తత్త్వమ్ పద వాక్యజన్య జ్ఞానేన స్వాత్మనః అహం బ్రహ్మాస్మీతి యత్ పరోక్షజ్ఞానం తదనుభవేనాత్మసాక్షాత్కారరూపమ్ యదపరోక్ష జ్ఞానం, ఏతత్ చ యః ప్రాప్నోతి స ఏవ "చండాలోఽస్తు సతు ద్విజోస్తుగురురిత్యేషామనీషా మమ" ఇతి భగవత్ పాదాచార్య వచనాత్ కుటీచక, బహూదక, హంస, సన్న్యాసిభ్యఃఅధికతయా పూజనీయః, స ఏవ పరమహంసఃఇతి నిశ్చిత్య, త్వమపి మదుక్త ప్రకారేణ ఆత్మానం సమ్యక్ శ్రుత్వా మత్వా ధ్యాత్వా సాక్షాత్ కృత్య నిత్య, శుద్ధ,బుద్ధ, ముక్త, సత్య పరమానంద అద్వయబ్రహ్మరూపేణ తిష్ఠ।

కుమారా! ఈ విధముగా పరిపూర్ణ ఆనందస్వరూపమైన ఆత్మకు దుఃఖము ఆగంతుకమని ఈదుఃఖము శరీరముచేతను, శరీరము కర్మ చేతను, కర్మరాగాదులచేతను, రాగాదులు అభిమానముచేతను అభిమానము అవివేకముచేతను, అవివేకము అజ్ఞానముచేతను వచ్చునని తెలిసికొని, ఆ అజ్ఞానము జ్ఞానముచేత బాధింపబడవలసినదని జ్ఞానము విచారణచే కల్గునని ఆత్మ సత్యజ్ఞానానందస్వరూపమని ఈ దేహాది

ప్రపంచము అనృత, జడ, దుఃఖ రూపమని, ఆ ప్రపంచము అధ్యారోపమని ఇట్లు విచారణచేసి తత్ త్వం, అను పదముల వాక్యముల అర్థమును విచారణచేసి తద్ద్వారా కల్గిన జ్ఞానముచే నేను బ్రహ్మమును, పరోక్షజ్ఞానమును పొందిదాని అనుభవముద్వారా ఆత్మ సాక్షాత్కార రూపమగు అపరోక్షజ్ఞానమును కూడా ఎవడు పొందునో, ఈ అపరోక్ష జ్ఞానము ఎవరికి ప్రాప్తించునో ఆతడు చండాలుడైనను, బ్రాహ్మణుడైనను, నాకు గురువే అని నా ధృఢ నిశ్చయమని మనీషా పంచకమందు చెప్పిన శంకరభగవత్ పాదాచార్యుల వారి వచనమునుఅనుసరించి కుటీచక, బహూదక, హంస,సన్యాసులకంటె ఆతడే ఎక్కువగా పూజనీయుడు. ఆయనయే పరమహంస అని నిశ్చయించి నీవు కూడా చెప్పిన ప్రకారము ఆత్మను గురించి బాగావిని మననము చేసి, నిదిధ్యాసనము చేసి సాక్షాత్కారమును పొంది నిత్యమై, శుద్ధమై, బుద్ధమై,ముక్తమై, సత్యమై పరమానందమై అద్వయమైన బ్రహ్మరూపముగా ఉండుము.

ఏవం తావత్ ఆచార్యైః వక్తవ్యమ్! శిష్యేణ శ్రోతవ్యమ్। ఇతఃపరం వక్తవ్యమ్ శ్రోతవ్యం చ నాస్తీతి సిద్ధమ్।ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ వాసుదేవయతి విరచితే మననాఖ్య ప్రకరణే ద్వాదశ వర్ణకమ్ సమాప్తమ్॥ ।

ఈ విధముగా గురువు చెప్పవలయును. శిష్యుడు వినవలయును. ఇకపైన చెప్పవలసినది వినవలసినది లేదని సిద్ధించినది.ఇట్లు శ్రీమత్ పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ వాసుదేవయతి విరచితమైన మననాఖ్య ప్రకరణమునందు పన్నెండవవర్ణకము సమాప్తము.

పరమేశ్వరీ పరమేశ్వరార్పణమస్తు.

శ్రీ వాసుదేవార్పణమస్తు

# శ్రీ మత్సురేశ్వరాచార్యకృత
# పంచీకరణవార్తికమ్

ఓంకార స్సర్వవేదానాం సార స్తత్త్వప్రకాశకః
తేన చిత్తసమాధానం ముముక్షూణాం ప్రకాశ్యతే ॥ 1

ఆసీ దేకం పరంబ్రహ్మ నిత్యముక్తమవిక్రియం ।
త త్స్వమాయాసమావేశాత్ బీజమవ్యాకృతాత్మకమ్॥ 2

తస్మాదాకాశముత్పన్నం శబ్దతన్మాత్రరూపకం ।
స్పర్శాత్మక స్తతో వాయుః తేజోరూపాత్మకం తతః ॥ 3

ఆపో రసాత్మికా స్తస్మా త్తాభ్యోగంధాత్మికా మహీ ।
శబ్దైకగుణమాకాశం శబ్దస్పర్శగుణోమరుత్॥ 4

శబ్ద స్పర్శరూపగుణైః త్రిగుణం తేజ ఉచ్యతే ।
శబ్ద స్పర్శరూపరసగుణై రాప శ్చతుర్గుణాః ॥ 5

శబ్దస్పర్శ రూపరసగంధైః పంచగుణా మహీ ।
తేభ్యః సమభవ త్సూత్రం లింగం సర్వాత్మకం మహత్ ॥ 6

తతః స్థూలాని భూతాని పంచ తేభ్యో విరా డభూత్ ।
పంచీకృతాని భూతాని స్థూలానీ త్యుచ్యతే బుధైః॥ 7

పృథివ్యాదీని భూతాని ప్రత్యేకం విభజేద్ద్విధా।
ఏకైకం భాగ మాదాయ చతుర్ధా విభజేత్పునః॥ 8

ఏకైకం భాగ మేకస్మిన్ భూతే సంవేశయే త్క్రమాత్।
తత శ్చాకాశభూతస్య భాగాః పంచ భవంతి హి॥ 9

వాయ్వాదిభాగా శ్చ త్వారో వాయ్వాది ష్వేవ మాదిశేత్।
పంచీకరణ మేతత్స్యాత్ ఇత్యాహు స్తత్త్వవేదినః॥ 10

పంచీకృతాని భూతాని తత్కార్యం చ విరాడ్భవేత్।
స్థూలం శరీరమేతత్స్యా దశరీరస్యచాత్మనః॥ 11

అధిదై వత మధ్యాత్మ మధిభూతమితి త్రిధా।
ఏకం బ్రహ్మవిభాగేన భ్రమాద్భాతి నతత్త్వతః॥ 12

ఇంద్రియై రర్థవిజ్ఞానం దేవతానుగ్రహాన్వితైః।
శబ్దాదివిషయం జ్ఞానం త జ్జాగరిత ముచ్యతే ॥ 13

శ్రోత్ర మధ్యాత్మమిత్యుక్తం శ్రోతవ్యం శబ్దలక్షణం।
అధిభూతం త దిత్యుక్తం దిశ స్తత్రాధిదైవతమ్॥ 14

త్వ గధ్యాత్మమితి ప్రోక్తం స్ప్రష్టవ్యం స్పర్శలక్షణం।
అధిభూతం త దిత్యుక్తం వాయు స్తత్రాధిదైవతమ్॥ 15

చక్షురధ్యాత్మ మిత్యక్తం ద్రష్టవ్యం రూపలక్షణం ।
అధిభూతం త దిత్యుక్తం ఆదిత్యో ఽ త్రాధిదైవతమ్॥ 16

జిహ్వాధ్యాత్మంతయా ఽ స్వాద్య మధిభూతం రసాత్మకం।
వరుణో దేవతా తత్ర జిహ్వాయా మధిదైవతమ్॥ 17

ఘ్రాణ మధ్యాత్మ మిత్యుక్తం ఘ్రాతవ్యం గంధలక్షణం।
అధిభూతం త దిత్యుక్తం అశ్వినా వధిదైవతమ్॥ 18

వా గధ్యాత్మమితి ప్రోక్తం వక్తవ్యం శబ్ధలక్షణం।
అధిభూతం త దిత్యుక్తం ఇంద్ర స్తత్రాధిదైవతమ్ ॥ 19

పాదా వధ్యాత్మమిత్యుక్తం గంతవ్యం తత్ర యద్భవేత్।
అధిభూతం త దిత్యుక్తం విష్ణు స్తత్రాధిదైవతమ్॥ 20

పాయు రింద్రియ మధ్యాత్మం విసర్గస్తత్ర యో భవేత్।
అధిభూతం త దిత్యుక్తం మృత్యు స్తత్రాధిదైవతమ్॥ 21

ఉపస్థేంద్రియ మధ్యాత్మం స్త్ర్యాద్యానందస్య కారణం।
అధిభూతం త దిత్యుక్తం అధిదైవం ప్రజాపతిః॥ 22

మనో ఽ ధ్యాత్మ మితి ప్రో క్తం మంతవ్యం తత్ర యద్భవేత్।
అధిభూతం త దిత్యుక్తం చంద్ర స్తత్రాధిదైవతమ్॥ 23

బుద్ధి రధ్యాత్మమిత్యుక్తం బోద్ధవ్యం తత్ర యద్భవేత్।
అధిభూతం త దిత్యుక్తం అధిదైవం బృహస్పతిః ॥ 25

అహంకార స్తథా ధ్యాత్మ మహంకర్తవ్యమేవ యత్।
అధిభూతం త దిత్యుక్తం రుద్ర స్తత్రాధిదైవతమ్॥ 26

చిత్త మధ్యాత్మమిత్యుక్తం చేతవ్యం తత్ర యద్భచేత్।
అధిభూతం త దిత్యుక్తం క్షేత్రజ్ఞో ఽ త్రాధిదైవతమ్॥ 27

తమోధ్యాత్మ మితి ప్రోక్తం వికార స్తత్ర యో భవేత్।
అధిభూతం త దిత్యుక్తం ఈశ్వరో ౽ త్రాధిదైవతమ్॥ 28

బాహ్యాంతఃకరణై రేవం దేవతానుగ్రహాన్వితైః।
స్వం స్వం చ విషయజ్ఞానం త జ్జాగరిత ముచ్యతే॥ 29

యేయం జాగరితావస్థా శరీరం కరణాశ్రయం।
య స్తయో రభిమానీ స్యాత్ విశ్వ ఇత్యభిధీయతే॥ 30

విశ్వం వై రాజరూపేణ పశ్యే ద్భేదనివృత్తయే।
జ్ఞానేంద్రియాణి పంచైవ పంచ కర్మేంద్రియాణి చ ॥ 31

శ్రోత్రత్వఙ్నయన ఘ్రాణజిహ్వాధీంద్రియపంచకం।
వాక్పాణిపాదపాయూపస్థాః కర్మేంద్రియపంచకమ్॥32

మనో బుద్ధి రహంకారః చిత్తం చేతి చతుష్టయం।
సంకల్పాఖ్యం మనోరూపం బుద్ధి ర్ని శ్చయ రూపిణీ॥ 33

అభిమానాత్మక స్తద్వత్ అహంకారః ప్రకీర్తితః।
అనుసంధానరూపం చ చిత్త మిత్యభిధీయతే॥ 34

ప్రాణో ౽ పాన స్తథా వ్యాన ఉదానాఖ్య స్తథైవచ।
సమానశ్చేతి పంచైతాః కీర్తితాః ప్రాణవృత్తయః॥ 35

ఖంవాయ్వగ్న్యంబుక్షితయో భూతసూక్ష్మాణి పంచవ।
అవిద్యాకామకర్మాణి లింగం పుర్యష్టకం విదుః ॥ 36

ఏతత్సూక్ష్మశరీరం స్యాత్ మాయికం ప్రత్యగాత్మనః।
కరణోపరమే జాగ్రత్ సంస్కారోత్థ ప్రబోధవత్॥ 37

గ్రాహ్యగ్రాహకరూపేణ స్ఫురణం స్వప్న ఉచ్యతే।
అభిమానీ త యోర్యస్తు తైజసః పరికీర్తితః ॥ 38

హిరణగర్భరూపేణ తైజసం చింతయేద్బుధః।
చైతన్యాభా సఖచితం శరీరద్వయకారణమ్॥ 39

ఆత్మా జ్ఞానం తదవ్యక్తం అవ్యాకృతమితీర్యతే।
న సన్నాసన్న సదస ద్భిన్నాద్భిన్నం న చో భయమ్॥ 40

న సభాగం న నిర్భాగం న చాప్యుభయరూపకమ్।
బ్రహ్మాత్మైక్యకత్వ విజ్ఞానం హేయం మిథ్యాత్వకారణాత్॥ 41

జ్ఞానా నా ముపసంహారో బుద్ధేః కారణతాస్థితిః।
వటబీజే వట స్యేవ సుషుప్తి రభిధీయతే॥ 42

అభిమానీ తయో ర్యస్తు ప్రాజ్ఞ ఇత్యభిధీయతే।
జగత్కారణ రూపేణ ప్రాజ్ఞాత్మానం విచింతయేత్॥ 43

విశ్వతైజస సౌషుప్తవిరాట్ సూత్రాక్షరాత్మభిః।
విభిన్నమివ సంమోహాత్ ఏకం తత్త్వం చిదాత్మకమ్॥ 44

విశ్వాదికత్రయం యస్మాత్ వైరాజాది త్రయాత్మకం।
ఏకత్వేనైవ సంపశ్యేత్ అన్యాభావప్రసిద్ధయే॥ 45

ఓంకారమాత్రమఖిలం విశ్వప్రాజ్ఞాదిలక్షణం।
వాచ్యవాచకతాభేదాత్. భేదేనానుపలబ్ధితః॥ 46

అకారమాత్రం విశ్వః స్యాత్ఉకార స్తైజసః స్మృతః।
ప్రాజ్ఞో మకార ఇత్యేవం పరిపశ్యేత్క్రమేణతు॥ 47

సమాధికాలా త్ప్రాగేవం విచింత్యాతి ప్రయత్నతః ।
స్థూలసూక్ష్మ క్రమాత్సర్వం చిదాత్మని విలాపయేత్॥ 48

అకారం పురుషం విశ్వంఉకారే ప్రవిలాపయేత్।
ఉకారం తై జసం సూక్ష్మంఅకారే ప్రవిలాపయేత్॥ 49

మకారం కారణం ప్రాజ్ఞం చిదాత్మని విలాపయేత్।
చిదాత్మా ఽ హం నిత్యశుద్ధ బుద్ధముక్తసదవ్యయః॥ 50

పరమానందసందోహ వాసుదేవోఽ హమోమితి।
జ్ఞాత్వా వివేచకం చిత్తం తత్సాక్షిణి విలాపయేత్॥ 51

చిదాత్మని విలీనం చేత్ తచ్చిత్తం నైవ చాలయేత్।
పూర్ణబోధాత్మనా ఽ ఽ సీత పూర్ణాచల సముద్రవత్ ॥ 52

ఏవం సమాహితో యోగీ శ్రద్ధాభక్తి సమన్విత ః।
జితేంద్రియో జితక్రోధః పశ్యే దాత్మాన మద్వయమ్॥ 53

ఆదిమధ్యావసానేషు దుఃఖం సర్వమిదం యతః।
తస్మాత్సర్వం పరిత్యజ్య తత్త్వనిష్ఠో భవేత్సదా॥ 54
యః పశ్యే త్సర్వగం శాంత మానందాత్మాన మద్వయం।

న తేన కించి దాప్తవ్యం జ్ఞాతవ్యం వా ఽ వశిష్యతే ॥ 55

కృతకృత్యో భ వేద్విద్వాన్ జీవన్ముక్తో భవేత్సదా।
ఆత్మన్యేవారూఢ భావో జగదేత న్న వీక్షతే॥ 56

కదాచిద్వ్యవహారేషు ద్వైతం యద్యపి పశ్యతి।
బోధాత్మవ్యతిరేకేణ న పశ్యతి చిదన్వయాత్॥ 57

కింతు పశ్యతి మిధ్యేదం దిజ్మోహేందు విభాగవత్।
ప్రతిభాసశ్శరీరస్య తదా ప్రారబ్ధసంక్షయాత్॥ 58

'తస్యతావదేవచిరం' ఇత్యాది శ్రుతిరబ్రవీత్।
ప్రారబ్ధస్యానువృత్తిస్తు ముక్త స్యాభాసమాత్రతః॥ 59

సర్వదా ముక్త ఏవస్యాత్ జ్ఞాతతత్త్వః పుమానసౌ।
ప్రారబ్ధభోగశేషస్య సంక్షయే తదనంతరమ్॥ 60

అవిద్యాతిమిరాతీతం సర్వాభాసవివర్జితం।
చైతన్య మమలం శుద్ధం మనోవాచామగోచరమ్॥ 61

వాచ్యవాచకనిర్ముక్తం హేయోపాదేయవర్జితం।
ప్రజ్ఞానఘన మానందం వైష్ణవం పదమశ్నుతే॥ 62

ఇదం ప్రకరణం యత్నాత్ జ్ఞాతవ్యం భగవత్తమైః।
అమానిత్వాదినియమైః గురుభక్తి ప్రసాదతః॥

ఇమాం విద్యాం ప్రయత్నేన యోగీ సంధ్యాసు సర్వదా।
సమభ్యసే దిహాముత్ర భోగానాస క్తధీః సుధీః॥ 63

రాగద్వేషాదిరహితం స్వాత్మానం చింతయేత్సదా।
స ఏవ జీవన్ముక్తో వా న పునర్భవసంభవః॥ 64

ఇతి శ్రీమత్సురేశ్వరాచార్యకృతం
పంచీకరణ వార్తికం
సమాప్తమ్

ఇది శ్రీ బ్రహ్మీభూత శ్రీ తాడేపల్లి శ్రీదేవీ రాఘవనారాయణ శాస్త్రి, కరకమల సంజాతుడు శ్రీ వేంకట సుబ్బాంబావెంకటప్పయ్య శాస్త్రివర్యుల ద్వితీయపుత్రుడు భోగీశ్వర శర్మచే చేయబడిన లఘువాసుదేవమననము యొక్క తెలుగు అనువాదము. శ్రీ సురేశ్వరాచార్యకృత పంచీకరణ వార్తికము కూడా ఇందు సంకలనము చేయబడినది.

ఇట్లు
**నోరి భోగీశ్వర శర్మ,**
ఎం.ఎ., పి.హెచ్.డి.,
12-12-3/1, గండికోట వారి వీధి,
కొవ్వూరు - 534 350.
పశ్చిమ గోదావరి జిల్లా.

హరిః ఓమ్.తత్ సత్



